తరాలుగా సాగుతున్న జీవనయానంలో చటుక్కున మెరిసే

# కొసమెరుపులు

(మొదటి భాగం)

డా॥ జి.వి.పూర్ణచంద్



శ్రీమధులత పబ్లికేషన్స్

డోర్ నెం. 28-3-49, సంజీవయ్య కాలనీ,

అరండల్‌పేట, విజయవాడ - 520 002.

KOSAMERUPULU
కొసమెరుపులు

.By
**Dr.G.V. PURNACHAND** B.A.M.S.,
SUSRUTA AYURVEDIC SPECIALITY HOSPITAL
1St Floor, Satnam Towers,
Opp : Buckinghampet Post Office,
Governorpet, VIJAYAWADA - 520 002
Phs : (O)5678185, 5568185, (R)2483677
Mobile : 94401-72642



Rs : **30/-**

Ist Edition :
**January-2003**

Title Design :
**D. RAMA KRISHNA REDDY**

Type Setting By :
**PRINT PLAZA**
VJA. Ph : 5519696

Printing at :
**VAASU OFFSET.** VJA-2. **Ph : 2438324. 5528324**

Published By :
**SREE MADHULATHA PUBLICATIONS**
28-3-49,Sanjeevaiah Colony, Arundelpet,
VIJAYAWADA -520 002,
Ph : 2434320 (O), 2436936 (R)

2

## ఆత్మీయంగా...

ముప్పయి సాహితీ వసంతాలు
తనవిగా చేసుకున్నా
తనివి తీరని అక్షరాల శ్రీమంతుడు -
కపటాలూ కల్లలూ లేని స్నేహావరణంలో
సాహితీ తపస్సులే ఆంతరంగికులుగా
ఆత్మీయులుగా కల ధీమంతుడు -
పాతికేళ్ళ నుంచీ నాకు సన్మిత్రుడు -
'తెలుగు సాహిత్య చరిత్ర సృష్టికర్త -
శాస్త్రీయ విమర్శకుడు -
మనిషి మానవుడిగా ఎదగాలని ఎప్పుడూ తపించే
**'ద్వా.నా. శాస్త్రి'**
అనే డా॥ ద్వాదశి నాగేశ్వర శాస్త్రికి

- పూర్ణచంద్...

## ఆమోదంగా...

అనుభవానికీ, అనుశీలనానికీ, అపురూప కృషికీ
మరోపేరు అయిన నిత్యచైతన్య జీవి
**జి.వి. పూర్ణచంద్**
అటు వైద్యరంగంలోనూ ఇటు సాహిత్య రంగంలోనూ
చికిత్స చేయగల డాక్టర్.
మా పాతికేళ్ళ స్నేహానికి ఈ పుస్తకాన్ని
అంకితం తీసుకొంటున్నాను గానీ
నేనే ఓ పుస్తకం అసలు అంకితం ఇవ్వాలి.
ఈ ప్రతిభామూర్తితో ఇలా
వియ్యమందడం కంటే ఆనందం ఏముంటుందీ...?

- ద్వా.నా. శాస్త్రి

# సాహితీ సప్త సింధు మా పూర్ణచందు

రచనలు చేయడానికి వస్తువుల కోసం వెతుక్కోవటం అలవాటు లేని రచయిత డాక్టర్ పూర్ణచంద్. అలా అని పుంఖాను పుంఖాలుగా ఏదోకటి రాసేయాలనే తపన కూడా ఆయనలో కన్పించదు. మనసును తటిల్లతలా కుదిపిన సంఘటనల్నీ ఆయన తన మెదడు సొరుగుల్లో దాచేస్తాడు. ఎప్పుడు ఏది కావాలంటే అది చేతిలోకి వస్తుంది. అదే రచనా వస్తువవుతుంది... ఆయన సొంత గ్రంథాలయంలో చెయ్యి చాపితే కావాల్సిన పుస్తకం దొరికినట్లు!

'సప్తసింధు' చారిత్రక దృష్టితో, 'కాంతి స్వప్న' తాత్విక దృష్టితో 'దీనజన బాంధవుడు' సామాజిక దృష్టితో, 'అమలిన శృంగారం' శాస్త్రీయ దృష్టితో రచించారు. నేటి ఈ కొసమెరుపులుతో సహా సాహిత్య'సృష్టిలో ఆయన దర్శనీయ దృష్టికి ఈ రచనలు నికషోఫలాలు. ఇది ఆయన 27వ రచన.

ఒకవైపు సాహితీ కార్యకర్తగా కార్యక్రమాలు చేస్తూ, లయన్స్ సేవా కార్యక్రమాల్లో 'గుడ్ సమరిటన్' పాత్ర పోషిస్తూ, ఊపిరాడకుండా నిమగ్నమై ఉంటాడు. ఎన్నో సంస్థలకు మార్గదర్శిగా, ఎందరికో సద్యఃస్ఫూర్తిగా ఉంటాడు. అందుకే గురూజీ అని ఆప్యాయంగా పిలుచుకునే వారెందరో.

మరోవైపు తన హాస్పిటల్‌కి రాష్ట్రం నలుమూలల నుంచి వచ్చే పేషంట్లకు కౌన్సిలింగ్, వ్యాధి లక్షణాలు, నివారణ వివరిస్తూ క్షణం తీరిక లేకుండా వుంటాడు. ఇంకో వైపు తనపై ఎంతో విశ్వాసం ఉంచి వచ్చే రోగులకు తానే సొంతంగా ఫార్ములాలు రూపొందించి చేసిన ఔషధాలను ఇస్తుంటాడు. ఆంధ్రదేశంలో పేరున్న ఆయుర్వేద వైద్యులలో వీరొకరు.

వివిధ వృత్తుల వ్యక్తులు, సాహితీ మిత్రులతో ఆయన చాంబర్ సందడిగా వుంటుంది. ఏ విషయం తీసుకున్నా వివరణాత్మకంగా, విశ్లేషాత్మకంగా సామాన్య పాఠకుడికి సైతం అవగతమయ్యే విధంగా చెప్పడం ఆయన ప్రజ్ఞ. చాలా మంది సైన్సు రచయితలకు లేని లక్షణం ఇది.

ఆంధ్రం, ఆంగ్లం, సంస్కృతం మూడు భాషల సోయగాలను పుడిసిలి పట్టి సొంతం చేసుకున్నట్లు కనిపిస్తాడు ఆయన. దేని గురించి మాట్లాడినా 'సాధికారికత', దాని వెనుక పరిశ్రమ గోచరిస్తుంది. అలతి అలతి మాటల్లో అనంతత్వాన్ని అందుకోవడం సాధ్యమా అనీ అనిపిస్తుంది.

అందుకే అంటాను... సాహితీ సప్తసింధు మా పూర్ణచందు అని... సాహితీ 'జీవి'త రజతోత్సవ వత్సరాన - మరో ఐదుపదుల ఏళ్ళు ఇదే కృషి ఇదే స్ఫూర్తి కొనసాగించాలని కోరుతూ.. ఆప్యాయంగా...

: ¨fi ˇhw

**- డి. చంద్రశేఖర్**
**జర్నలిస్టు**

# పిడుగులకు ముందు....

చూసినవీ, విన్నవీ - అలానే చదివిన ప్రతిదీ కాకుండా కొన్ని మాత్రమే అవిస్మరణీయంగా నిలచిపోతాయి. అవి నలుగురికీ పంచమని తొందరపెడతాయి. రచయితనైతే మరీను.

డాక్టర్ పూర్ణచంద్‌గారికి స్వతః పుస్తకపఠనం ఒక తీరని దాహం. ఏ కారణం వల్లనో ఆయన అసంఖ్యాకంగా జీవిత చరిత్రలు, స్వీయచరిత్రలు చదివారు. అవసరమైన అంశాలను ఉపయోగించగా ఇప్పుడు పరిశేషం చక్కని ఆఖ్యాయికలుగా మనకు దక్కుతున్నది.

ఈ పుస్తకంలోని ఖండికలలో ఏవీ ఆయన సొంతం కాదు. అంటే కల్పితం కాదు. సంకలనం, వ్యాఖ్యానం మాత్రమే ఆయన సొంతం. తన సంకలనానికి 'కొసమెరుపులు' అని పేరు పెట్టడమే తమాషాగాఉంది. అసలు మనకు మెరుపులే ఉన్నాయిగాని కొసమెరుపులు లేవు. ఎ.బి.కె.గారు ఇంగ్లీషులో 'టెయిల్ స్పార్క్' అన్న మాటకు అందంగా చేసిన మిధ్యానువాదమే కొసమెరుపు. వాస్తవానికి ఏదైనా మెరుపే! ఏ మబ్బు కొసలోను మెరుపు మెరవదు. చెమక్‌మనిపించే మెరుపు మెరవదు. చెమక్‌మనిపించే ముగింపు కొసమెరుపు అయితే విషయానికి ప్రాధాన్యం ఉండదు. చివరలో ముక్తాయింపునకే ప్రాధాన్యం ఉంటుంది. మెరుపు జిగేల్ అనిపించి మాయమవుతుది. మిగిలేది మబ్బు మాత్రమే. బహుశా ముక్తాయింపు అనడానికి ఎ.బి.కె కొసమెరుపు అన్నారేమో!

డాక్టర్ పూర్ణచంద్‌గారు వ్రాసిన అన్ని అఖ్యాయికలకు చిరంజీవత్వం ఉన్నది. తటిల్లతలా మెరిసి మాయమయ్యే ఆయుర్దాయం కాదు ఈ ఖండికలది. ఎందువల్లనంటే అవి విషయపూర్ణమైనవి. కాని, వర్తమాన సామాజిక విలువలకు, స్వరూపాలకు, ఈ ఖండికలలోని వస్తువులు కొసమెరుపులు. చాలా అబ్బురపర్చుతాయి. జిగేల్ అనిపిస్తాయి మెరుపుల్లాగా. ఉదాహరణకు 'హిందూ' పత్రిక పూర్వగాథ. అది నేటి ఆ సంస్థ స్వరూపానికి కొసమెరుపు.

సత్తువ తక్కువైన శృంగార పురుషులకు నరాలు, కరాలు బలంగావున్న మనుషుల శృంగారం గురించి వ్రాసిన ఆఖ్యాయిక ఒక కొసమెరుపు. పరీక్షలంటే హడలే' అన్న ఖండిక భిన్నమైన కొసమెరుపు. ఎంచుకొన్న విషయమే మెరుపు లాంటిది. ఇలా కొసమెరుపుల్లో చాలా వైవిధ్యం చూపించారు.

నా అభిప్రాయంలో మనలను అద్భుతపరచే ప్రతి సమాచారంలోను చమక్ ఉండదు. అలా వుంటేనే కొసమెరుపు (ఎబికె వారి అనువాదం కాదు) అవుతుంది. అలా చూస్తే అద్భుత పరచే సమాచారంగల ఖండికలు కూడా ఈ పుస్తకంలో ఉన్నాయి. ఇవన్నీ సాధారణ పాఠకులకు సులభంగా అందని ఆలోచనామృత గుళికలు.

విషయప్రధానం కనుక కొన్ని ఖండికలు విస్తారం కాక తప్పదు. ముఖ్యంగా 'శ్రీ రాములుగారి ఋణం తీరేనా', 'లొల్ల లక్ష్మీధరపండితుడు' లాంటివి. నిడివి పెరిగితే చమక్కు తక్కువవుతుంది. అయితే రచయిత ఏమీ చెయ్యలేడు. ఎందువల్ల నంటే అవి విషయప్రధానమైనవి. తిరుపతి కవులంతటివాళ్లే ఏమీ చెయ్యలేకపోయారు.

వస్తుపరంగా చూస్తే తిరుపతి వేంకటకవులు, దిగవల్లి వేంకటశివరావుగారు కథలు - గాథలు పేరుతో వ్రాసినా, జ్ఞాపకాలని, తెగిన జ్ఞాపకాలనీ గాని, ఎవరు ఏ పేరుతో వ్రాసినా ఈ సాహితీ విన్యాసం ప్రమాదకరమైనదేనని నిరూపించారు. ఎందుకు ప్రమాదమంటే అందరికీ కాకపోయినా విషయం ఏ కొద్దిమందికైనా తెలిసినదే కావడం. అందరికీ తెలిసిన పాట పాడి అందరినీ మెప్పించడం ఎంత కష్టమో అంత కష్టం ఖండికలు వ్రాసి మెప్పించడమంటే... మేమిద్దరం ఒకరినొకరు దాదాపు పాదిక సంవత్సరాల నుంచి తెలిసినా కాస్తంత సన్నిహితంగా ఉంటున్నది ఈ మధ్యనుంచి మాత్రమే! ఈ మధ్యనే అర్థమైంది - వ్రాద్దామన్న కండూతితోగాక ఒక పేజీ వ్రాయడానికి పది పేజీలు చదివి - అలా పది పుస్తకాలు చదివే పుస్తకశ్రమ ఆయనదని! అంతేకాదు - ఆయన 'ఇంట లెక్చువల్ డెమోక్రసి 'ఎలాంటిదో, ఎంత నిగర్వి అయిన పాఠకుడో!! పంచుకొనే, పెంచుకొనే రచయిత. ఒక పుస్తకం వ్రాసేలోగా పదిమందితో పంచుకోవడం, పదిపుస్తకాలు చదవడం, వ్రాసింది తన పదిమందికి వినిపించడం, సరియైన సవరణ ఎవరైనా చెబితే, అవసరమైతే నిలువునా కత్తిరించగల నిరహంకారి. ఇది సాధారణంగా రచయితలో కనిపించని గొప్ప లక్షణం - అందువల్లనే ఇప్పుడు 'కొసమెరుపులు' మెరిపించారు. త్వరలో పిడుగులు కురిపించనున్నారు.

- లంక వెంకటరమణ

(పాత్రికేయులు, విజయవాడ చరిత్ర

పరిశోధన మండలి వ్యవస్థాపక సభ్యులు)

స్వదేశీ ఉద్యమం పై ఆనాటి

# సిఐడీ రిపోర్ట్

1907 జూలై 16

మచిలీపట్నంలో సి.రుక్మాంగద అనే ఓ సి.ఐ.డి. ప్రభుత్వానికి ఇంగ్లీషులో పంపిన రిపోర్ట్ ఇలా సాగింది...

"మచిలీపట్నం నుంచి బెజవాడకు పడవ మీద ప్రయాణం చేస్తుంటే, గడియారం సూర్యనారాయణ అనే పంతులు గారితో నాకు పరిచయం అయ్యింది. కృష్ణాజిల్లా పామర్రులో ఆయన బ్రిటిష్ ప్రభుత్వానికి 200 రూపాయలు శిస్తు కడుతున్న మోతుబరి రైతు.

స్వదేశీ ఉద్యమం మీద ఆయన అభిప్రాయాన్ని మాటల్లో పెట్టి కూపీ లాగేందుకు అడిగాను. ఆయన ఠక్కున "పిచ్చివాళ్ళు చేసే పని" అన్నాడు. "ఈ ప్రభుత్వం చాలా దొడ్డది. గౌరవనీయమైంది. స్టూడెంటు కుర్రాళ్ళు, పనిలేని ప్లీడర్లూ ఇదంతా చేస్తున్నారు". అని కూడా అన్నాడు.

ఒకసారి ఈ స్వదేశీ ఉద్యమం మనుషులు పామర్రు కూడా వచ్చారు. ఊళ్ళో పెద్దని అని నన్ను కూడా పిలిచారు. నేను వెళ్ళాను. వాళ్ళు చెప్పిందంతా విన్నాను. నాకు చాలా అసంతృప్తి అన్పించింది. మా పామర్రులో మీకు ఎవరూ మద్దతు ఇవ్వరు-" అన్నానని ఆయన తెలిపాడు.

సర్! స్వదేశీ అంటే, ఏమిటో మీరే చెప్పండి! నాలుగణాలు పెడితే మంచి గుడ్డ ముక్క దొరుకుతుంది. బహుశా ఇదే స్వదేశీ గుడ్డ అయితే రెండు రూపాయలు పెట్టి

కొనవలసి వస్తుందనుకొంటాను. ఇదంతా పెద్ద గోల! మా పల్లెటూరు వాళ్ళకి ఇలాంటివి పట్టవండీ... వీళ్ళు ఇలా ఎంతకాలం ఈ ఉద్యమాన్ని నడపగలరు...? ఇది పట్నం వాళ్ళు చేస్తున్న పని. "వందేమాతరం - మందీ రాజ్యం" అంటూ వీధినపడి అరుస్తుంటారు - ఒక వేళ వీళ్ళకే ఈ రాజ్యాన్ని ఇస్తే దీన్ని తీసికెళ్ళి మనల్ని నానా హింసలూ పెట్టే మహమ్మదీయులకి అప్పచెప్పేస్తారు. ఒకసారి అప్పచెప్పారు కదా... అలానే చేస్తారు మళ్ళీ!" అంటూ మాట్లాడసాగాడు.

మరి, ప్రజలు మెచ్చుకోకపోతే ఇంత ఉద్యమం ఇన్ని సమావేశాలు, అంతంతమంది జనం ఎలా వస్తున్నారని నేను అడిగానాయన్ని!

అప్పుడతను చెప్పాడు. "సర్! ఈ బ్రిటిష్ ప్రభుత్వం మంచిది. ఈ బ్రిటిష్ రాజు చాలా మంచివాడు. ఆయన ఎక్కడో చాలా దూరాన లండన్ నగరంలో కూర్చుని వున్నాడు - రాజుగారి పేరుతో ఇక్కడ పాలన చేస్తున్న బ్రిటిష్ ఆఫీసర్లు కూడా చాలామంది మంచివాళ్ళే!

కొంతమంది యూరోపియన్ ఉద్యోగులు, కొంతమంది భారతీయులైన ఉద్యోగులే ప్రజల్లో అసంతృప్తికి కారణం అయి ప్రభుత్వానికి చెడ్డ పేరు తెచ్చిపెడ్తున్నారు.

ఇలాంటి ఉద్యోగుల మీద సరయిన పర్యవేక్షణ లేకుండా పోయింది - ఉదాహరణకి నీటిపారుదల శాఖ ఉద్యోగుల్నే తీసుకోండి. భూమిమీద శిస్తు తీసుకొంటూనే ఎకరానికి ఆరురూపాయలు నీటి పన్ను వసూలు చేస్తున్నారు. కానీ, నీటిని మాత్రం పంటలకు వదలడం లేదు. పంట చేతి కొచ్చి, నీరు అవసరం అయ్యే సమయానికి కాలవల జవాను (కెనాల్ ప్యూన్) స్లూయిస్ (గేట్లు) తెరిచి నీరు వదిలేవాడు కాదు. ప్రతి రైతూ వాళ్ళకి ఎంతో కొంత ముట్టచెపితే గాని ఇది అయ్యేదికాదు. నీరు అవసరం అయిన ప్రతీ సారీ వీళ్ళు ఇలానే చేస్తారు.

వీళ్ళమీద కలెక్టర్‌కి ఫిర్యాదు చేశామనుకోండి - ఆయన దాన్ని డిప్యూటీ కలెక్టర్ గారికి పంపుతాడు. ఆయన తాసిల్దార్‌కీ, తాసిల్దార్ రెవెన్యూ ఇన్‌స్పెక్టర్‌కీ రెవెన్యూ, ఇన్‌స్పెక్టర్ కరణం గారికీ పంపుతాడు. - కరణం ఈ కాయితాన్ని చెత్తబుట్టలో పారేస్తాడు. ఇలా వుంది మన వాళ్ళ పాలనా విధానం. కావాలంటే మరింత పన్ను వసూలు చేసి, ఇలాంటి లంచగొండుల్ని ఎందుకు నిరోధించలేదు ప్రభుత్వం...?

ఒక చిన్న కాలవ స్లూయిస్ మీద ఒక ఓవర్‌సీర్, ఒక గుమాస్తా, ఒక ప్యూను, ఒక వాచ్‌మెన్... ఇంతమంది ఎందుకండీ...? అవసరం అయిన దానికన్నా రైతు ఎక్కువ నీరు తీసుకొని ఏం చేసుకొంటాడు? మా పంటలే నీళ్ళలో మునిగి నాశనం అవుతాయి.

మా ప్రజలందరూ ఈ ప్రభుత్వానికి పిల్లలం కామా? మాకు కావలసిందేమిటీ; మా అవసరాలేమిటి? అవన్నీ సక్రమంగా తీర్తున్నాయా లేదా... అని ఆలోచించ వలసిన బాధ్యత ఈ ప్రభుత్వానికి లేదా...?

ఈ ఉన్నతాధికారులు ఊళ్ళోకి వచ్చారంటే చాలు, వీళ్ళకి పాలు, గుడ్లు, కోళ్ళూ అన్నీ ఉచితంగా మేమే ఏర్పాటు చెయ్యాలి. తిరగడానికి బళ్ళు మేమే ఏర్పాటు చెయ్యాలి. ఇంత చేసినా, కనీసం "మీరు ఎలా వుంటున్నారు, మీకు ఏం కావాలి...?" అని కూడా అడగరు. సర్ ! ఇవ్వాళ రోజులు ఎలా వున్నాయంటే డబ్బులున్నవాడిదే రాజ్యంలా వున్నాయి.

ఎవణ్ణయినా హత్య చేసి వచ్చి ఓ రెండు వేలో, మూడు వేలో ముట్టచెపితే చాలు - స్వేచ్ఛగా తిరగొచ్చు.

ఆఖరికి న్యాయస్థానాలు కూడా డబ్బిచ్చిన వాడివైపే తీర్పులు చెప్తున్నాయి. నిజానికి ఇలాంటి పాపకృత్యాలన్నీ చేస్తున్న వాళ్ళలో మా వాళ్ళుకూడా కొందరు లేక పోలేదు. మీ వాళ్ళయినా మావాళ్ళయినా ప్రభుత్వానికి అదుపుండాలి కదండీ - ఇంక ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంట్ వుందంటే అంతకన్నా చెడ్డది మరొకటి లేదు.

ప్రజలకోసం పని చేసే ఆఫీసర్ ఈ రోజుల్లో ఎవరండీ? ఎవడిక్కావాలండీ ప్రజలు....?? అరండేల్ లాంటి అద్భుతమైన కలెక్టర్‌లు ఒకప్పుడు వుండేవారు. ఆయన దగ్గర రెడ్నాం సూర్యారావు నాయుడు అనే డెప్యూటీ కలెక్టర్, తుర్లపాటి వాసుదేవ మూర్తి పంతులు అనే తాసిల్దారూ వుండేవారు...

ఈ తుర్లపాటి పంతులుగారు బెజవాడ తాసిల్దార్‌గా చేశారు. పై ఆఫీసర్ల కరుణా కటాక్షాల కోసం లంచాలు మేపలేదని ఆయనకు ప్రమోషను నిలిపేశారట. ఈ పాటికి డిప్యూటీ కలెక్టర్ కావాల్సిన వాడాయన.

ఇలాంటి నిజాయితీ పరులైన అధికార్లున్నంత కాలం మా ప్రాంతాల్లో లంచగొండితనం ఎంతో అదుపులో వుండేది.." ఇలా సాగుతుందీ వివరణ... ఇదంతా చదువుతుంటే షేక్స్పియర్ డ్రామాలో యాంటోనీ 'శ్మశానోపన్యాసం' గుర్తుకొస్తుంది...

పామర్రు గ్రామపెద్ద "గడియారం సూర్యనారాయణ" సి.ఐ.డీ ఆఫీసర్‌ని గుర్తించి బ్రిటిష్‌వారు గొప్పవారే నంటూనే పెట్టిన చురకలు ఇవి -

వంద సంవత్సరాలు జరిగిన తర్వాత కూడా అవే చురకలు అధికారంలో వున్న నేటి మేటి ప్రభుత్వాలకూడా తగిలి ఎవరైనా భుజాలు తడుముకుంటే మనం చెయ్యగల్గిందేమీ లేదు -

**(ది ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఆంధ్రప్రదేశ్ - 2వ భాగం)**

## స్నేహ బంధానికి తీపి గుర్తు

# "ది హిందూ"

జాతీయ భావావేశం కల్గిన యువకుల మధ్య స్నేహబంధం అద్భుతాలు చేయిస్తుంటుంది ఒక్కోసారి.

1878 సెప్టెంబర్ 20న మద్రాస్‌లో ట్రిప్లికేన్ లిటరరీ సొసైటీలో సభ్యులుగావున్న అత్యంత ఉత్సాహపరులైన ఆరుగురు యువకులు ఉప్పొంగిన స్వాతంత్ర ఆవేశంతో 'ది హిందూ' అనే పత్రికని అచ్చువేసి విడుదల చేశారు.

జి. సుబ్రమణ్య అయ్యర్, యం.వీర రాఘవాచారియార్, టి.టి. రంగాచారియార్, పి.వి.రంగాచారియార్, డి.కేశవరావు పంత్, యన్.సుబ్బారావు పంతులు - వీళ్ళే ఈ ఆరుగురు యువకులు. ఈ ఆరుగురూ నిరుద్యోగులే ! ఇంత సాహసోపేతమైన నిర్ణయం తీసుకోవడానికి ముఖ్య కారణం - టి.ముత్తుస్వామి అయ్యర్ అనే భారతీయుణ్ణి మద్రాస్ హైకోర్టుకు జడ్జిగా నియమించినప్పుడు బ్రిటిష్ అనుకూల పత్రికలు ఎద్దేవా చేస్తూ వ్యాసాలు రాయడమే!

భారతీయులకు అనుకూలంగా రాసే పత్రికలే లేవనే అంశం వారికి కోపకారణం అయి, ఇలా 'దిహిందూ' పత్రికని వారిచేత ప్రారంభింప చేసింది.

రూపాయి ముప్పావలా అప్పు చేసి, ఆ డబ్బుతో సెప్టెంబర్ 20, 1878న 80 కాపీలు అచ్చువేసి 'దిహిందూ' అనే ఆంగ్ల పత్రికని విడుదల చేశారు.

$\frac{1}{4}$ డెమ్మీలో ఎనిమిది పేజీలతో ప్రతి బుధవారం విడుదల అవుతుందని అందులో ప్రకటించారు. ఎనిమిది రూపాయలు సంవత్సర చందాగా నిర్ణయించారు.

OURSELVES' అనే అద్భుతమైన ఎడిటోరియల్‌ని రాశారు. ముత్తుస్వామి అయ్యర్‌ని మద్రాస్ హైకోర్టు జడ్జిగా నియమించడాన్ని సమర్థించడం, బ్రిటిష్ అనుకూల పత్రికల రాతల్ని ఖండించడం ఇందులో ముఖ్యాంశాలు.

ఆర్. రామచంద్రయ్యర్ అనే న్యాయవాది ఈ యువకుల్ని ప్రోత్సహించాడు. ఆ తర్వాత మైసూరు హైకోర్టులో జడ్జిగా చేశాడాయన.

'మద్రాసీ' అనే ఓ ఆగిపోయిన పత్రిక చందాదార్లు 500 మంది అడ్రసులిచ్చి, వాళ్ళందరికీ పంపమని చెప్పి, వాళ్ళు 'ది హిందూ' చందాదార్లు అయ్యేలా చూస్తానని రామచంద్రయ్యర్ హామీ ఇచ్చాడు.

అలా ఏర్పడిన చందాదారులే మూల స్తంభాలుగా 'ది హిందూ' మొదట వారపత్రికగా తర్వాత త్రైవారపత్రికగా కుంటుకుంటూ పుంజుకొంటూ నడవసాగింది.

ఈ ఆరుగురు నిరుద్యోగ యువకుల్లో నలుగురు ఉద్యోగాలు రావడం వంటి సొంతకారణాల మీద తప్పుకోగా, మిగిలింది సుబ్రమణ్య అయ్యర్. ఆయన ఎడిటర్‌గా వుండేవాడు. మరో యువకుడు వీరాఘవాచారియార్ మేనేజర్‌గా వుండేవారు. ఈ ఇద్దరూ ఆ పత్రికకు ప్రొప్రయిటర్లు.

మేజర్ నికల్సన్ అనే ఇంగ్లీషు శస్త్రవైద్యుడు ఈ యువకుల్ని దగ్గిర కూర్చో బెట్టుకొని పత్రిక నడపడంలోని మెలకువల్ని వివరించి ప్రోత్సహించేవాడు! మొదటి సంచికలోనే ఆ డాక్టర్‌గారికి కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

స్నేహ బంధానికి మారు పేరుగా నిలిచారు సుబ్రహ్మణ్యఅయ్యర్, వీరరాఘవాచారియార్.

అతిచిన్న వయసులోనే పెద్ద బాధ్యతని నెత్తికేసుకొని దేశం కోసం పెనుభారం మోస్తున్న వీరిద్దరినీ జాతి గుర్తించి గౌరవించడం ప్రారంభించింది.

'దిహిందూ' వార్తల వ్యాఖ్యల వార్తా పత్రికగా ఆలోచనా స్ఫోరకమైన ప్రసిద్ధ పత్రికల్లో ఒకటిగా ఎదిగింది.

అప్పటి వరకూ త్రై వారపత్రికగా 'దిహిందూ' ని నడిపిన మిత్రద్వయం 1883లో 100, మాంట్ రోడ్‌లో సొంత భవనాన్ని సంపాదించుకోగలిగారు. ఇంక, కేరాఫ్ "పోస్ట్‌మాస్టర్, ట్రిప్లికేన్ పోస్టాఫీస్" అని అడ్రస్ ఇచ్చుకోవాల్సిన దురవస్థ వారికి తప్పింది. 'ది హిందూ నేషనల్ ప్రెస్' పేరుతో సొంతంగా ప్రెస్‌ని కూడా నెలకొల్పుకోగలిగారు – ఆ ఇద్దరు స్నేహితులు.

టిప్పుసుల్తాన్ వారసుడు నవాబ్ హుమాయూన్ జా బహదూర్ 'దిహిందూ' స్నేహితులిద్దరికీ ఆత్మీయుడైన మిత్రుడైనాడు. ఆయన ప్రోద్బలంతో ముస్లిం ప్రజలు కూడా 'దిహిందూ' పత్రిక చందాదార్లయ్యారు.

తన అపారమైన మేధాసంపత్తితో సుబ్రమణ్య అయ్యర్ ప్రసిద్ధ జర్నలిస్ట్‌గా పేరుతెచ్చుకొన్నారు. పత్రిక రథసారథిగా వీరరాఘవాచారియార్ సాగిస్తున్న కృషిని ప్రతిఒక్కరూ గుర్తించారు. ఆ ఇద్దరు స్నేహితుల సంయుక్త కృషితో 1889 ఏప్రియల్ ఒకటి నుంచీ 'దిహిందూ' దినపత్రికగా మారింది.

భారతీయ ఇంగ్లీషు జర్నలిజానికి అది చిరస్మరణీయమైన అంశం. బిపిన్ చంద్రపాల్ వంటి ప్రముఖులు ఆ పత్రికకి కరస్పాండెంట్స్‌గా పనిచేశారు.

పూర్తిగా భారతీయులే నడిపిన మొదటి ఆంగ్ల దినపత్రికగా 'దిహిందూ' ని ఆయన కొనియాడారు.

విధి విచిత్రమైంది. కొందరి ధనాన్నిహరిస్తుంది. కొందరి మానాన్ని, కొందరి ప్రాణాల్ని హరిస్తుంది. కానీ, "దిహిందూ" ప్రొప్రయిటర్లుగా వున్న ఆ మిత్రులు యిద్దరి విషయంలో విధి వారి స్నేహాన్ని హరించింది.

' ది హిందూ' కి ఆయువు పట్టుగా వున్న చందాదార్ల మనోభావాలు దెబ్బతినకుండా మతపరమైన సంస్కరణల విషయాలు వుండాలని మేనేజర్ పాత్ర పోషిస్తున్న వీరరాఘవాచారియార్ పట్టుబట్టడం మొదలు పెట్టాడు.

రాయడం మొదలు పెట్టాక తానొక శిలా విగ్రహంలా మారిపోయి నిష్పక్షపాతంగా, నిక్కచ్చిగా, నిర్మోగమాటంగా రాయడం సంపాదకుడి పాత్ర పోషిస్తున్న సుబ్రహ్మణ్య అయ్యర్ అలవాటు. తన రచనల కారణంగా 'హిందూమత వ్యతిరేకి' (అన్ – హిందూ) అని, కూతురు మామగారు ఆయన్ని ఇంటికి రానివ్వని సంఘటనలనెన్నింటినో ఎదుర్కొన్న వాడాయన. వీరరాఘవాచారియార్ మాటల్ని ఆయన లక్ష్యపెట్టలేదు.

ఇలాంటి విభేదాలు చిలికి చిలికి గాలివానయ్యాయి. చివరికి దావానలంలా 'దిహిందూ' దినపత్రికని చుట్టముట్టాయి. స్నేహితులిద్దరూ ఒకరి ముఖాలు ఇంకొకరు చూసుకోడానికి ఇష్టపడని బద్ధవైరం ఏర్పడింది.

పత్రిక సర్క్యులేషన్ తగ్గుతోందనీ, కేవలం సంస్కరణల అంశాన్ని మాత్రమే పట్టుకు వ్రేలాడవద్దనీ, అదే కావాలనుకొంటే అందుకోసం వేరే పత్రిక నడుపుకోమనీ కోరాడు మేనేజర్ వీర రాఘవాచారియార్. అంగీకరించలేకపోయాడు సంపాదకుడు సుబ్రమణ్య అయ్యర్.

20 సంవత్సరాల స్నేహబంధం 1898లో పూర్తిగా తెగిపోయింది. ఇద్దరూ పరమశత్రువులుగా మారారు.

అయితే, ఈ కథకి ఇదే కొసమెరుపుకాదు. 'ఇండియన్ సోషల్ రిఫార్మర్' అనే ఆంగ్ల పత్రికని నెలకొల్పాడు సుబ్రహ్మణ్య అయ్యర్. బొంబాయినుంచి ఆ పత్రిక వెలువడింది. స్వదేశ మిత్రన్ అనే తమిళపత్రికని అప్పటికే ఆయన నడుపుతున్నారు. తమిళ జర్నలిజానికి శుభారంభం పలికిన పత్రిక అది.

అటు వీరరాఘవాచారియార్ కూడా 'దిహిందూ' ని కొనసాగిస్తూనే, 'హిందూనేశిని' అనే తమిళపత్రికని ప్రారంభించారు. ఈ పాత మిత్రులిద్దరూ తమతమ పత్రికల్లో ఒకరినొకరు

ఎత్తిపొడుచుకొంటూ, విమర్శించుకొంటూ ఆవేశపూరిత పదజాలాలు ప్రయోగించుకొంటూ వుండేవారు.

ఈ ఇద్దరి తగువూ ఎక్కడిదాకా వెళ్ళిందీ అంటే, వీరరాఘవాచారియార్ రాతలు తనకు పరువు నష్టం కల్గించేవిగా వున్నాయని సుబ్రహ్మణ్య అయ్యర్ కోర్టులో దావా వేశాడు.

ఆ సమయంలో కస్తూరి రంగ అయ్యర్ 'దిహిందూ' ఆంగ్ల దిన పత్రికకి న్యాయసలహాదారుగా వుండేవాడు. ఇద్దరికీ కావలసిన మనిషికావడంతో తన పెద్దరికాన్ని ఉపయోగించక తప్పలేదు ఆయనకి! ఆయన సూచనమీద చివరికి వీరరాఘవాచారియార్ తన "హిందూనేశిని" పత్రికలో సుబ్రహ్మణ్య అయ్యర్‌కు బేషరతు క్షమాపణలు ప్రచురించడంతో ఆ సమస్య సర్దుమణిగింది.

కానీ, మానసిక అశాంతి, ఆర్థిక ఇబ్బందులు పత్రికని నడపడంలోనూ, జర్నలిజంలోనూ తగిన ప్రతిభ కనపరచలేకపోవడం వంటికారణాలు 'దిహిందూ' పత్రిక కుంటుపడ్తున్నదశకు దారితీయడం మొదలుపెట్టాయి.

చివరికి మరొక చారిత్రాత్మక నిర్ణయం తీసుకోకతప్పలేదు వీరరాఘవాచారియార్‌కి.

1905 ఏప్రియల్ ఒకటవ తేదీన దిహిందూ ప్రారంభమైన 27 సంవత్సరాల తర్వాత వీరరాఘవాచారియార్ సంతకంతో ఓ ప్రకటన హిందూలో వెలువడింది.

"ఈ రోజునుంచీ, ' దిహిందూ' దిన పత్రికమీద, ది హిందూ నేషనల్ ప్రెస్ మీద, బిల్డింగ్, మెషినరీల మీద, గుడ్‌విల్‌మీద నాకు గల సమస్త హక్కుల్నీ, హైకోర్టు వకీలు మహారాజశ్రీ కస్తూరి రంగ అయ్యంగార్ గారికి అమ్మివేస్తున్నాను –" అని!

ఆ తర్వాత "దిహిందూ"లో వివరణ వచ్చింది – కేవలం దేశంకోసం ఉద్యమిస్తున్న ఒక జాతీయ పత్రికకు సరికొత్త ఊపిరి పోసేందుకే 'దిహిందూ' ని నడిపే బాధ్యతని కొత్తయాజమాన్యం వహించడం జరుగుతోంది – అని!

వీరరాఘవాచారియార్ కొత్తయాజమాన్యంలో ప్రింటర్ అండ్ పబ్లిషర్‌గా కొనసాగారు. అప్పటివరకూ ఎడిటర్‌గా వున్న కరుణాకర మీనన్ జాయింట్ ఎడిటర్ అయ్యారు. సుబ్రహ్మణ్య అయ్యర్ గౌరవ అతిథిగా రాకపోకలు కొనసాగించారు.

**( దిహిందూ 100 ఇయర్స్)**

## రాయలు శోభనం గదిలో
# పానుపు వెలితి

శ్రీ విభు సన్నిభ ప్రభువరేణ్య యనాధ శరణ్య కృష్ణ రా
యా వివరంబుగా నరయుమా। భవదంగన యన్నపూర్ణమా
దేవి యపాయముల్ తొలగి దేవరకున్ నిరతంబు శ్రేయమే
కావలెనంచుఁ బంపె హిత గర్భితమైన యుగాది కానుకల్

అంటూ రాయలవారికి కొత్తపెళ్ళి కూతురు తరపున ఈ పద్యాన్ని అందించాడు ఆమె దూతగా వచ్చిన నంది తిమ్మన.

నెల్లూరు మండలం కనకగిరి రాజ్యాధిపతి వీర రుద్ర గజపతి కుమార్తె అన్నపూర్ణాదేవితో వివాహం జరిగి శోభన కార్యంకోసం ఆహ్వానితుడై అత్తవారింట్లో విడిది చేసివున్నాడు రాయలు.

నంది తిమ్మనతో పరిచయాదులు పూర్తయ్యాక "హితగర్భితమైన ఉగాది కానుకలు - జాగ్రత్తగా పరిశీలించండి" అని నెమ్మదిగా హెచ్చరించి వెళ్ళాడు నంది తిమ్మనార్యుడు.

అన్నపూర్ణాదేవి పంపిన ఉగాది కానుకలు మూడు బంగారు బొమ్మలు. వాటిలో మధ్య విగ్రహం కాళ్ళమీద కిందనుంచి పైకి "అన్నపూర్ణ" అని రాసివుంది.

నందితిమ్మన హెచ్చరికలోని మర్మం- "అపాయములు తొలగి దేవరకున్-" అనడంలోని రహస్యం ఏమిటో తెలుసుకోవాలనిపించింది రాయలుకి "వివరంబుగా నరయుమా-" అంటాడేమిటీ అని ఆలోచించాడు.

బాగా జాగ్రత్తగా పరిశీలిస్తే అన్నపూర్ణ అని రాసిన విగ్రహం అడుగున చిన్న మీట వుంది. దాన్ని కిందనుంచి పైకి నొక్కమని సూచించడంకోసం తలకిందులుగా అన్నపూర్ణ అని రాసి వుంటుందని వూహించి అలాగే నొక్కిచూశాడు- విగ్రహం కిరీటం తెరుచుకొంది.

ఆశ్చర్యంగా లోపల వెదికాడు. ఉల్లిపొరలాంటి సన్నని పత్రంమీద చిన్న అక్షరాలతో ఈ పద్యం రాసివుంది.

స్వర్ణ పుష్ప పూజయన్న నాదే అది చేసియెకదా
భవదమల పత్ని నైతి నన్నోలినట్టి వెలఁది పుడమి నున్నే
నా పాటి యాఁట దలరమ కాదుకాదాయను వివేచనము

వరుస నొకవేళ రాజమౌళి యోషయో నాయాసకి
పేరూనితి భవాని మగనిc బ్రేమన్బాసి గడె నిలువcబోదు
నన్ను బలెనే నా ప్రతిమ కన్గొనుదురన్ద్రుభ్రమము పొడమి
యుగాది కాన్కగ నేనిప్పు డంపిన దాన భక్తిని శోధించి
త్రిప్పుదురా యెన్నటి కేని నేను మీ విధేయ
నగుదు మరుcడు తావకరి నే సచలజాత అన్నపూర్ణ

ఈ పద్యం ఏమీ అర్థంకాలేదు రాయలుకు. అప్పాజీ కూడా కాసేపు ఈ పద్యంతో కుస్తీ పట్టాడు. అసలిది పద్యమో గద్యమో కూడా తెలీలేదు. కానీ, ఇందులో ఏదో సందేశం వుందనేది స్పష్టం. అదేమిటనేది ప్రశ్న.

"రెండు పరిచారికల విగ్రహాలతో పాటు అన్నపూర్ణ విగ్రహం వుంది. తలకిందులుగా దానిమీద అక్షరాలు రాసి వున్నాయి. దీనిబట్టి, ఈ పద్యాన్ని రెండక్షరాలు విడిచి ఒక అక్షరం చొప్పున తలకిందులుగా రాసిచూస్తే విషయం అర్థంకావచ్చు" అన్నాడు అప్పాజీ!

రాయలు అలాగే చేశాడు- "పూత చరితామనవి! నేటి రాత్రి శోభనపు గది మిమున్దునుమ నా బదులుగ మగవానికి నాయోజవేసము వేయుదురట -పానుపు వెలితి; పదదాసి అన్నపూర్ణ-"

సందేశం స్పష్టమై పోయింది. రహస్యం విడిపోయింది ఆ రాత్రికి జరిగే రాయలవారి శోభనంలో అన్నపూర్ణకు బదులుగా ఒక మగవాడికి ఆడవేషం వేసి లోపలికి పంపుతారని, రాయలు హత్యకు కుట్రపన్నారనేది ఈ సందేశం సారాంశం.

"పానుపు వెలితి" అనే మాటకు అర్థం వాళ్ళకు బోధపడలేదు. అయినా సాహసమే ఊపిరిగా ఎదిగిన యువకుడు కృష్ణరాయలు అపాయాలున్నాయని తెలిసినా శోభనం గదికే వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాడు.

పట్టుబట్టలా మెత్తగా వుండే కవచం తొడుక్కొని తగిన జాగ్రత్తలతో శోభనం గది అనే మృత్యు గహ్వరంలోకి ప్రవేశించాడు రాయలు.

గదిలోకి వెళ్ళగానే చిన్ననాటి సూక్తి గుర్తుకొచ్చింది రాయలుకి - పడకని చేతితో తడమకుండా మంచం ఎక్కకూడదని.

కుడిచేత్తో గట్టిగా పక్కని అదిమాడు. అంతే! కుట్లుతెగి ఫటఫట మంటూ దుప్పటి గుభాలున కూలబడి లోపల ఎక్కడో నీళ్ళలోపడ్డ శబ్దం విన్పించింది. లోతైన నూతి అంచున

మాయామంచాన్ని వేశారని అర్థం అయ్యింది ఆయనకి! 'పానుపు వెలితి' అంటే ఇదేనన్నమాట అనుకున్నాడు.

వెనక్కి తిరిగే సరికి గదిలోకి ప్రవేశించిన పెళ్ళికూతురు బాకుతో రాయలు గుండెమీద పొడిచింది. బాకు వంగిందిగాని రాయలు గాయపడలేదు.

కృష్ణరాయలు కులంతక్కువ వాడని అతనికి కూతుర్ని ఇవ్వడం ఇష్టంలేని నెల్లూరు వీరరుద్రగజపతి తనకూతురుకు బదులుగా అదేపోలికలున్న తన ఉంపుడుగత్తె కొడుక్కి ఆడవేషం వేసి రాయలకిచ్చి పెళ్ళిచేసి శోభనం తంతునడిపి హత్యచేయాలని పథకం పన్నాడు. దాన్ని విజయవంతంగా అడ్డుకొని భర్తని చేరుకొంది కూతురు అన్నపూర్ణ.

విజయనగరంలో అప్పాజీ ఆశీస్సులతో అన్నపూర్ణని వైభవోపేతంగా వివాహంచేసుకున్నాడు రాయలు.

ఈ నిజంపెళ్ళి జరిగాక నిజంశోభనపు ఏర్పాట్లు జరిగాయి.

శోభనం రోజున రాయలు స్వయంగా ఓ పద్యం రాసి అన్నపూర్ణాదేవికి కానుకగా పంపించాడు-

'మేలు త్వదీయ సుందరాకారము బల్యోగ్యము
సభాసదుల్ సౌరు స్తుత్యర్హ మనిరి నీవున్గామ్మీ
యుగాది కానుకలివి కృష్ణదేవరాయ ప్రాణప్రియా'

అన్నపూర్ణాదేవి చెలికత్తెలు ఈ పద్యం చదివి సరసాలాడి కాసేపు నవ్వుకున్నారు.

కానీ, ఆ పద్యాన్ని ఎలా చదవాలో అన్నపూర్ణాదేవికి ఒక్కదానికే తెలుసు.

రెండేసి అక్షరాలు వదిలేసి కిందినించిపైకి చదివింది.

"ప్రియ దేవి కాయువు నిత్యసౌభాగ్యము రాయలు - " అనేది ఈ పద్యంలో సందేశం.

"ప్రియుడు గడుసువాడే! కట్టుకున్న భార్యని నిత్య సౌభాగ్యవతి కమ్మని ఆశీర్వదించాడు-" అని నవ్వింది చెలికత్తె.

నిరంతర సమరాలతో జీవించిన ఆరోజుల్లో రాయలు తనకూ ఆమెకూ ఆయువు కావాలని కోరుకోవడం ఓ అవసరం! అంతే!

సెట్టి లక్ష్మీనరసింహముగారి ఉగాది కానుకలు

# గాంధీ గారి ఆహారం

గాంధీగారు మొదట్లో పాలు, తేనె, రొట్టే, తేలికపాటి ఆహారం తీసుకునేవారు.

1929లో ఆయన ఆంధ్రా పర్యటనకు వచ్చినప్పుడు రాజమండ్రిలో సుందరగోపాలరావు అనే గాంధేయవాది పరిచయం అయ్యాడు.

సుందరగోపాలరావు, ఆయన మిత్రులూ గాంధీగారికి తొట్టిస్నానం, ఉడకబెట్టకుండా పచ్చికూరలు, నానబెట్టిన ధాన్యం వంటి ఆహారం పదార్థాల గురించి పరిచయంచేశారు. "రోగాలు రాకుండా వుండాలంటే, ఆహారపదార్థాల్ని వాటి సహజస్థితిలోనే భుజించాలి-" అని చెప్పాడు గోపాలరావు.

"అయితే నన్నుకూడా అపక్వాహారమే తీసుకోమంటావా?"అని అడిగారు గాంధి.

"తప్పకుండా!" ఖండితంగా చెప్పాడు గోపాలరావు.

"నేను అనేకమంది వృద్ధులయిన పురుషులకు స్త్రీలకు కూడా దీర్ఘవ్యాధిగా పరిణమించిన అజీర్ణరోగాన్ని, మొలకెత్తిన గింజలతో కూడిన సమీకృత ఆహారం ఇచ్చి నయం చేశాను-" అన్నాడాయన.

" వండిన ఆహార పదార్థాలు తినే దశలోంచి, నేరుగా పచ్చి ఆహారాల్లోకి రావడానికి మధ్యంతర దశ ఏదైనా అవసరమా..." సందేహంగా అడిగారుగాంధీ.

"అలాంటిదేమీలేదు - వండనీ ఆహారం, వండని పిండి, కాచనిపాలు, వండని బఠాణీలు, వండని పప్పుగింజలు, ఉడికించని గుడ్లు - ఇవి త్వరగా జీర్ణం అవుతాయి. ఇట్లా చేసి చూడండి. మీరింకా ఎంతో బాగుంటారు-" అన్నాడు.

"నువ్వు నా ప్రాణానికి బాధ్యత వహిస్తావా?" ఆంధ్ర దేశంలో నన్ను దహనం చేయవలసివస్తే నా దేహంతోపాటు నిన్నుకూడా దహనం చేస్తారు సుమా..." అన్నారు గాంధీ నవ్వుతూ!

"ఆ బాధ్యత నేను వహిస్తాను-" హామీ ఇచ్చారు గోపాలరావు.

"అయితే, నానబెట్టిన గోధుమలు ఇవ్వాళే పంపు - ఇవ్వాళనుంచీ ప్రారంభిస్తాను-" అన్నారు గాంధీ.

అది 08-05-1929.

గోపాలరావుగారు మొలకలొచ్చిన గోధుమల్ని గాంధీగారికి పంపాడు. గాంధీగారు తన ఆహారపు అలవాటు మార్చుకొని కొత్త ఆహారం మొదలు పెడ్తున్నారన్న సంగతి కస్తూరిబా గాంధీకి తెలియదు.

ఆ మొలక గోధుమల్ని అక్కడున్న కాంగ్రెస్ కార్యకర్తలకు పంచి పెట్టేసింది.

దాంతో, గాంధీగారు ఆ మర్నాడు మేనెల 9వ తేదీ నించీ ఒక తెలుగువాడు సూచించిన ఆహారంలోకి మారిపోయారు.

ఈ వివరాలన్నీ గాంధీగారే స్వయంగా తెలియజేస్తూ "ఈ ప్రయోగం వలన నాకేమీ కీడు కలుగలేదు. అయితే బరువు మాత్రం 5 కిలోలు తగ్గాను. కానీ, అందువలన నీరసం ఏమీరాలేదు...

నాలాగే నాతోపాటు తిరిగే నా సోదర ఛాందసులకు కూడా నేను ఏం చేస్తున్నానో చెప్పడం అవసరం. నేను సామాన్యంగా

8 తులాలు మొక్క మొలిచిన గోధుమలు

8 తులాలు సీమబాదం పప్పు ముద్ద

8 తులాలు మెత్తగా నూరిన ఆకుకూరల ముద్ద

6 నిమ్మకాయల రసం

2 ఔన్సుల తేనె

వారంలో రెండు మూడుసార్లు మొక్కమొలిచిన గోధుమలకు బదులుగా మొక్కమొలిచిన పప్పుధాన్యాలు తీసుకొంటాను. అప్పుడు సీమబాదంకు బదులుగా కొబ్బరిపాలు తీసుకొంటాను - ఇలా రోజుకు రెండుసార్లు తీసుకొంటాను.

మధ్యలో కాచి చల్లార్చిన నీరు తాగుతాను. ఒక్కోసారి కాచిన నీళ్ళలో నిమ్మరసం, తేనె కలిపి తీసుకొంటాను. ఇలా గాంధీగారు తన ఆహారం అలవాటు గురించి వివరిస్తూ పచ్చికూరలు, ఉడికించని పప్పు, మొలకెత్తిన ధాన్యాలను తీసుకొనే విధానం గురించి వివరణాత్మక వ్యాసం రాశారు యంగ్ ఇండియాలో!

అది 13-6-1929న ప్రచురితం అయ్యింది. ఇతర ప్రాంతాలలో పర్యటించేప్పుడు గాంధీగారి కోసం మేకపాలు వేరుశనగపప్పు వగైరా ఏర్పాటు చేయడానికి కాంగ్రెస్ నాయకులు చాలా ఇబ్బందులు పడవలసి వచ్చేది. టైము దాటిపోయినా, ఆహారంలో తేడా వచ్చినా గాంధీగారు సర్దుకుపోయేవారు కారు - ఆ పూటంతా ఉపవాసం పాటించేవారు.

ఈ వ్యాసాన్ని చదివిన తర్వాత అందరికన్నా ముందు సరోజినీ నాయుడు సంతోషించి వుంటుంది! అది వేరే కథ!

**(ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ - సం: కొడాలి ఆంజనేయులు)**

# నైజాం నైజం

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, తొలిరోజుల్లో జరిగిన హిందూ ముస్లిం ఘర్షణలు ఈ పుణ్యభూమి ఘనచరిత్రలో ఒక మాయనిమచ్చ.

ముస్లింలు తమకు సంపూర్ణంగా భద్రత లభించిందని భావించి ఢిల్లీ పురవీధులలో స్వేచ్ఛగా తిరగ గలిగేంతవరకూ తాను ఢిల్లీ వదిలి వెళ్ళనని శపథం చేశారు గాంధీజీ! అప్పుడాయన నిరశన వ్రతంలో ఉన్నారు.

"ముస్లింల రక్షణకై ఇంతగా పట్టుబడ్తున్నందుకు నన్ను చంపుతామని బెదిరిస్తూన్నారు. ప్రాణంకాదు - మనం చేసిన మంచి పని శాశ్వతం -" అన్నారాయన! "అవసరం అయితే పాకిస్తాన్ కూడా వెళ్ళగలను-" అని ప్రకటించారు.

ఆయన మాటల్లో అమితమైన ఆత్మ విశ్వాసాన్ని చూశారందరూ-!

"నన్ను ముస్లిం ఎవడూ చంపడు. అది మాత్రం నాకు తెలుసు -" అన్నారు గాంధీజీ.

1948 జనవరి 20 నాటికి అల్లర్లు అదుపులోకి వచ్చాయి. గాంధీజీ నిరశన దీక్ష విరమించి ఆహారం తీసుకున్నారు. ఆ తర్వాత ఆయన నివసిస్తున్న బిర్లాభవనంలో ఒకబాంబు పేలింది. గాంధీజీని చంపడానికి చేసిన తొలి ప్రయత్నం అది.

సరిగ్గా ఆ రోజుల్లో భారత ప్రభుత్వంతో స్నేహం కోసం ఢిల్లీ స్థాయిలో మంతనాలు సాగింపచేయిస్తున్నాడు నిజాం నవాబు. 1911 నుంచీ ఆయన అధికారంలో వున్నాడు. ఇప్పుడు ఆ అధికారాన్ని మరింత సుస్థిరం చేసుకోవాలని ఆశిస్తున్నాడు.

గాంధీజీ దైవానుగ్రహం వలన రక్షింపబడ్డారు. వారికి సానుభూతి తెలుపుతూ, ఓ టెలిగ్రాం పంపమని నైజాం నవాబు సలహాదార్లు నవాబుకి సూచించారు.

దానికి నైజాం నవాబు చెప్పిన సమాధానం ఇది-

"ఒకసారి నా కారు మీద దుండగులు బాంబు విసిరారు. దైవానుగ్రహం వలనే అప్పుడు నేనూ రక్షించబడ్డాను. ఆ రోజున ఈ గాంధీ నాకు టెలిగ్రాం పంపాడా...? ఇప్పుడు నేనెందుకు పంపాలీ..??" అని!

ఈ కథని స్వయంగా గాంధీగారే నలుగురికి చెప్పి - చిరునవ్వుతో - "అప్పుడప్పుడూ ఈ 'సంస్థానాధీశులు చిన్న పిల్లల్లా ప్రవర్తిస్తుంటారు-" అన్నారట! ఇది జరిగిన సరిగ్గా పదిరోజులకు గాంధీగారు హత్యకు గురయ్యారు.

**(సాదత్ ఆలీఖాన్ - "నలభైయేండ్ల నా అనుభవాలు")**

*పిండిప్రోలి లక్ష్మణ కవి*

# శరాలూ - శాపాలు

1770 - 1840 మధ్యకాలంలో గోదావరి జిల్లా రామచంద్రాపురం కుయ్యేరు గ్రామంలో పిండిప్రోలు లక్ష్మణకవి వుండేవాడు. గొప్ప తిట్టు కవి. ఎవ్వరినీ లెక్కచేసేవాడు కాదు. తనతో ఆస్తి తగాదాలున్న వ్యక్తుల్ని బ్రౌన్ దొరగారి దగ్గరకి తీసుకెళ్ళి కవిత్వంలో తన సమస్యను వివరించి న్యాయం సాధించుకొన్నాడాయన.

'విస్సన్న చెప్పిందే వేదం' అన్పించుకున్న యింద్రగంటి విశ్వపతి శాస్త్రినే నువ్వెంత అని ఎదిరించాడు.

"శాస్త్రీ! 'వీ' తీస్తే శ్వపతి (కుక్కవి)

'శ్వా' తీస్తే విపతి (పక్షివి) అని విశ్వపతి శాస్త్రిని తిట్టి తట్టుకొని నిలబడగలవాడు.

ఆ రోజుల్లో రామచంద్రాపురం జమిందారు కాకర్లపూడి రామచంద్ర రాజుగారు. ఆయన తమ్ముడు జగన్నాథరాజుగారికి శిష్టుకృష్ణమూర్తి శాస్త్రి అనే కవి తను రాసిన ఓ కావ్యాన్ని అంకితం ఇవ్వడానికి వచ్చాడు.

ఈ కావ్యంలో గుణదోషాలు తెలుసుకొన్న తర్వాతే తాను అంకితానికి అంగీకరిస్తానన్నాడు తమ్ముడు జమీందారు.

"సర్వకామదా పరిణయం" ఆ కావ్యం పేరు. అది సంస్కృత గ్రంథం.

కృతి స్వీకార మహోత్సవం ఏర్పాటుచేయబడింది. అందరికీ ఆహ్వాన పత్రాలు పంపించారు. కృష్ణమూర్తి శాస్త్రి కావాలని పిండిప్రోలు లక్ష్మణకవికి ఆహ్వానం పంపలేదు. జమీందారు స్వయంగా ఆయన్ని పిలవమని చెప్పినా సరేనని ఊరుకున్నాడు.

విషయం లక్ష్మణ కవికి తెల్సింది. పిలవకపోయినా వెళ్ళి దాని సంగతేదో చూడాల్సిందేనని నిర్ణయించుకున్నాడు.

లక్ష్మణ కవి గారి నోరు సంగతి అందరికీ తెలుసు కాబట్టి, జమీందారుగారు లేచి కవిగారిని ఆహ్వానించి "ఈ కావ్యాన్ని అంకితం తీసుకొంటున్నాను – కొంచెం గుణదోషాలు పరిశీలించండి." అని ప్రాధేయపడ్డాడు.

లక్ష్మణకవి వ్యంగ్యంగా– "కృష్ణమూర్తి శాస్త్రి గారంత సంస్కృత పాండిత్యం నాకుందా? నలుగురితో పాటు కూర్చుని వింటాను లెండీ –" అనేసి హాల్లో ఓ కుర్చీలో కూర్చున్నాడు– వేదికపైకి వెళ్ళకుండా!

"తమ వంటి పండితులు అట్లా అనరాదు. మీ వంటి వారు పరిశీలిస్తేనే గ్రంథానికి ఘనత-" అన్ని మళ్ళీ ఆహ్వానించాడు వేదికపైకి తమ్ముడు జమీందారు.

"గ్రంథకర్త అంగీకరించాలి గదా-" అన్నాడు... అర్థోక్తిలో ఆగుతూ లక్ష్మణకవి.

"లక్ష్మణ కవిని పండితునడం, అతడు నా గ్రంథాన్ని పరిశీలిస్తాననడం హాస్యాస్పదం. లక్షణం తెలియని అవలక్షణుడు ఈ లక్ష్మణకవి -" అని నిందించాడు గ్రంథకర్త.

నిండు సభలో ఇది లక్ష్మణ కవికి అవమానమే! సభలో కలకలం చెలరేగింది.

వెంటనే అటుగా వచ్చిన కుక్కవైపు చూపిస్తూ "ఈ శునకము కృష్ణ మూర్తియే యెన్నంగన్-" అనేశాడు.

వెంటనే గ్రంథకర్త కోపంగా లేచి నుంచుని

దాశరధీ శబ్దంబును పరంబును

దా శరధి పరంబుఁజేయు ద్వ్యైయర్థిక దు

ర్థీ శక్తి బిడాలమునకు

నీ శునకము కృష్ణమూర్తియే యెన్నంగున్" అన్నాడు. సభలో చప్పట్లు మోగాయి. దానికి లక్ష్మణ కవిగారు ఇలా సమాధానం చెప్పారు...

రాజా! నేను రాసిన 'రావణ దమ్మీయం' అనే కావ్యాన్ని మీ కవిగారు పరిహసిస్తున్నాడు. అందులో దాశరధి శబ్దాన్ని తాన్ + శరధి – సముద్రము అనే అర్థంలో కాకుండా, దాశ – చేపలు పట్టేవారి, రధి పడవలు కల్గింది – సముద్రం అనే అర్థంలో నేను ప్రయోగించాను. ఇది పండితులు మెచ్చిన కవి ప్రయోగం. ఈ కృష్ణమూర్తి శాస్త్రి ప్రశంస దానికి అక్కరలేదు.

ఇంక – ఈ శునకం కృష్ణమూర్తియే' అని నేనన్న మాట గురించి – ఇందుకు ఎవరూ కోపగించుకొనవసరం లేదు.

ఈశు+నకం = శివుడి బాణం అనే అర్థంలో అతన్ని ప్రశసంసించే ప్రయత్నం చేశాను. కానీ, కవిగారు తననితాను కుక్కతో పోల్చుకున్నాడు. ఇందులో నా బాధ్యత లేదు-" అన్నాడు. కృష్ణమూర్తి శాస్త్రి మారు మాట్లాడలేక పోయాడు.

సభలో మొక్కపాటి పేరిశాస్త్రి అనే మరో కవి ఇంతలో కోపంగా లేచి "ఈ లక్ష్మణ కవికి కవిత్వమే కాని, శాస్త్రజ్ఞానం శూన్యం-" అని అరిచాడు. లక్ష్మణ కవీ అంతే ఘాటుగా సమాధానం చెప్పాడు.

"ఉక్కుఁజెదదిన్న దశ దిక్కు లొక్కటైనఁ
జుక్కలిలఁబడ్డఁ గులగిరుల్ వ్రక్కలైన
మొక్కపాటింట నోటను ముక్కలేదు
పేరిశాస్త్రికిఁ గలిగెరా పెదవిపాటు-"

"ఉక్కుని చెదతిన్నా, పది దిక్కులూ ఒక్కటైనా
చుక్కలు నేలమీద పడ్డా, మహాపర్వతాల్ వక్కలైనా
మొక్క పాటివారింట్లో అక్షరం ముక్క
లేదు- ఈ పేరి శాస్త్రికి మాత్రం అదరుపాటు ఎక్కువ-" అని తిట్టాడు.

కూరపాటి వేంకటశాస్త్రి అనే కవి లేచి ఇంకేదో అనబోయాడట లక్ష్మణ కవిని -
"కూరపటి వెంక! కుక్కలు దిను కంక!
లేనిపోని శంక మానుమింక
ముఖముఁజూడఁ గుంక ముండ వనెదు శంక,
నాకు దోఁచెఁ జంక నాకు మింక-"

ఇలా ఎవడులేస్తే వాణ్ణి తిట్టి పొయ్యడం మొదలుపెట్టేసరికి జమీందారు గారికి వణుకుపుట్టింది. అందర్నీ శాంతించమని సముదాయించి కూర్చోబెట్టి" - ఇప్పుడు కవిగారు తన కావ్యపఠనం చేస్తారు-" అని ప్రకటించాడు.

అక్కడ కృష్ణమూర్తి శాస్త్రి ఒకపద్యం చెప్పడం - ఇక్కడ పిండి ప్రోలు లక్ష్మణకవి ఒకతప్పు పట్టడం ఇలా సాగింది కొంతసేపు సభ!

జమీందారుగారికింక విసుగొచ్చేసింది. - జన్మలో కవుల్తో పెట్టుకోకూడదని నిర్ణయించుకున్నాడు.

వినయంగా లేచినుంచుని--- "మహాత్మా! కృష్ణమూర్తి శాస్త్రి కవీ ---- నాకూ మీరూ వద్దు - మీ కావ్యమూ వద్దు - దాని అంకితం అంతకన్నా వద్దు - మీ కవిత్వంలో ఆక్షేపణలు చాలా వున్నాయి. వాటన్నింటినీ సరిచేసుకురండి- అప్పుడు చూద్దాం----' ' అని సభని చాలించి వెళ్ళిపోయాడు.

"అలో లక్ష్మణా!" అన్నట్లయ్యింది కృష్ణమూర్తి శాస్త్రిగారి పరిస్థితి.

నన్ను గౌరవంగా ఆహ్వానించి వుంటే నీకు ఈ అవమానం తప్పేదికదా..." అంటూ నవ్వుకొంటూ తృప్తిగా నిష్క్రమించాడు పిండిప్రోలు లక్ష్మణకవి!

**(తెలుగులో తిట్టు కవిత్వం రావూరి దొరస్వామిశర్మ)**

# స్వదేశీ ఉద్యమం

**1906** లో మద్రాస్ మహాజన సభ అనే సంస్థ స్వాతంత్ర్య సముపార్జన కోసం పోరాడుతూనే అనేక ప్రజాహిత కార్యక్రమాలను చేపట్టింది. ఫిబ్రవరి 15,1906న తీసుకున్న నిర్ణయం ప్రకారం

(1) ప్రతి జిల్లాలోనూ చేనేత పనులను నేర్పించే స్కూల్స్ తెరవాలి.

(2) ఉలెన్, సిల్క్ బట్టలు నేయడానికి కావలసిన యంత్రాలను ఆ స్కూల్స్‌కు సరఫరా చెయ్యాలి.

(3) చేనేత పనిముట్లు యంత్రాలను అభివృద్ధి చేసిన వారినీ, కొత్త పనిముట్లును కనుగొన్న వారినీ గుర్తించి గౌరవించాలి.

(4) కత్తులు, చాకులు, కత్తెరలు, తాళాలు, చాక్‌పీసులు, కొవ్వొత్తులు వంటి చిన్న చిన్న వస్తువుల్ని తయారుచేసే చిన్న తరహా పరిశ్రమలు వ్యవస్థాపించడం ప్రోత్సహించడం చెయ్యాలి.

(5) హస్తకళల్లోనూ, వృత్తి పనుల్లోనూ రాణిస్తున్న వారికి స్కాలర్‌షిప్‌లూ, ప్రోత్సాహక బహుమతులుగా ఇవ్వాలి.

(6) చేనేత పని వారికి ఉపకారవేతనంగా గానీ, అప్పుగా గానీ కొంత సొమ్ము పెట్టుబడిగా ఇచ్చి చేనేత పరిశ్రమని ప్రోత్సహించాలి. స్వదేశీ వస్తువుల్ని ఇంటింటికీ తిరిగి అమ్మేందుకు ముందుకొచ్చిన యువకులకు పెట్టుబడి నిమిత్తం అప్పులిచ్చి ప్రోత్సహించాలి...

ఇలాంటి డిమాండ్లతో స్వదేశీ వృత్తుల్లో జీవిస్తున్న కార్మికుల్ని ఆదుకొమ్మని ఆనాటి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. ప్రభుత్వంలో ఏమీ కదలికలేదు. గుంటూరులో కొండ వెంకటప్పయ్యగారు, వింజమూరి భావనాచారిగారూ ఇలా విజ్ఞాపనలతో కాలక్షేపం చేస్తే లాభంలేదని స్వదేశీ ఉద్యమం బలపడాలంటే, విదేశీ పరిజ్ఞానాన్ని మనవాళ్ళే విదేశాలకు వెళ్ళినేర్చుకొస్తే ఎక్కువ ఉపయోగంగా వుంటుందనీ ఆలోచన చేశారు.

కాకినాడకు చెందిన మల్లాది వెంకట సుబ్బారావు అనే యువకుణ్ణి 1906లో పెన్సిల్ తయారీలో శిక్షణ పొందడానికి జపాన్ పంపారు. అతని చదువు, ప్రయాణం, వసతి, భోజనం ఖర్చులన్నీ గుంటూరు సేవా వాయేజ్ ఫండ్‌లోంచి భరించే ఏర్పాటు చేశారు. ఈ పేరుతో ప్రత్యేకంగా నెలకొల్పిన నిధి ఇది.

బళ్ళారికి చెందిన యస్.రామారావు అనే యువకుణ్ణి 'గ్లాస్', మరియు 'వాచ్' ల తయారీలలో శిక్షణపొందే నిమిత్తం పంపారు. మద్రాస్ నేషనల్ ఫండ్ ఇండస్ట్రియల్ అసోసియేషన్ ఇతని ఖర్చుని స్పాన్సర్ చెయ్యడానికి ముందుకొచ్చింది.

గోటేటి జానకీరామయ్యని కార్డ్‌బోర్డ్, స్ట్రాబోర్డ్ తయారీ రంగంలో శిక్షణ నిమిత్తం ఒసాకా పంపించారు. రాజమండ్రికి చెందిన ఎ. భాస్కర రామయ్య అనే ధనిక కలపవ్యాపారి ఇతని ఖర్చుని భరించడానికి ముందుకొచ్చాడు. మద్రాస్ నేషనల్‌ఫండ్ అండ్ ఇండస్ట్రియల్ అసోసియేషన్ 200 రూపాయలు ఇతనికి డొనేషన్‌గా ఇచ్చింది. ఇంత మొత్తం 1906లో చాలా పెద్ద నిధితో సమానమే! రాజమండ్రికే చెందిన మామిడి దేవేంద్రమ్ ఎలెక్ట్రో ప్లేటింగ్, తదితర విద్యుత్ పరికరాల పరిశ్రమలు నెలకొల్పడానికి పరిజ్ఞానం కోసం ఇలాగే ప్రజలూ దాతల సహాయంతో జపాన్ వెళ్లాడు.

మచిలీపట్నం నుంచి ముట్నూరి కృష్ణారావు, ఎతిరాజ సురేంద్రనాథ్ ఆర్య, హరి సర్వోత్తమరావు, కోపల్లి హనుమంతరావు, చిల్లరిగె సేతుమాధవరావు, ఔటుపల్లి నారాయణరావు చిల్లరిగె శ్రీనివాసరావు, పట్టాభి సీతారామయ్య, అల్లూరి సూర్యనారాయణరావు, కౌతాశ్రీరామశాస్త్రి, బెజవాడనుంచి - బోడినారాయణరావు, రంగనాథ నాయుడు, గుంటూరు నుంచి - ఉన్నవ లక్ష్మీనారాయణ (మాలపల్లి) నవలారచయిత) దేవగుప్త శేషాచలపతిరావు, కాటమరాజు రాజేశ్వరరావు, మద్రాస్ నుంచి వెంకట సుబ్బయ్య, అనంతపురం నుంచి గుత్తికేశవ పిళ్ళె - వీరంతా స్వదేశీ ఉద్యమం నడుపుతున్న ప్రముఖులు - తరచూ సభలూ సమావేశాలూ నిర్వహిస్తూ జనాన్ని జాగృతం చేస్తుండేవారు.

ఒకరిని చూసి ఒకరు ప్రేరేపితులై ఉద్యమంలో చేరేవారు. ఉద్యమించే తపన వున్న వ్యక్తులు బహు తక్కువగా వున్న వ్యవస్థలో ముందుగా మేల్కొని ముందుకు వచ్చిన వారికి సహజంగానే నాయకత్వం దొరికేది. ఇలా స్వదేశీ ఉద్యమాన్ని ముందుకు నడుపుతుంటే, ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వానికి సి.ఐ.డి. రిపోర్ట్‌లు ఇలా వెళ్ళాయి.

ఈ స్వదేశీ ఉద్యమాన్ని నడుపుతున్న వారు ముఖ్యంగా బ్రాహ్మణులు - రామస్వామి గుప్తా వంటి కొద్ది మంది బ్రాహ్మణేతరులు మాత్రమే దీని వెనక వున్నారు - ఒక ముస్లిం కూడా ఈ ఉద్యమంలో పాల్గొనలేదు - ఇదీ ఈ రిపోర్టులో ముఖ్యాంశాలు. అంతే! కోతికి కొబ్బరికాయ దొరికినట్టయ్యింది హిందూ ముస్లింల మధ్య విభేదాలు పెట్టడానికి, హిందువులలోనూ బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులూ అనే తేడాల్ని కల్పించడానికీ బ్రిటిష్ వారికి కొత్త ఆలోచనలు పుట్టుకు రాసాగాయి. తాము విసిరిన వలలో మొదటగా ఎవరు చిక్కుకొంటారోనని ఎదురు చూశారు బ్రిటిషర్లు.

అందరికన్నా వేగంగా పరిగెత్తుకొచ్చి చట్టుక్కున వలలలో పడింది జస్టిస్ పార్టీ!

**(డా॥ సరోజినీ రేగాణి - హైలైట్స్ ఆఫ్ ది ఫ్రీడమ్ మూవ్‌మెంట్ ఇన్ ఆంధ్రప్రదేశ్)**

# మీకుంటే మా కిమ్మా!

'మాలిక్ ఇబ్రాహీమ్' మన తెలుగు నేలని పాలించిన రాజుల్లో ఒకడు. ఆయన్నీ ఓ కవిగారు ఆదరణ కోసం ఆశ్రయించాడు.

రాజుగారు- "ఆకుంటే", "ఈ కుంటే", "మీకుంటే", "మాకుంటే" అనే పదాలు వచ్చేలా ఓ మంచి పద్యం చెప్పమన్నాడు.

కవిగారు ఇలా చెప్పాడు పద్యం

క. ఆకుంటే వృక్షం బగు
ఈకుంటే లోభియౌను హీనాత్ముండౌ
మీకుంటే మాకిమ్మా
మాకుంటే మేము రాము మల్కిభరామా!"

ఆకుంటే అది వృక్షం అవుతుంది. ఈకుంటే (దానం చెయ్యకపోతే) లోభి, హీనాత్ముడు అవుతాడు. మీకుంటే కొంచెం మాకూ ఇవ్వండి! మాకుంటే అసలు మీ దగ్గరకి వచ్చే వాళ్ళమే కాదు గదా...! మల్కిభరామా!!" అని, రాజు గారిచ్చిన సమస్యను పూరించాడు. మాలిక్ ఇబ్రహీమ్‌ని మల్కిభరాముడు అని సంబోధించడంలో కవిగారి చాతుర్యం కన్పిస్తుంది. సమస్యాపూరణానికి సంతోషించి రాజుగారు కవిగారిని సత్కరించి పంపారు. ఈ మల్కిభరాముడు తన అన్నతో విరోధించి రాజ్యంలోంచి బైటకు వచ్చి విజయనగర రామరాయల్ని శరణుకోరాడు. కృష్ణదేవరాయలు మరణించినా, అప్పటికింకా సాహితీ సాంస్కృతిక వారసత్వం విజయనగరంలో కొనసాగుతోంది. ఆ సమయంలో మల్కిభరాముడికి తెలుగుకవులతో బాగా పరిచయం అయి తెలుగు భాషాభిమానం పెరిగింది.

రామరాయలు సహాయంతో అన్నని ఓడించి ఇతను రాజ్యాధికారాన్ని పొందాడంటారు.

ఈ రాజు మరణించినప్పుడు బ్రహ్మదేవుణ్ణి తిడుతూ ఒక కవి చెప్పిన పద్యం ఇది -

"రారవిధాత! యోరి వినరా, తగురా తలకొట్ల మారి! ని
స్వార్థపు లోభి రాజులను చంపక మల్కిభరామ భూవరున్
జారు యశోధనున్ సుగుణి, జంపితి, నర్థులకేమి దిక్కురా!
చేరిక నింత రాజును సృజింపంగ నీ తరమా వసుంధరన్!

ఓరి దేవుడా! వినరా! ఇది నీకు తగునా? ప్రాణాలు తీసే వాడా! స్వార్థపు లోభిరాజుల్ని చంపకుండా మా రాజు మల్కిభరాముణ్ణి, మంచి కీర్తి కలవాణ్ణి, మంచివాణ్ణి - చంపావు

– ఆయన్ని ఆశ్రయించి దానధర్మాలు పొందేవారికి దిక్కెవరురా? మళ్ళీ ఇంతటి రాజుని సృష్టించడం నీతరం అవుతుందా... బ్రహ్మదేవుడా..." అని!

ఇది ఇలా వుంటే 'మహ్మద్ భేక్ సాహెబు' అనే చిన్న జమీందారు గార్ని ఓ బ్రాహ్మణుడు ఇలానే 'ఆదరణ' కోసం ఆశ్రయించాడు.

"అయ్యా! మల్కిభరామ్ ప్రభువులవారు తెలుగు కవుల్ని బాగా ఆదరించి ఆయనపేరు చిరస్థాయిగా నిలుపుకున్నారు. తమరుకూడా నవాబు ప్రభువులంత వారు కదా..." అని పొగిడాదు. "సరేనండీ పంతులుగారూ! ఇప్పటికిప్పుడు నామీద ఓ పద్యం చెప్పండి... నూట పదహార్లు బహుమతిగా ఇస్తాను–" అన్నాడు సాహెబుగారు.

ఆ బ్రాహ్మణుడు దానం కోసం ఆశ్రయించాడే గానీ కవి కాదు. అయినా తడుముకోకుండా సమయస్ఫూర్తిగా భాగవతంలోని ఓపద్యం కొద్దిగామార్చి, చివర సాహెబు గారి పేరు చేర్చి ఓ చిందరవందర పద్యం చదివేశాడు–

క. భిల్లీ భల్ల లులాయక
భల్లుక ఫణి ఖడ్గ గవయ బలిముఖ చమరీ
ఝల్లి హరిశరభ కరికిరి
మల్లాద్భుత కాకఘూక! మహమదుభేకా!

పంతులుగారు నూటపదార్లు పట్టేసే వుంటాడని వేరే చెప్పనవసరం లేదు!!

**(దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి 'చాటు పద్య రత్నాకరము)**

# చావు కబుర్లు

కృష్ణా పత్రిక నదుస్తున్న రోజులు సంపాదకవర్గంతో ముట్నూరు కృష్ణారావుగారి సంభాషణ ఇలా వుండేది.

ఎవరో పోయిన వార్త : 'ఈయన బ్లాకు వుందా మన దగ్గిర?" అడిగేవారు. ఉన్నదంటే – "సరే! కొంత కలిసి వచ్చింది. బ్లాకులేని వాళ్ళు పోతే మనకు 'చోటున్నా' కలిసిరాదు – అనేవారు.

"అయితే, ఈ వారంలో మనం చింతించాలన్నమాట!" అనేవారు ఇంకెవరైనా ప్రముఖుడు పోతే! అంటే, పోయిన ఆయన గురించి చింతిస్తూ సంపాదకీయం రాయాలని!

"పోనీ ఈ వారం మీరు చింతించరాదూ?" అనడిగేవారు ఇంకోసారి ఉపసంపాదకుణ్ణి! అంటే, "సంపాదకీయం అవసరం లేదు – మామూలు న్యూస్‌లో వేసేయండి –" అని చెప్పడం! **(రావూరి – మన ముట్నూరి)**

### ఈస్టిండియా కంపెనీ
# పలాయనం

గాజులు లక్ష్మీనరసు చెట్టి 1840కి పూర్వం ఈస్టిండియా కంపెనీ అనాగరక పాలనని ఎదుర్కొన్న తెలుగువాడు.

రాజారామ్మోహన రాయ్, స్వామి దయానంద సరస్వతి ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటి ప్రముఖులు ఉత్తర భారతదేశంలో సంఘ సంస్కరణలవైపు, సామాజిక చైతన్యం వైపు ముందుకు సాగిపోతున్న కాలంలో గాజులు లక్ష్మీనరసు చెట్టి మద్రాస్ ప్రావిన్స్‌లో కంపెనీ అకృత్యాలను ఎదిరించేందుకు ప్రజల్ని జాగృతం చేసే దిశలో ఇంచుమించు వంటరి పోరాటం జరిపాడు.

ఆ రోజుల్లో, అమెరికాకు పత్తి ఎగుమతులు జరిపే వ్యాపారంలో వున్న స్థితిమంతుల కుటుంబంలో వాడు ఈ గాజులు. అమెరికాలో పారిశ్రామిక విప్లవం తర్వాత ఆ వ్యాపారాన్ని వదులుకొని ప్రజాజీవితంలోకి అడుగు పెట్టాడు.

1844లో క్రిసెంట్ (నెలవంక లేదా, శుక్లపక్షం అనే అర్థంలో) ఆంగ్ల పత్రికని నెలకొల్పి ఈస్టిండియా కంపెనీ దుష్టపాలనని ఎండగట్టేవాడు. ఘాటైన పదాలు వాడేవాడని చెప్తారు.

క్రైస్తవమతం పుచ్చుకున్న హిందూయువకులకి వారి తల్లిదండ్రుల ఆస్తిలో హక్కు వుంటుందనే బిల్లుని ఉపసంహరించేశాడు.

బైబిల్‌ని పాఠ్యపుస్తకంగా మద్రాస్ విశ్వవిద్యాలయంలో ప్రవేశపెట్టే ప్రయత్నాల్ని కూడా ఇలానే రెండుసార్లు విజయవంతంగా అడ్డుకోగలిగాడు.

1852లో మద్రాస్ నేటివ్ అసోసియేషన్ నెలకొల్పాడు. దాని పక్షాన 14-04-1856న ఒక చారిత్రాత్మక విజ్ఞాపన పత్రాన్ని బ్రిటిష్ పార్లమెంటుకు నివేదించాడు.

డాన్బీ సేమోర్ అనే బ్రిటిష్ పార్లమెంటేరియన్ స్వయంగా మద్రాస్ వచ్చి ప్రత్యక్షంగా ఇక్కడి పరిస్థితులన్నిటినీ పరిశీలించాడు. 'అభివృద్ధి' లేకుండా పన్నులు వసూలు మాత్రమే ధ్యేయంగా కంపెనీ పాలన ఎలా సాగుతోందో గాజులు ఆయనకు దగ్గరుండి చూపించి నిరూపించాడు.

'గాజులు' సమర్పించిన మెమొరాండంలో అధికపన్నులు తగ్గించాలని అక్రమశిక్షలు, మానాలని రోడ్లు - నీటిపారుదల సౌకర్యాలు ఏర్పాట్లు చేయాలనీ గట్టిగా డిమాండ్ చేశాడు.

భారత ప్రజలు తమ వాదనని ప్రభుత్వానికి విన్పించేందుకు వీలైన ప్రాతినిధ్యం భారతీయులకు కల్పించే విధంగా స్థానిక పరిపాలనని ప్రవేశపెట్టమని మొట్టమొదటగా డిమాండ్ చేసింది ఈ తెలుగుబిడ్డడే!

లోకల్ గవర్నమెంట్ అనేది ప్రజలకు ఆనందాన్నీ, దేశానికి సౌభాగ్యాన్నీ ఇచ్చేదిగా వుండాలని ఆయన కోరాడు.

ఈస్టిండియా కంపెనీని అధికారంలోంచి తప్పించి బ్రిటిష్‌పార్లమెంట్ పర్యవేక్షణలో భారతీయుల ప్రాతినిధ్యంలో పరిపాలన సాగించడం గురించి ఎంతో ధైర్యంగా మెమొరాండంలో ప్రస్తావించాడు గాజులు!

గాజులు లక్ష్మినరసుచెట్టి చేసిన కృషి వమ్ముకాలేదు. బ్రిటిష్ పార్లమెంట్‌లో వేడివేడిగా ఈ మెమొరాండంపై చర్చ జరిగింది.

'టార్చర్ కమీషన్' పేరుతో అత్యాచారాలపైన ఒక పరిశీలనా సంఘాన్ని అన్ని అధికారాలతో నియమించి భారతదేశానికి పంపింది ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం. తర్వాత జరిగిన పరిణామాలు ఈస్టిండియా కంపెనీని దేశం నుంచి తరిమేసే దిశగా అనేకం చోటుచేసుకున్నాయి.

పాలనా బాధ్యతని బ్రిటిష్ పార్లమెంట్ స్వయంగా చేపట్టాలనే ఆలోచనకు బలమైన ఊపు కల్గించిన గాజుల లక్ష్మీనరసుచెట్టి తెలుగువారికి ప్రాతఃస్మరణీయుడు! 1868లో ఆయన పరమపదించాడు

**(యన్.యస్. చంద్రశేఖర్ రాసిన దివాన్ రంగాచార్లు అనే ఆంగ్ల గ్రంథం)**

# కొండవీటి గాడిద

మంచి కవులుకాని వాళ్ళని నిందించడాన్ని కావ్యాలు రాసేప్పుడు కవులు సహజంగా పాటిస్తారు. "కుకవి నింద" అంటారు దీన్ని. కొండవీటి గాడిదను అద్భుతంగా ఉపయోగించి శ్రీనాథుడు కుకవి నింద ఎలా చేశాడో గమనించండి.

బూడిదబుంగవై యొడలు పోఁడిమిదప్పి మొగంబు వెల్లవై
వాడల వాడలం దిరిగి వారును వీరును ఛీయనంగ నా గోడల గొందులం బెనచి కోయని యార్చెదు కొండవీటిలో గాడిద, నీవునుం గవివి కావుగదా యను మాన మయ్యెడిన్.

దుమ్ములో ధూళిలో పడి పొర్లుతూ, వీధుల్లో పడి బేవార్సుగా తిరుగుతూ వాళ్ళూ వీళ్ళూ 'ఛీ' అని చీదరించుకొంటుంటే – గాడిదా...! పొరబాటున నువుకూడా కవివి కాదు గదా... అనుమానం వచ్చిందిలే... అని!

# అలెగ్జాండర్ వారసుడు

**"హొతీతో క్రతిస్తో"** గ్రీకువీరుడు అలెగ్జాండర్ నోటివెంట అప్రయత్నంగా ఈ మాటలు వెలువడ్డాయి. మరణశయ్య మీద ఆఖరు క్షణాల్లో కొట్టుమిట్టాడుతోంది అలెగ్జాండర్ ప్రాణం!

"తమ వారసులుగా ఎవరిని నిర్ణయిస్తారు?" ఎంతో భయభక్తులతో వినయంగా అడిగారు ఇద్దరు సైనిక ప్రముఖులు. అప్పటివరకూ పదిమాటలకు ఒక మాట ఓపిక కూడగట్టుకొని మాట్లాడుతున్న అలెగ్జాండర్ రోషంగా అన్నాడు "హొతీతో క్రతిస్తో- "బలమైన వాడే... నా వారసుడు ।" అని!

గర్భవతులుగా వున్న అతని భార్యలు ముఖాలు చూసుకున్నారు. వారిలో వారసుడు కాగలిగే కొడుకును కనేదెవరో...!

క్రీస్తుకు పూర్వం షుమారు ఐదువందల ఏళ్ళ ముందు బుద్ధుడు పుట్టాడు. బుద్ధుడు పుట్టిన నూటయాభై సంవత్సరాలు పైబడ్డ తర్వాత అలెగ్జాండర్ క్రీస్తుపూర్వం 336లో జన్మించాడు. అతను మరణించబోతున్న రోజుకి అతనికి 36 సంవత్సరాలు నిండాయి.

భారతదేశంలో 'పోరస్' అనే పురుషోత్తముడితో పోరాడిన తర్వాత బాబిలోనియాలో తన రాజధానిని నెలకొల్పాలని భావించాడు అలెగ్జాండర్. బాబిలోనియా వాతావరణం అతని శరీరానికి సరిపడలేదు. దానికితోడు నదిఒడ్డున విడిది చేసిన సైనిక తండాలు కలుషితం చేసిన నది నీటిని తాగి అస్వస్థుదయ్యాడతడు.

మొదట చలితో జ్వరం ప్రారంభం అయ్యింది. అప్పటికే జ్వరం వలన అతని ప్రాణమిత్రుడు యోధుడు హెఫాస్టియన్ మరణించాడు. అతని మరణం అలెగ్జాండర్‌ని క్రుంగదీసింది. అలాంటి జ్వరమే తనకూ సోకడంతో ఖంగారుపడ్డాడు.

అలెగ్జాండర్‌కి జ్వరం వచ్చిన రోజే అనేక అపశకునాలు కన్పించాయి.

సముద్రంమీద ప్రయాణిస్తున్నప్పుడు ఎలా పోయిందో తెలియదు - 'మిత్రా' దేవుడి వరప్రసాదంగా భావించే అతని కిరీటం కన్పించకుండా పోయింది.

అయినా, సైన్యానికి తన దైన్యాన్ని కన్పించకుండా విజయోత్సవం పేరుతో పెద్దవిందు ఏర్పాటు చేశాడు. అందరినీ విందుకు ఆహ్వానించాడు గానీ తాను పాల్గొనలేకపోయాడు- కదిలితే చలిజ్వరం!!

నీరసం నిస్సత్తువలు క్రమేణా ఆవహిస్తున్నాయని గమనించాడు. తన మిత్రుడిలానే తనకూ మృత్యువు ఆసన్నమౌతున్నదా...? ఆ ఆలోచన వచ్చేసరికి వెన్నులోంచి చలి మరింత ఎక్కువైంది.

వైద్యులు అలెగ్జాండర్ జ్వరాన్ని తగ్గించి చలిని అదుపు చేయదానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు కానీ, మందులేవీ పనిచేస్తున్న దాఖలాలు కన్పించడం లేదు.

జ్వరం వచ్చి వారం రాజులౌతోంది.

రాజధాని నగరాన్ని నిర్మించి పనులు ప్రారంభించాలి ముందు తగిన స్తలాన్ని అన్వేషించాలి - ప్రపంచ విజేతకు తగిన స్థాయిలో అతనిరాజధాని వుండాలి.

ఎలాగో ఓపిక కూడగట్టుకొని స్తలాన్వేషణ కోసం బయల్దేరాలనుకున్నాడు. భయపడిన కొద్దీ భయపెడ్తుంది - ఈ జ్వరం ఇంతే - ననుకున్నాడు.

లేచి గబగబా స్నానం చేశాడు.

అంతే - పెను గాలులు వీచినట్లు ఆయన శరీరంలోంచి చలి వణుకు మొదలయి కుప్పకూలిపోయాడు అలెగ్జాండర్.

వైద్యులు ఆనాటికి వారికి తెలిసిన ఏవో చికిత్సలు చేశారు. కాస్త ఉపశమనం కన్పించింది. కానీ జ్వరతీవ్రత అలానే కొనసాగుతోంది.

రోజులు గడిచిపోతున్నాయి. సైనికాధికారులకు సూచన లిస్తూనే వున్నాడు. ఎవరి పనులు వారికి చెప్పి అందర్నీ సమాయత్తం చేస్తున్నాడు. మళ్ళీ దండయాత్రలు ప్రారంభిస్తే తప్ప ఈ చలిజ్వరం అతన్ని వదిలేలా లేదని అనుకొన్నాడు. సైన్యంలో ముఖ్య అధికారులందర్నీ తక్షణం తన ముందు హాజరు కమ్మని ఆదేశించాడు. ఓపిక కూడగట్టుకొని కనీసం కూర్చుని మాట్లాడాలని ప్రయత్నించాడు.

జ్వరం వచ్చి పదో రోజుకి చేరింది.

అలెగ్జాండర్ విశ్రాంతి తీసుకొంటున్న గది చిన్నది కావడంతో ముఖ్య సైన్యాధికారులు లోపలికి వచ్చారు. ద్వితీయ శ్రేణి అధికారులు వాకిట నిల్చున్నారు.

ఏదో మాట్లాడబోయాడు... పెద్దపెట్టున తలపగిలినంత నొప్పి వచ్చింది. అంతే! కాలు చెయ్యి, పడిపోయాయి. చలిజ్వరం మెదడుకు సోకింది.

ఖంగారుపడ్డారు సైనికాధికారులు.

వాళ్ళకేదో చెప్పేందుకు ప్రయత్నిస్తున్నాడు అలెగ్జాండర్... అతనిమాట వాళ్ళకి అర్థం కావడం లేదు.

అలెగ్జాండర్ ఆరోగ్యపరిస్థితి క్షీణించిందన్న వార్త గుప్పుమంది.

వేలాది సైనికులు.... ప్రపంచ దేశాల్ని జయించి విశ్రాంతి తీసుకొంటున్నారు.... వార్త వినడంతోనే తలకిందులై పోయారు.

మరణం చివరి అంచున వున్న తమ నాయకుడిని కడసారి దర్శించుకోవడానికి బారులు తీరి నిల్చున్నారు.

ఒక తలుపు మూసి ఒక్కక్కరినే లోపలికి పంపుతున్నారు. లోపలికి వచ్చిన ప్రతి ఒక్కరినీ గుర్తించి కళ్ళతోనే పలకరిస్తున్నాడు అలెగ్జాండర్. ఆ దుస్థితిలో ఆ మహావీరుణ్ణిచూసి దుఃఖించని సైనికుడు లేడు. అలెగ్జాండర్ తల దగ్గర ఇద్దరు ప్రధాన సైన్యాధికారులు నిలబడ్డారు. వారసుడి ప్రస్తావన వాళ్ళే తెచ్చారు.

సాలోచనగా చూశాడు అలెగ్జాండర్ వారి వంక! అతని కళ్ళ వెంబడి అప్రయత్నంగా నీటిపాయలు ప్రవహించసాగాయి.

'పెర్డిక్కాస్' అనే సైన్యాధికారికి తనచేతిని అందించాడు. రాజముద్రిక కల్గిన ఉంగరం దానికుంది... దాన్ని తీసుకొని రాజప్రతినిధిగా వ్యవహరించమన్నాడు.

"నా అంత్య క్రియల రోజు ఈ సింహాసనం అధికారం కోసం పెనుగులాడుకునే ఆటస్థలం కాకూడదు–" సన్నగా గొణుగుతూ అన్నాడు అలెగ్జాండర్

"హోతితో క్రతిస్తో–" బలం వున్నవాడే నాకు వారసుడు... అన్నాడు – 'బలం వున్నవాణ్ణి ఎంపిక చెయ్యండి– బలపరీక్ష పెట్టండి–"

అలెగ్జాండర్ ఆలోచనలకు అందరూ విస్తుపోయారు. తనకు పుట్టబోయే బిడ్డడికి రాజ్యం రాసిస్తాడని కూడా ఆ క్షణాన ఎవరూ వూహించలేదు.

నల్లని పొగమంచు ఆకాశం అంతా వ్యాపించింది. ఆకాశంలోంచి పెద్ద పిడుగు ఏదో రాలిపడ్తున్నంత శబ్దం అయ్యింది. పెద్ద మెరుపు తీగ స్వర్గం నుంచి భూమికి దిగినట్లనిపించింది... అక్కడ చూస్తున్న ప్రతి ఒక్కరికీ!

అందరూ అలాచూస్తుండగానే నేలను తాకిన మెరుపుతీగ తిరిగి ఆకాశంలోకి – పైలోకాల్లోకి వెళ్ళిపోయింది. పెద్ద జటాయువేదో ఎగిరి మెరుపు తీగవెంటే ఆకాశంలోకి దూసుకుపోవడాన్ని ప్రతిఒక్కరూ గమనించారు. అలెగ్జాండర్ కళ్ళు మూత పడిపోయాయి.

"ధైర్యంతో బతికి కీర్తిని వదిలేసి వెళ్ళడంకన్నా ప్రియమైన విషయం ఏముందీ...' ' అని అలెగ్జాండర్ అప్పుడప్పుడూ అంటుండే మాటలు అందరికీ చెవుల్లో మార్మోగాయి. తనని ఖననం చేసేప్పుడు ఒక చెయ్యి పైకి వుంచి ఖననం చెయ్యమని అలెగ్జాండర్ కోరాడని చెప్తారు. ఈ లోకంనుంచి ఏమీ తీసుకుపోవడం లేదని ఆవిధంగా చాటదలచాడు అలెగ్జాండర్ రిక్తహస్తాన్ని చూపిస్తూ.

**(యం.వి. కామత్ ఫిలాసఫీ ఆఫ్ లైఫ్ అండ్ డెత్)**

*దేశభక్త కొండ వెంకటప్పయ్య*

# పరివర్తన

దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులు గారి చిన్ననాటి సంఘటన ఇది.

అది షుమారుగా 1880.... ప్రాంతం.

గుంటూరులో కుగ్లర్ దొరసాని దీనులకు, ఆర్తులకు, రోగపీడితులకు చేస్తున్న సేవని చూసి పదిహేనేళ్ళ కుర్రవాడిగా వున్న వెంకటప్పయ్యకు క్రైస్తవ మతం పుచ్చుకోవాలనే వ్యామోహం కల్గింది.

ప్రభల రామచంద్రయ్య పంతులు, చేవేంద్ర వెంకటాచలం పంతులు వీళ్ళంతా ఆ రోజుల్లో క్రైస్తవ మతం పుచ్చుకున్న బ్రాహ్మణ ప్రముఖులు.

కొండ వెంకటప్పయ్య వీళ్ళ దగ్గరికి వెళ్ళి తానుకూడా క్రైస్తవం పుచ్చుకోవాలనుకొంటున్నట్లు చెప్పాడు. కానీ వాళ్ళిద్దరూ చూద్దాం లెమ్మన్నారు గానీ అతన్ని ప్రోత్సహించలేదు.

అందుకని, నేరుగా క్రైస్తవ మతపెద్ద యూలుదొర గారింటికి వెళ్ళి తన సంగతి చెప్పుకొన్నాడు.

యూలుదొర తన సంతోషాన్ని ప్రకటించి – ఈ కుర్రవాడిలో ప్రభువుపట్ల మరింత విశ్వాసాన్ని కల్గించమని ప్రార్థించి, రేపు రమ్మన్నాడు.

ఈలోగా ఇంట్లో ఈ వార్త తెలిసిపోయింది. ఊళ్ళో పెద్దలంతా చేరిపోయారు. తలా ఒకరకంగా వెంకటప్పయ్య గారి బుర్ర తినేశారు. గురువు గారు కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు – "మన మతం గురించి చదివి విషయాలు తెలుసుకొని అప్పుడు ఒక నిర్ణయానికి రావడం మంచిది" అని సలహా యిచ్చారు.

తల్లి లేని బిడ్డ అని గారాబంగా పెంచితే వదిలేసి పోతానంటున్నాడని తండ్రి దుఃఖించడం మొదలుపెట్టాడు. తండ్రి దుఃఖాన్ని చూసే సరికి వెంకటప్పయ్యకు కూడా ఏడుపు ముంచుకొచ్చింది.

మర్నాడు వస్తానని వాగ్దానం చేసినా యూలుదొర గారి దగ్గరకు వెళ్ళలేదు వెంకటప్పయ్య.

రెండోరోజు కాస్త మనసు కుదుట పడ్డాక ఆయన ఇంటికి వెళ్ళాడు.

"నిన్న రాలేదేం" అడిగాడు యూలుదొర.

జరిగినదంతా వివరంగా చెప్పాడు వెంకటప్పయ్య.

"మంచిది! నీవు క్రైస్తవుడవు కాకపోయినా, మంచి హిందువుగా వుండు - Be a good Hindu" అని ఆశీర్వదించాడు యూలుదొర.

ఆనాడు వెంకటప్పయ్యలో ఈ మానసిక పరివర్తన కలగకపోతే ఆంధ్రదేశం ఒక మహాదేశభక్తుని, ఉద్యమనాయకునీ, ఆనాటి కాంగ్రెస్‌కు ఒక పెద్ద దిక్కునీ కోల్పోయి వుండేది!

రోజుకు వందమంది యువకుల్ని క్రైస్తవంలోకి మతమార్పిడి చేయమని ప్రభుత్వ ఉత్తర్వులు అమలులో వున్న ఆ రోజుల్లో నిజాయితీ పరుడైన దైవభక్తుడు యూలుదొర దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులు గార్ని తెలుగు వారికి తిరిగి ప్రసాదించాడనే చెప్పాలి!

ఎందుకంటే, ఆ రోజుల్లో క్రైస్తవం పుచ్చుకోవడం అంటే, బ్రిటిష్ అనుకూలత- అని అర్థం!

**(కొండ వెంకటప్పయ్య స్వీయచరిత్ర)**

# మజ్జిగ మంచివి

"కైలాసే యది తక్రమస్తి గిరిశః కిం నీలకణ్ఠో భవేత్
వైకుణ్ఠే యది కృష్ణతా మనుభవే దద్యాపి కిం కేశవః
ఇన్ద్రో దుర్భగతాం క్షయం ద్విజపతిర్లమ్బో దరత్వం గణః
కుష్ఠిత్వం చ కుబేరకో దహనతా మగ్నిశ్చ కిం విందతి"

కైలాసంలో మజ్జిగ దొరికితే శివుడు నీలకంఠుడెందుకు అవుతాడు? వైకుంఠంలో మజ్జిగ దొరికినా విష్ణుమూర్తి నల్లనివాడయ్యేవాడు కాదు. అసలు, స్వర్గంలో మజ్జిగే కనక దొరికినట్లయితే ఇంద్రుడు అలా బలహీనుడిగా మారిపోయేవాడా...? వినాయకుడికి మజ్జిగతాగే అలవాటున్నట్లయితే లంబోదరుడయ్యేవాడే కాదు. మజ్జిగ తాగడం మొదలు పెడితే కుబేరుడికి కుష్ఠురోగం వచ్చివుండేదా...? సాక్షాత్తూ అగ్నిదేవుడికి మజ్జిగతాగే అవకాశం వుంటే ఆయనలో కాలేగుణం వుండేదా...? ఇలా వర్ణిస్తుంది యోగర్నాతకరం అనే వైద్యగ్రంథం మజ్జిగ ఉపయోగాల్ని.

దీని సారాంశం ఏమంటే, మజ్జిగ - విషదోషాల్ని, బలహీనతనీ, చర్మవ్యాధుల్నీ, స్థూలకాయాన్ని, అమితమైన వేడినీ తగ్గించి శరీరానికి మంచి రంగునీ, బలాన్ని, ఆయుష్షునీ కల్గిస్తుందని!

పాలుకన్నా పెరుగు, పెరుగుకన్నా చిలికిన మజ్జిగ మంచివి!!

# ఇక్బాల్ జాతీయత!

జిన్నాగారు, గాంధీగారూ ఇద్దరూ న్యాయవాద వృత్తిలోంచి వచ్చినవారే. కానీ, గాంధీజీ సహాయ నిరాకరణ వంటి చట్టాన్ని ధిక్కరించే ఉద్యమాలను నడపడం జిన్నా గారికి నచ్చేది కాదు. "చదువుకునే రోజుల్లోనే ఈ కుర్రకారుని ఇలా క్రమశిక్షణ లేని వాళ్ళుగా తయారుచేస్తే ఎలా... వీళ్ళలో మీ పిల్లలూ వున్నారూ - మా పిల్లలూ వున్నారు...." అనేవాడు జిన్నా! "ఇది వృథాత్యాగం! పిల్లలు బళ్ళు ఎగ్గొట్టి తిరిగితే స్వాతంత్ర్యం వస్తుందా..?" అనేది జిన్నాగారి ప్రశ్న! భవిష్యత్తులో క్రమశిక్షణ లేని జాతి తయారుకావడానికి గాంధీ కారకుడౌతున్నాడని ఘాటుగానే విమర్శించాడాయన.

ఆరోజుల్లో లండన్‌లో గెర్రార్డ్ వీధిలో 'షఫీ - ఇండియన్ రెస్టారెంట్' అనేది భారతీయులకి ఆటవిడుపు కేంద్రంగా వుండేదిట!

గుండ్రటి టేబుళ్ళ చుట్టూ చేరి కాఫీ తాగుతూ భారతదేశంలో విశేషాల గురించి భారతీయలు ఈ లండన్ హోటల్లో కూర్చుని చర్చించుకునే వారట.

అది 1931. ఫ్రాంక్ మోరేస్ విద్యార్థిగా లండన్‌లో చదువుకొంటున్నాడప్పుడు. ఆ తర్వాత ఆయన ప్రసిద్ధ భారతీయ పాత్రికేయుడిగా రాణించారు. టైమ్స్ ఆఫ్ ఇండియా, ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లకు సంపాదకుడిగా వుండేవారు. ఒకరోజు ముస్లింలు కొంతమంది మాట్లాడుకోవడాన్ని ఈ ఫ్రాంక్ మొరేస్ గమనించాడు. వాళ్ళలో ప్రముఖ భారతీయ కవి సర్ మహమ్మద్ ఇక్బాల్ కూడా వున్నాడు. ఇక్బాల్ నోటి వెంట ఆ రోజన మొదటిసారిగా "పాకిస్తాన్" అనే వాదన రావడాన్ని కూడా మోరెస్ గమనించాడు. ఆ తర్వాత ఆ విషయాన్ని మహమ్మదాలీ జిన్నా గారి దృష్టికి తీసుకువెళ్ళాడట మోరెస్.

దానికి జిన్నాగారు బిగ్గరగా నవ్వి - "అబ్బాయీ! ఇక్బాల్ కవి మాత్రమే! రాజకీయ వేత్త కాదు. కవులు కలల్లో జీవిస్తుంటారు-" అంటూ పాకిస్తాన్ వాదనని తేలికగా కొట్టేశారు జిన్నా!

కానీ, విచిత్రంగా - అది జరిగిన 16 సంవత్సరాల తర్వాత జాతీయ గీతంతో సమానమైన గౌరవాన్ని పొందిన "సారే జహాసే అచ్చా" గీత రచయిత మహమ్మద్ ఇక్బాల్ భారతీయులకు ఆరాధ్య కవిగానూ, జిన్నాగారు పాకిస్తాన్ పితామహుడుగానూ మిగిలారు. 'కొసమెరుపులు' కొన్ని ఇలానే వుంటాయి!!

జిన్నాగారు "జాతి"నీ ఇక్బాల్ గారు "జాతీయతనీ" ఆశ్రయించారు.

**(విట్నెస్ టు యాన్ ఎరా - ఫ్రాంక్ మోరెస్)**

# ఓ తండ్రి త్యాగం

1922లో బ్రిటిష్ ప్రభుత్వం ప్రభుత్వోద్యోగులుగా పని చేస్తున్న వారి కుటుంబ సభ్యులలో ఎవ్వరైనా సహాయనిరాకరణ ఉద్యమంలో పనిచేస్తున్నట్లయితే, తక్షణం వారితో తెగతెంపులు చేసుకుతీరాలని, కన్న బిడ్డనైనా, కట్టుకున్న భార్యనైనా ఇంట్లోంచి తరిమేయాలనీ ఆదేశాలు జారీచేసింది.

భారతదేశానికి రాష్ట్రపతిగా పనిచేసిన వి.వి.గిరి అప్పట్లో యువకుడే అయినా, పేరున్న కాంగ్రెస్ నాయకులలో ఒకడు. సహాయనిరాకరణ ఉద్యమం రథసారథుల్లో ఒకడు.

ఆయన తండ్రి వరాహగిరి జోగయ్య పంతులు గారు. 'గంజామ్'లో పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా, గర్నమెంట్ ప్లీడర్‌గా వుండేవారు. ఈ కొత్త ఆదేశాల గురించి తండ్రిగారు గిరిగారి దృష్టికి తీసుకొచ్చాడు. తన వలన తన తండ్రికి ఇబ్బంది కలగకూడదనీ, తండ్రి ఉద్యోగానికి తాను హాని తలపెట్టననీ, తనే ఇంట్లోంచి వెళ్ళిపోతానని అన్నాడు వి.వి.గిరి!

"దేశం కోసం కన్న తల్లిదండ్రుల్నే నువు వదులుకొని త్యాగాలు చేస్తుంటే, ఉద్యోగం కోసం, పొట్టకూటి కోసం స్వార్థపరుడిగా మిగిలిపొమ్మంటున్నావా నన్ను..." కోపంగా అడిగారు జోగయ్య పంతులు గారు. అప్పటికప్పుడే మద్రాస్ గవర్నమెంట్ చీఫ్ సెక్రటరీని ఉద్దేశించి ఉత్తరం రాసేశాడాయన.

"భారతీయులు బ్రిటిష్ దొరల చేతికింద మనసు చంపుకొని ఎన్నోరకాల అకృత్యాలను భరిస్తూ పనిచేస్తున్నారు. కానీ, నిజాయితీ పరులైన ప్రభుత్వోద్యోగుల కుటుంబసభ్యుల మీద ప్రభుత్వం అజమాయిషీ చెలాయించాలనుకోవడం అన్యాయం. తండ్రీ బిడ్డల రాజకీయ మార్గాలు వేర్వేరు అయినంత మాత్రాన తెగతెంపులు చేసుకొని విడిపోవాలని ఆదేశించడం భారతీయుల మనోభావాలను గాయపరచడమే! ఇలాంటి ఆదేశాలకు నిరసనగా నా ఉద్యోగానికి రాజీనామా సమర్పిస్తున్నాను" అనేది ఆ ఉత్తరంలో సారాంశం!

"కొడుకు తప్పుల కోసం తండ్రి రాజీనామా" అనే వ్యంగ్య శీర్షికతో ఈ లేఖని ఆ మర్నాడు ఏప్రియల్ 24, 1922న ప్రచురించింది 'ది హిందూ' ఆంగ్ల దినపత్రిక!

కొడుకుల్ని ఖద్దరు తొడిగితే ఇంట్లోంచి వెళ్ళగొట్టమని ఆదేశించింది ప్రభుత్వం.

బరంపురాన్ని ఒరిస్సా నుంచి మద్రాస్ ప్రావిన్స్‌లో ఆంధ్రప్రాంతాలతో కలపాలని అప్పట్లో గాంధీగారికి విన్నవించాడు జోగయ్యపంతులు. కానీ, బరంపురంలో సంఖ్యాపరంగా తెలుగువారికన్నా ఒరియా వారే ఎక్కువగా వున్నట్లు రికార్డులు వుండడంతో ఈ ఆశయం అప్పటికేకాదు, ఇప్పటికీ నెరవేరలేదు.

**(ది హిందూ 100 ఇయర్స్)**

## సూరకవి గారి

# 'బూచి'

18వ శతాబ్దికి చెందిన అడిదము సూరకవి తెలుగులో ప్రసిద్ధిచెందిన తిట్టు కవులలో ఒకరు. "సూరకవి తిట్టు - కంసాలి సుత్తి పెట్టు" అని చెప్పుకొనేవారు జనం. సుతారంగా వుంటుంది గానీ, ఈ సుత్తి దెబ్బ లోతుగానే తగుల్తుంది.

సూరకవి గారికి, రేగ - కంచరం అనే రెండు గ్రామాలలో మాన్యాలుండేవి.

"సురుచిర సత్కవిత్వ నిధి సూరకవీంద్రుని కేల కల్గెగం

చరమును రేగ మేఁక మెడ చన్నుల వంటివి రెండు మాన్యముల్-"

అనే చాటుపద్యంలో తన రేగ, కంచరం మాన్యాలు రెండూ మేక మెఁడ చన్నుల వంటివని చెప్పుకొన్నాడు. అవి ఎప్పుడూ పండేవి కాదు. అందువలన ఆర్థికపరమైన ఇబ్బందులు వుండేవి.

ఒకరోజు భోజన సమయంలో సూరకవి గారి భార్య - "అందరి మీదా పద్యాలు చెప్తున్నారు కదా- మన అబ్బాయి బాచన్న మీద కూడా ఒక పద్యం చెప్పండీ" అని బ్రతిమాలింది.

క॥ బాచా బూచుల లోపల,
బాచన్నే పెద్ద బూచి పళ్ళున్ దానున్
బూచంటే రాత్రి వెఱతురు
బాచన్నను జూచి పట్ట పగలే వెఱతుర్ -

"బూచుల్లో కెల్లా మన బాచన్నే పెద్ద బూచి - భయంకరమైన పళ్ళూ - వీడూనూ! రాత్రిపూట మామూలు బూచికి భయపడతారు - కానీ మన బాచన్నను చూస్తే పట్టపగలే భయపడతారు' అని దీని భావం.

అంతే! మళ్ళీ ఆ ఇల్లాలు తన మీద గానీ, తన పిల్లల మీద గాని, తన తరపున బంధువుల మీద గానీ పద్యం చెప్పమని అడిగి వుండదు!

**(తెలుగులో తిట్టు కవిత్వము - రావూరి దొరస్వామి శర్మ)**

### జాతిని కదిల్చిన పల్నాటి

# పుల్లరి ఉద్యమం

పల్నాడులో పుల్లరి ఉద్యమం గాంధీగారు సహాయనిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించడానికి ముందే 1921లో జరిగింది.

అటవీ శాఖాధికారులు ప్రజల్ని పీడిస్తున్నారని మాచర్ల సమీప ప్రాంతంలోని ప్రజలు "పుల్లరి పన్ను చెల్లించం" అంటూ ఎదురు తిరిగారు.

ప్రభుత్వాధికారులుగా వున్న వారు భారతీయులైనా, బ్రిటిషర్లయినా ఊళ్ళో మంచినీళ్ళు పుట్టకుండా చేశారు.

రంగా చంచయ్య అనే వైశ్యుడు ఈ ఉద్యమాన్ని నడిపాడు.

మాచర్ల డిప్యూటీ తాహిసిల్దార్ ఇంట్లో పసిపిల్లలకు పాలు కూడా దొరకక బిడ్డ కక్కటిల్లింది.

గుంటూరు జిల్లా కలెక్టర్ 'షీల్డ్' అనే ఆయన పరిస్థితిని స్వయంగా అంచనా వేద్దామని మాచెర్ల క్యాంప్ వచ్చాడు. ఆపూట ఆయనకు భోజనం లేదు. గుంటూరు నుంచి కోడిగుడ్డు తెప్పించి సాయంత్రానికి ఎలాగో వండి వడ్డించ వలసి వచ్చింది. ఊరుచివర డేరా వేసుకొని అందులో బసచేశాడు. ఊళ్ళోకి వచ్చివుంటే ఆ మాత్రం ఆహారం కూడా దొరికేదికాదు.

కాంగ్రెస్ తరపున ప్రజలకు నచ్చజెప్పి, శాంతింప చేయడం కోసం ఉన్నవ లక్ష్మీనారాయణ గారు, మాడభూషి వేదాంతం లక్ష్మి నరసింహా చార్యులుగారు మాచెర్ల వచ్చారు. కాంగ్రెస్ సహాయనిరాకరణ ఉద్యమం ఇంకా ప్రకటించ లేదు కాబట్టి, ప్రస్తుతానికి ప్రభుత్వానికి పుల్లరి పన్ను చెల్లించి శాంతించమని ఉద్బోధించారు. కానీ కలెక్టర్ 'షీల్డ్' ఈ ఇద్దర్నీ జామీను లేకుండా ఎందుకు శిక్షించకూడదో సమాధానం చెప్పమని కబురు పెట్టాడు. ప్రజలు మరింత రెచ్చిపోయారు.

దండోరా వేయించడానికి డప్పుల వాళ్ళని కబురుపెడితే డప్పులు చిరిగిపోయాయని చెప్పి వాళ్ళు వెళ్లలేదు.

కానీ, ఉన్నవ వారినీ మాడభూషి వారినీ గజ్జెల గుర్రాల మీద ఎక్కించుకొని డప్పులు తప్పెటలతో ఊరంతా ఊరేగించారు.

ఆ ఊరేగింపును చూసి కలెక్టర్ బిగ్గరగానే అన్నాడట... నేను కావాలంటే డప్పులు లేవన్నారు, ఇప్పుడు డప్పులు ఎలా వచ్చాయి..? కొంపదీసి స్వాతంత్ర్యం వచ్చేసిందా

ఏమిటీ... భారతదేశానికి...?" అని! ఒక్కక్షణం ఉలిక్కిపడి, సముదాయించుకొన్నాడట తననితాను.

ఉన్నవ వారినీ మాడభూషి వారినీ అరెస్ట్ చేసి సంవత్సరం శిక్ష విధించారు.

అందుకు నిరసనగా మాచెర్ల మళ్ళీ రెచ్చిపోయింది. వారం రోజులు ఊరంతా 'బంద్'కు పిలుపిచ్చారు. ఈ సారి నిత్యావసర వస్తువులు పాలు-మంచినీళ్ళు మాత్రం మినహాయించారు.

ఒక బందు - దానికి శిక్ష - శిక్షకు నిరసనగా మళ్ళీ బంద్ ...

ఈ బందుకు కారకుడని దేశభక్త కొండ వెంకటప్పయ్య గారిని అరెస్ట్ చేసి కేసుపెట్టారు.

వారం రోజుల బందుని కొనసాగించారు ప్రజలు. ఊరు తెరుచుకోలేదు. "మా నాయకులు విడుదల అయ్యేవరకూ తెరిచే సమస్యేలేదు-" అన్నారు వర్తకులు - ప్రజలంతా!

కలెక్టర్‌గారి ఆఫీసులో వందమంది గుమస్తాలు రాజీనామా లిస్తామని హెచ్చరించారు. అదిరిపోయాడు కలెక్టర్.

కొండ వెంకటప్పయ్య గారిని జైలు నించి రప్పించి విచారణ పేరుతో సూటిగా ఒకటే ప్రశ్న వేశాడు - "మీరు నేరం చేశారా..?" అని

బందుకు పిలుపునిచ్చి దానిని విజయవంతంగా తాను ఎలా నిర్వహించిందీ పూసగుచ్చినట్లు చెప్పాడు వెంకటప్పయ్య గారు.

అంతావిని 'శాంతికి భంగం కలగకుండా వుండేందుకే ఆయన బందు చేయించినట్లు దానిని తాను నమ్మినట్లు రాసుకొని - నాయకులందరినీ విడుదల చేయించాడు కలెక్టర్.

ఈ సంఘటన తెలుసుకొని - 'సహాయ నిరాకరణ ఉద్యమం ప్రారంభం అయినట్టే! ఆంధ్రులే ఈ ఉద్యమాన్ని మొదలుపెట్టారు" అని ప్రశంసిస్తూ గాంధీగారు యంగ్ ఇండియా పత్రికలో "ఆంధ్రుల ఔన్నత్యం" అనే వ్యాసం రాశారు.

"ఆ ప్రాంతంలో అందరూ నిద్రపోతున్న సమయంలో కొండ వెంకటప్పయ్య గారు మేల్కొన్న మనిషి" - అని ప్రశంసించారు గాంధీ.

హరిజనోద్ధరణ, హరిజన దేవాలయ ప్రవేశం, సహాయ నిరాకరణోద్యమం వంటి గాంధీ గారి ఆలోచనలన్నీ గాంధీకన్నా ముందుగానే ఆచరణలో పెట్టి చూపించిన వారు ఆంధ్రులు.

**(దేశభక్త కొండ వెంకటప్పయ్య గారి స్వీయచరిత్ర)**

*మరణ శయ్యపైన*

# ముట్నూరి

1929లో ఖద్దరు పర్యటనలో గాంధీజీ మచిలీపట్నం వచ్చారు. అప్పుడే ముట్నూరి కృష్ణారావు గారిని "ఆధ్యాత్మిక తేజస్వి" అని సంభోదించారు గాంధీజీ.

కృష్ణా ప్రెస్‌ని ఇంకొంచెం అభివృద్ధి చేస్తే, నెలకు నాలుగైదు వందలు అదనపు ఆదాయం వస్తుంది కదా... అని భోగరాజు పట్టాభి సీతారామయ్యగారంటే,'నా కుటుంబ ఖర్చులకు నెలకు 100రూ॥లు చాలు – అంతకంటే ఎక్కువ వస్తే నేనేం చేసుకోవాలి-?' ' అని ప్రశ్నించారట! అది ఆయన మనఃప్రవృత్తి. వారు నడుపుతున్న కృష్ణాపత్రిక ఆ రోజుల్లో స్వాతంత్ర్య పోరాటానికీ, జాతీయ ఉద్యమానికి, సంఘ సంస్కరణలకూ వేదికగా వుండేది.

కృష్ణారావు గారి అంతిమ ఘడియల్లో – ఎలక్ట్రికల్ బెల్ దానంతట అదే మోగడం మొదలు పెట్టింది. దాన్ని ఆపడం ఎలాగో తెలీక మెయిన్ స్విచ్‌ని ఆఫ్ చేశారు. అయినా అది ఆగకుండా మోగుతూనే వుందట.

"అది ఆగదు. నాకు తెలుసు. మీకేమి తెలుస్తుంది! అది యమధర్మరాజు దున్నపోతుగంట! నా కోసమే వస్తోంది-" అన్నారట... మరణశయ్య మీద కూడా సహజసిద్ధమైన వచోధోరణిలో!

"ఏ జన్మలోనో తపస్సు భగ్నమై జన్మించిన మహాత్ములు... తాపసోత్తములు... అయివుంటారు కృష్ణారావుగారు-" అంటారు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య.

**(శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య జీవిత చరిత్ర)**

*రచయితలను ప్రోత్సహించిన*

# ఓ పోటీ ప్రకటన

1896వ సంవత్సరంలో పోటీలకు చారిత్రక రచనలను ఆహ్వానిస్తూ చింతామణి అనే పత్రిక ప్రకటన ఇచ్చింది. ఇది నూరేళ్ళకు పైబడ్డ సంగతి. ఆ ప్రకటన ఇలా వుంది.

"పయి సం॥ (1896) వచన ప్రబంధములను వ్రాయదలంపు గొన్నవారు భూగోళ, హిందూ చరిత్రాంశముల తోడ గూడి యుండునట్లుగా కథను హృద్యముగా కల్పన చేసి వ్రాయవలెను ఈ యంశములు లేని గ్రంథములకు బహుమానము లీయబడవు"

హిందూదేశ చరిత్ర విషయము :- "కేవల చరిత్ర వ్రాయుగూడదు... చరిత్రాంశములును, కాలములును సరియైనవిగా నుండవలెను. చరిత్రలో వచ్చువారు కాక, కల్పిత పురుషులును, స్త్రీలును ఉండవచ్చును..."

గ్రంథములను వ్రాయప్రయత్నించువారు ముందుగా నింగ్లీషు భాషలో నున్న తార, సీత, అక్బర్, చాంద్ బీబీ, టిప్పు సుల్తాన్ మొదలైన హిందూదేశముతో సంబంధించిన ప్రబంధములను స్కాట్, జూల్స్‌వెర్నె మొదలైన వారు రచించిన ప్రబంధములను జదువుట మంచిదని తలంచుచున్నాము"

చింతామణి పత్రికలో వచ్చిన ఈ ప్రకటన ఆ రోజుల్లో అనేక మంది రచయితలకు, కవి పండితులకు ఎంతో ప్రేరణగా నిలిచిందనీ, చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారి వంటి ప్రముఖ రచయితలు అనేక చారిత్రక నవలలను వ్రాయడానికి తోడ్పడిందనీ పరిశోధకుల అభిప్రాయం.

**(మొదలి నాగభూషణ శర్మ - "చిలకమర్తి లక్ష్మీనరసింహము" అనే గ్రంథం)**

### *హనుమాన్ ప్రసాద్ పొద్దార్*

# "ఆత్మ" కథ

హనుమాన్ ప్రసాద్ పొద్దార్ 1892లో అస్సాంలో పుట్టిన దైవభక్తుడు, దేశభక్తుడు! చిన్ననాడు పెనుభూకంపంలో చిక్కుకుని కుటుంబంలో ఎందర్నో కోల్పోయి, శిధిలాలలో ఎక్కడో అడుగున పడివుండి, అందరూ ఆశలు వదులుకొన్న దశలో బతికే వున్నానని లేచి వచ్చిన చిరంజీవి!

1925లో కళ్యాణ్ అనే పత్రికలో శ్రాద్ధకర్మల ఆవశ్యకత గురించి ఆయన ఒక వ్యాసం వ్రాశారు. అది చదివిన ఓ ఆధునిక క్రైస్తవుడు పొద్దార్‌తో పోట్లాడడానికి వచ్చాడు. ఈ ఆధునిక యుగంలో ఛాందసవాదాన్ని ప్రోత్సహిస్తున్నాడని! ఆ వచ్చిన ఆగంతకుణ్ణి శాంతింపచేసి పొద్దార్ తన జీవితంలో జరిగిన ఈ సంఘటన చెప్పాడు-

ఒకరోజు ఆరుబయట ఖాళీ స్థలంలో వంటరిగా కూర్చుని కళ్ళు మూసుకొని మెడిటేషన్ చేసుకొంటుంటే ఒక పార్శీ వ్యక్తి వచ్చి తనతో మాట్లాడాలని కళ్ళు తెరిచే వరకూ వేచిచూస్తున్నాడు.

చాలా సేపటి నుంచి నిలబడి వున్నట్లున్నాడనుకొని, - "వచ్చి తన పక్కన కూర్చో' 'మని ఆహ్వానించారు పొద్దారు.

"అయ్యా! మీ పక్కన కూర్చునే అదృష్టం నాకు లేదు. నేను ఆత్మని - భయపడకండి. నేను మీ సహాయం కోరి వచ్చాను" అన్నాడా వ్యక్తి.

పొద్దార్‌కు ముచ్చెమటలు పోశాయి. గజగజ వణికిపోయాడు.

"తమరికి నేను అపకారం చెయ్యను - శాంతించండి - నాకో చిన్న ఉపకారం చేసిపెట్టండి - "

కొంత కుదుట పడ్డాక, ప్రశాంతంగా చెప్పాడు పార్శీ ఆత్మ -

"మీరు నాతో మాట్లాడలేక పోయివుంటే నేను మీతో మాట్లాడగలిగే వాణ్ణి కాదు" అని

"స్పష్టంగా వ్యక్తి రూపంలో కన్పిస్తున్నావు కదా- మాట్లాడలేకపోవడం ఏముంది- " అడిగాడు పొద్దార్ -

'ఆత్మ'కు తగ్గ స్థాయిలో వున్న వ్యక్తులే ఆత్మ రూపాన్ని చూడగలుగుతారు. మాట్లాడగలుగుతారు. అలాంటి వారికోసం ఆత్మల ప్రపంచానికి చెందిన మేమంతా వెదుకుతాము" వివరించారు పార్శీ ఆత్మ.

నమ్మలేకపోయాడు పొద్దార్. ఎవరో అపరిచితుడికి ఈ విధంగా వేళాకోళం ఆడవలసిన అవసరం ఏముందీ - ??

"అయ్యా నేను ఇటీవలే చనిపోయాను. పార్శీ మతంలో పుట్టినా హిందూ మతాచారాలంటే ఎక్కువ గౌరవిస్తాను. తమరు నాయందు దయయుంచి ఒక వ్యక్తిని గయకు పంపి అక్కడ నా పేరుతో పిండప్రధానం చేయిస్తే నాకు పై లోకాలకు వెళ్ళే అదృష్టం లభిస్తుంది-" అని ప్రాధేయపడుతూ అడిగాడు ఆత్మ రూపంలో వ్యక్తి. ఆశ్చర్యపోయాడు పొద్దార్. "పార్శీ మతస్థులు హిందూ ఆచారాల్ని అంగీకరించరు కదా - శ్రాద్ధ పిండాల అవసరం నీకేమిటీ-?" అనడిగాడు.

దానికి, ఆ పార్శీ ఆత్మ చెప్పిన సమాధానం గొప్పది - "సత్యం అనేది సర్వకాల సర్వావస్థల్లోనూ సత్యమే! అన్ని మతాలకూ అన్ని కులాలకూ అది వర్తిస్తుంది - హిందువులకైనా, పార్శీలకైనా, క్రైస్తవులకైనా అది ఒక్కటే - " అని

ఇలా ఆత్మకీ పొద్దార్‌కీ అనేక విషయాల మీద సంభాషణ జరిగింది.

"నిజంగా నరకం ఉన్నదా?" అనడిగాడు

"వున్నది! నేను చాలా యాతనలు పడ్డానక్కడ" చెప్పింది ఆత్మ!

ఆత్మ కోరినట్లే హరిరామ్ అనే వ్యక్తిని గయకు పంపి ఆ పార్శీ ఆత్మకు పిండ ప్రదానం చేయించాడు పొద్దార్.

పిండం అందుకున్న తర్వాత కృతజ్ఞతలు చెప్పేందుకు మళ్ళీ వచ్చాడు పార్శీ ఆత్మ రూపంలో వ్యక్తి - "మీ పుణ్యమా అని పుణ్య లోకాల్లోకి వెళ్ళే అవకాశం నాకు లభించింది' '. అని ధన్యవాదాలు చెప్పుకొన్నాడు.

ఈ కథనంతా పూసగుచ్చినట్లు ఆ క్రైస్తవ ఆగంతకుడికి వివరించాడు పొద్దార్.

"శ్రాద్ధం తర్పణం అనేవి మరణించిన వారికి పై లోకాలను ప్రాప్తింపచేస్తాయి. వాటిని ఆచరించడం అవసరం-" నొక్కి చెప్పాడాయన. "ఇంతకన్నా ఆత్మశాంతి ఇంకేముంటుంది?" అన్నాడు.

అదివిని.... కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యాడు ఆ క్రైస్తవ ఆగంతకుడు.

పొద్దార్‌ను ప్రాధేయపడ్తూ - "నా కోసం కూడా ఒక వ్యక్తిని గయకు పంపి పిండ ప్రధానం చేయించండి స్వామీ" అడిగాడు - కాదు,... అడిగింది ఆ ఆగంతకుడి ఆత్మ.

"బాబూ! నాకో పిండం దయచేయించండి" అని - ఇతర మతాలకు చెందిన ఆత్మలు ఆక్రోశిస్తున్నట్లనిపించిందాయనకి!

**(డా॥ బ్రజ్‌లాల్ వర్మ - హనుమాన్ ప్రసాద్ పొద్దార్ జీవిత చరిత్ర ఆధారంగా)**

### *నిజాం ప్రధాని లాయకాలీ*

# అతి తెలివి

స్వాతంత్ర్యం వచ్చిన తొట్ట తొలి రోజులు -

భారత్ పాకిస్తాన్ ల విభజన ఫలితంగా 55 కోట్ల రూపాయలు పాకిస్తాన్‌కు ఇవ్వ తేలిందట భారత్... దాన్ని సాధ్యమైనంత తొక్కి పెట్టాలని భారత్ ప్రయత్నిస్తోందని అప్పట్లో విమర్శలొచ్చాయి. గాంధీ, నెహ్రూ ఇందుకు సుముఖంగా వున్నారంటారు.

సరే, అదలా వుంచుదాం... నెహ్రూ ప్రభుత్వం అనేక చారిత్రక కారణాల వలన హైద్రాబాద్ సంస్థానంగా చెప్పుకునే నిజాం రాజ్యంతో కొంత ఉదారంగా వ్యవహరించడం మొదలుపెట్టింది. అవసరం అయితే కొద్దిపాటి స్వాతంత్ర్యం కూడా ఇవడానికి సిద్ధపడిందట!

నిజాం ప్రభువు ఒకవైపు తన అధికారాన్ని నిలుపుకోవడం కోసం భారత్‌తో చర్చల పేరుతో తాత్సారం చేస్తూనే అటు పాకిస్తాన్‌తో రహస్య సంబంధాలు కొనసాగించాడు. అందులో భాగంగా పాకిస్తాన్‌కు 20 కోట్ల రూపాయిల రుణాన్ని చెక్కురూపంలో అందించాడు నిజాం. దాని మీద భారత్‌తో సత్సంబంధాల కోసం కృషిచేస్తున్న నిజాం దౌత్య సిబ్బంది అగ్గిమీద గుగ్గిలం అయ్యారు. భారత ప్రభుత్వం ఈ విషయాన్ని సీరియస్‌గా తీసుకుంది.

దాంతో, అప్పటి నిజాం ప్రధాని లాయకాలీ - పాకిస్తాన్ ప్రధానికి నచ్చచెప్పి చెక్కు మార్చకుండా చూస్తానని హామీ ఇచ్చాడు. ఆత్మహత్యా సదృశమైన ఇలాంటి పనుల వలన హైద్రాబాద్‌కు పాకిస్తాన్ నుంచి ఎలాంటి సహాయం, కనీసం సానుభూతి లభించిందో ఎవరికీ తెలియదు.

పటేల్ పట్టుదలగా హైదరాబాద్ మీద సైనిక చర్య చేపట్టాడు.

నిజాం ప్రభువు చేత ఆటంబాంబు కొన్పించాలనీ, నిజాం మీద భారత సైన్యం చెయ్యి వేస్తే తూర్పు బెంగాల్లోంచి పాకిస్తాన్ సైన్యం భారత్‌లోకి ప్రవేశిస్తుందనీ... లాయకాలీ కన్నకలలు కల్లలైనాయి. ఇంకోవైపు గోవా నుంచి ఫ్రెంచి సైనికులు భారత్ మీద దండయాత్ర చేస్తారని ఊహించాడు లాయకాలీ. అదీ జరగలేదు.

ఇందుకోసం నిజాం చేత కోట్లు ఖర్చు పెట్టించాడు. ఏదీ సఫలంకాలేదు.

హైద్రాబాద్ ప్రధాని లాయకాలీ నిజాంను నిలువునా ముంచి, చివరికి సాధించిన ఘనవిషయం ఏమంటే, అతను - అతని కుటుంబం, అతని మిత్రులూ విజయవంతంగా ఇండియా నుంచి పారిపోగలగడం ఒక్కటే!

తాను భగవంతుడి దూతనని, ఒక పవిత్రమైన కార్యం సాధించడానికి అవతరించాననీ తన గురించి చెప్పుకొనే వాడట లాయకాలి.

కత్తికి కత్తి - ప్రాణానికి ప్రాణం - మచిలీపట్నం రేవులో కత్తిని కడుగుతాను - అంటూ చిందులు తొక్కిన రజాకార్ల అకృత్యాలకు కారకుడైన ఖాసిం రజ్వీ - హైద్రాబాద్‌లోకి భారత్ సైన్యాలు ప్రవేశించగానే మూట-ముల్లె సర్దుకొని విమానాశ్రయానికి వచ్చాడట! అప్పటికే లాయకాలీని ఎక్కించుకొని విమానం గాల్లోకి ఎగిరిపోయింది.

**(సాదత్ ఆలీఖాన్ నలభై యేండ్ల నా అనుభవాలు)**

# కవిత్వంతో నక్కల ఆటకట్టు

అనంత భూపాలుడనే రాజుగారి ఆస్థానంలో నక్కలపాటి సంజీవరాయ కవి వుండేవాడు. ఒకసారి నక్కలు విజృంభించి చెఱకు తోటల్ని నాశనం చేస్తున్నాయని, వాటిని నిరోధించే ఉపాయం చెప్పమని రాజుగారు అడిగారు. ఈ కవిగారు ఓ తాళపత్రం మీద చిన్న పద్యం రాసి - దాన్ని తోట వాకిట కట్టించమని చెప్పాడట. ఆపద్యం ఇది -

క. "ఆశీ విష సమమగు నా
యాశు కవిత్వంబు చేత నటు వంచకముల్
నాశము గావలెఁ జూడుమ
హే!శాంభవి! చౌడమాంబ! హేశర్వాణీ."

ఈ పద్యాన్ని తోట గుమ్మానికి వ్రేలాడకట్టిన దగ్గర్నించి నక్కలు రావడం ఆగిపోయాయట!

ఇలా నక్కలను విజయవంతంగా వాకట్టు కట్టడం వలననే రాజుగారు తనకా "నక్కలపాటి" యింటి పేరు ప్రసాదించినట్లు ఓ ఉత్పలమాలలో కవిగారే స్వయంగా చెప్పుకొన్నాడు -

ఉ.ఎంచగల డనంత వసుధీశుని యిక్షు వనంబు నోళ్ళ ఖం
డించిన నక్కలన్ విష పటిష్ఠపు పద్యముఁజెప్పి వానిని
ర్జించిననింటి పేరుఁ దయచేసిరి నక్కల పాటి వారటం
చు .... ... .... ... .... ..."

అని! ఇప్పుడు కూడా మనం ఇలాంటి ప్రయోగం చేయవచ్చు. కవిత్వం వుందంటే నక్కలేమిటీ - మనుషులు కూడా ఆఛాయలకు రారు!

**(దీపాల పిచ్చయ శాస్త్రిగారి చాటుపద్య రత్నాకరం-)**

## పద్యాన్ని తాకట్టు పెట్టిన
# భారవి

సహసా విదధీత నక్రియా, మవివేకః పరమాపదాం పదమ్ ।
వృణుతే హి విమృశ్య కారణం, గుణలుబ్ధారి స్వయమేవ సంపదాః ॥

"సాహసించి ఏ పనీ చేయకూడదు. అవివేకం అన్ని అనర్థాలనూ తెచ్చిపెడ్తుంది. సంపదలనేవి ఎప్పుడూ కేవలం మంచి గుణాలను మాత్రమే ఇష్టపడతాయి. అందుచేత, చక్కగా ఆలోచించి పనులు చేసేవాడినే సంపదలెప్పుడూ ఆశ్రయిస్తాయి-"

తాను వ్రాస్తున్న కిరాతార్జునీయం కావ్యంలో ఈ పద్యాన్ని రాసి ఆలోచనలో పడ్డాడు భారవి కవి. "భారవేరర్ధ గౌరవమ్" అని మంచి పేరు తెచ్చుకున్న యువకుడు భారవి.

కానీ దేశం అంతా గుర్తించినా తన ప్రతిభని తండ్రి గుర్తించడంలేదని ఆయన తండ్రి మీద అతనికి చాలా కోపంగా వుండేది. నలుగురి ముందు "వాడి మొహం... వాడికేం తెల్సు..." ఇలా అంటాడేమిటీ... నేనంటే ఆయనకు అసూయ... అనుకునే వాడు భారవి.

రోజురోజుకి తన పేరు ప్రఖ్యాతులు పెరుగుతున్న కొద్దీ, తండ్రి తేలికగా తీసి పారేస్తూ మాట్లాడడం కూడ ఎక్కువయ్యింది. పెద్ద బండరాయి పెట్టి ఆయన తలకాయ పగలకొట్టి చంపేయాలన్నంత కోపంగా వుంది భారవికి! కోపందారి కోపానిదే! కథను అనుసరించి ఓ మంచి ప్రబోదాత్మకమైన కవిత్వం రాసిన సంతృప్తి పొందాడు ఈ పద్యంలో భారవి. మరొకసారి తన పద్యాన్ని పైనుంచి కిందిదాకా చదువుకొన్నాడు.

చదువుతున్న కొద్దీ అతనిలో ఆలోచనలు ముసురుకోసాగాయి.

సాహసించి ఏపనులూ చెయ్యకు - మంచి గుణాల్ని ఆశ్రయించుకొన్న సంపదలు వుంటాయి... తన మాటలే అవి... కానీ, తననే వెక్కిరించడం మొదలు పెట్టాయి.

"తండ్రి తనను పొగడడం తనకు ఆయుక్షీణం కదా... ఇలా ఎందుకు ఆలోచిస్తున్నాను...? మందమతిని...!" అని పశ్చాత్తాపపడ్డాడు.

క్షణం ఆగి ఆలోచిస్తే పొరపాటు నిర్ణయాలన్నీ సర్దుకొంటాయని గుర్తించాడు. వెంటనే వెళ్ళి తండ్రి పాదాల మీద పడి తన దుష్ట చింతనకు తగిన ప్రాయశ్చిత్తం చెయ్యమని ప్రార్థించాడు.

తండ్రి నవ్వుతూ ప్రపంచం గుర్తించిన గొప్ప కవివి కావాలని ఆశీర్వదించి "ఒక సంవత్సరం పాటు అత్తవారింట్లో వుండి రా' అని శాసించాడు. అదే అతనికి శిక్ష!

అత్త వారింట్లో 'అల్లుడు' మోజు తీరంగానే భారవికి కష్టాలు ప్రారంభమైనాయి- డబ్బు కావాలని నోము నోచుకోవాలనీ కోరింది భార్య. డబ్బెక్కడిదీ...??

తన కిరాతార్జునీయం లోంచి ఎంతో విలువైన ఈ 'సహసా విధధీత నక్రియా-' పద్యాన్ని ఇవతలకు తీసి భార్యచేతికిచ్చి ఫలానా వర్తకుడి దగ్గర తాకట్టు పెట్టి కావలసిన సామగ్రి తెచ్చుకోమన్నాడు.

ఆ తర్వాత చాలా పరిణామాలు జరిగాయి.

ఈ పద్యాన్ని తాకట్టు పెట్టుకున్న వర్తకుడు ఒకసారి వాణిజ్యం కోసం పరదేశాలకు ఓడ మీద బయల్దేరి వెళ్ళాడు. పెనుగాలలులో చిక్కిన ఓడ సముద్రంలో మునిగిపోయింది. వర్తకుడి జాడ తెలియలేదు.

సంవత్సరం గడువూ పూర్తయి, తన ఇంటికి వెళ్ళిపోయాడు భారవి. అత్తవారింట్లో తాను ఎదుర్కొన్న అవమానాలన్నీ తను కావాలని వేసుకొన్న శిక్షలే కాబట్టి మౌనంగా నవ్వుతూ భరించాడువాటిని.

కిరాతార్జునీయం కావ్యాన్ని పూర్తిచేశాడు కానీ, దాన్ని వెలువరించలేదు.

తాకట్టులోవున్న 'సహసావిదధీత' పద్యాన్ని తిరిగి ఇచ్చే వర్తకుడి ఆచూకీ లేదు. ఆ పద్యం లేకుండా కావ్యాన్ని వెలువరించలేనన్నాడు భారవి. అలా ఆగిపోయింది ఆ కావ్యం.

కథలో ముగింపుగా, వర్తకుడు తిరిగొచ్చాడు.... ఎలాగో ఒడ్డుకు చేరి!

భార్య సాదరంగా వర్తకుణ్ణి ఆహ్వానించి" వీడేనండీ మన అబ్బాయి-" అని 18 ఏళ్ల కుర్రవాణ్ణి భర్తకి పరిచయం చేసింది.

కోపోద్రిక్తుడైనాడు వర్తకుడు. "నేను వెళ్ళినప్పుడు లేని కొడుకు వచ్చేసరికి ఎలా వచ్చాడు?" అని నిప్పులు చెరిగాడు.

నరికేస్తాను - చంపేస్తాను అంటూ చూరులో వున్న ఓ చిన్న వెదురు గొట్టాన్ని చటుక్కున లాగాడు. అందులో భారవి కవి రాసిన తాకట్టు పద్యం భద్రంగా వుంది. అప్రయత్నంగానే వర్తకుడి కళ్ళు దానిపైన పడ్డాయి.

అది తనకు ఎంతో ఇష్టమైన పద్యం. నాలుగు పంక్తులకీ నాలుగు వరహాలిచ్చి పంపాడు ఆ రోజున ఆసంగతి పూర్తిగా జ్ఞాపకం వచ్చింది అతనికి.

"సాహసించి ఏ పనీ చెయ్యకు. మంచి గుణాల్నే సంపదలు ఆశ్రయించి వుంటాయి" అని హితబోధ చేస్తున్న పద్యం వర్తకుణ్ణి శాంతింపజేసింది... అక్షరం అక్షరం చదువుకున్నాడు. అవివేకంతో తొందర పడకుండా దోషం ఏమిటో విచారించాలి... అని నిర్ణయించుకున్నాడు.

ఊరి పెద్దలంతా కలిసి "నీ భార్య పతివ్రత. నువ్వు ఇల్లు వదిలే నాటికే గర్భవతి' ' అని అతనికి వివరంగా తెలియజేశారు.

భార్యనీ పుత్రుణ్ణీ హత్యచేసే పెను తప్పుకు పాల్పడకుండా తనని కాపాడిన భారవి కవికి మనసులోనే మొక్కుకున్నాడు వర్తకుడు.

తమకు రావలసిన సొమ్ము తీసుకొని పద్యాన్ని తాకట్టు విడిపించమని కోరాడు భారవి.

"మహాత్మా! మీ శ్లోకం వలన నా కుటుంబ గౌరవం నిలబడింది. నేను మీ దగ్గర సొమ్ము తీసుకోను. మీరే ఈ బహుమతి తీసుకొని నన్ను కనికరించండి అన్నాడు.

పద్యానికి తాకట్టు విడిపోయిన తర్వాతే కిరాతార్జునీయాన్ని వెలువరించాడు మహాకవి.

భారవేరర్థ గౌరవమ్ - అంటే ఇదే! ఆయన అర్థాన్నే (భావాన్నే) కాదు, అర్థాన్ని (ధనాన్ని) కూడా గౌరవించాడని ఛలోక్తిగా అంటుంటారు!

# విజయవాడ హనుమాన్ పేట కథ

ప్రముఖ వీణావిద్వాంసుడు శ్రీ చిట్టిబాబు అసలు పేరు హనుమాన్లు. అది ఆయన తాతగారైన హనుమాండ్లు గారి పేరు. చిన్నప్పుడు చిట్టిబాబు అని ముద్దుగా పిలుచుకున్న పేరే ఆయనకి శాశ్వతం అయ్యింది.

విజయవాడ గాంధీనగరంలో వున్న ఆంధ్రపత్రిక భవనం చిట్టిబాబు తాతగారు హనుమాన్లుగారి దగ్గరనుంచి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు కొన్నారట.

హనుమాన్లుగారి పేరుతో ఈ భవనం సమీపాన వున్న ప్రాంతాన్ని హనుమాన్లు పేట అనిపిలుస్తున్నారు.

ఒకసారి గవర్నమెంట్ హాస్పిటల్ వెనకనున్న ఈ హనుమాన్లు పేటలో తవ్వకాలు జరిపినప్పుడు ఓ ఆంజనేయస్వామి విగ్రహం దొరికింది.

దాన్ని ప్రతిష్ఠించాలని భద్రపరిచారు. తెల్లవారే సరికి అది మాయమయ్యింది. అంతా స్వామి మాహాత్మ్యం అనుకున్నారు.

అప్పుడు స్వామినాయుడు అనే సబ్ఇన్స్పెక్టర్ ఒక దొంగను పట్టుకొంటే, వాడిదగ్గర ఆ విగ్రహం దొరికిందట!

ఇది 'స్వామి' అనే ఇన్స్పెక్టర్ మాహాత్మ్యం!!

**(లంక వెంకట రమణ - విజయవాడ వీధుల కథలు)**

# ప్రకాశం నిధి

1946 ఎన్నికలకు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ సమాయత్తం అవుతోంది. ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారు ఆంధ్ర ప్రాంతంలో కాంగ్రెస్ నాయకత్వాన్ని చేబట్టి ఎన్నికల ఏర్పాట్లలో తలమునకగా వున్నారు.

ఖర్చుల నిమిత్తం "ప్రకాశం నిధి"ని వసూలు చేసి, ఈ మొత్తాన్ని ఒక ఆయుధంగా ఉపయోగించి ఎన్నికలలో ప్రత్యర్థుల్ని ఎదుర్కోవాలని ఆశించారు. దానిని వినియోగించే అధికారం పూర్తిగా ప్రకాశం గారికే ఇస్తూ ఆవిధిని ఆయనకు అందజేశారు.

ఎన్నికలు జరిగిపోయాయి. కాంగ్రెస్ విజయ దుందుభి మోగించింది. ముఖ్యమంత్రి పదవికి ప్రకాశం గారు రాజాజీతో పోటీ పడ్డాడు. గాంధీగారు బహిరంగంగానే రాజాజీ పక్షం వహించారు. ప్రకాశం గారు లొంగలేదు. ముఖ్యమంత్రి అయ్యారు. ఆంధ్రదేశంలో ప్రకాశం వ్యతిరేకులు నెమ్మదిగా ప్రకాశం నిధి విషయాన్ని పటేల్ గారి చెవిలో వేసి, ఆ నిధికి లెక్కలు చెప్పలేదని, అవి దుర్వినియోగం అయ్యాయనీ ఉప్పందించారు.

విషయాన్ని సర్దార్ పటేల్ గాంధీజీకి నివేదించారు. గాంధీజీ వెంటనే ప్రకాశం గారిని సంజాయిషీ ఇవ్వమని కబురు పెట్టించారు. ప్రకాశం గారు వెన్నెలకంటి రాఘవయ్య గారిని గాంధీజీతో మాట్లాడి విషయం తెలుసుకురమ్మని పంపించారు. ఇదీ కథ!

నెల్లూరుకు చెందిన వెన్నెలకంటి రాఘవయ్య గారు ఎరుకలు, యానాది, ఆదివాసి ప్రజలకోసం జీవితాంతం పోరాడిన యోధుడు. జాతీయస్థాయి గుర్తింపు గల్గిన నేత.

రాఘవయ్య గారు గాంధీజీ వద్దకు వెళ్ళారు. మహాత్ముడు ఆ సమయంలో పాత ఢిల్లీలోని ఓ హరిజన వాడలో ఓ పూరింట విడిది చేసి వున్నాడు. ఆ రోజున ఆయనకు మౌనవ్రతం. ఆ ఇంటి వసారాలో గాంధీగారి కార్యదర్శి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ కూర్చుని వున్నారు. రాఘవయ్యగారు గాంధీగారి సమక్షంలోనే ఆమెతో గట్టిగా మాట్లాడారు

"అసలు మీరెవరు... మమ్మల్ని లెక్కలు అడగడానికి? ఆ డబ్బుని ప్రకాశం గారికి ఇచ్చింది మేము. ఇష్టం వచ్చినట్లు ఖర్చు చేసుకోమని అధికారం ఇచ్చింది కూడా మేమే! అఖిల భారత కాంగ్రెస్ కమిటీకి గాని, కమిటీ తరఫున ప్రకాశం గారికి గానీ ఈ మొత్తాన్ని మేము ఇవ్వలేదు. కోట్ల రూపాయల ఆస్తిని దేశం కోసం ధారపోసిన ప్రకాశం గారికి ఈ 50వేల రూపాయల నిధి నామమాత్రం.

దేశబంధు చిత్తరంజన్ దాస్ గారు ఆయన భార్య స్మారకార్థం కట్టిన ఆసుపత్రికి ఐదు లక్షల రూపాయిలు పోగుచేశారు. ఆ లెక్కలు ఎవరికైనా ఎప్పుడైనా చెప్పారా?

జవహర్‌లాల్ నెహ్రూగారు తన భార్య కమలా నెహ్రూ స్మారకార్థం ఆసుపత్రి నిర్మాణానికి పదిలక్షలు పోగుచేశారు. వాటి లెక్కలెక్కడున్నాయండీ...?

మహాత్మాజీ నివశిస్తున్న సేవాగ్రాం శ్రీ జమునాలాల్ బజాజ్‌ది. మహాత్ముడు అక్కడ చేరినప్పటి నుంచీ రోజూ వేలాదిరూపాయిలు అవుతున్న ఖర్చుని బజాజ్ గారే భరిస్తున్నారు... మేకపాలు, జీడిపప్పు మహాత్ముడి కోసం ఆయన అనుచరగణం, సిబ్బంది, శిష్య బృందం మొత్తానికి రోజుకి ఎంత ఖర్చు అవుతోంది...? వాటిని ఏ నిధి కింద జమకడతారు?

ఇవన్నీ బహిరంగంగా దేశ ప్రజలకు లెక్క చెప్పండి... ప్రకాశం నిధి లెక్కలు ప్రకాశం గారు కూడా చెప్తారు...? ఆవేశంగా మాట్లాడి లేచి వచ్చేశారు రాఘవయ్య గారు.

మౌనంలోనే వున్న మహాత్ముడు ఆ తర్వాత మళ్ళీ ఆ విషయం గురించి మాట్లాడలేదు.

**(వెన్నెల వెలుగులు - పద్మభూషణ్ వెన్నెలకంటి రాఘవయ్య గారి జీవిత చరిత్ర)**

# నిగమ శర్మ అక్క

తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యం కావ్యంలో కలాన్ని అమృతంలో ముంచి దిద్ది తీర్చిన చల్లనితల్లి నిగమశర్మ అక్క! ఏ కారణం చేతనో ఆమెని 'నిగమశర్మ అక్క' అనే అన్నాడుగానీ, ఆమెకు పేరు పెట్టలేదు.

ఈమె తండ్రి సభాపతి. "వేదాలు నిండిన గాదె". శాస్త్రాలకు పుట్టిల్లు ఆయన! అలాంటి కుటుంబంలో పుట్టాడు నిగమశర్మ. తను ఎత్తుకొని ముద్దాడి పెంచి పెద్దచేసిన తమ్ముడు నిగమశర్మ చెడు అలవాట్లకు బానిసయ్యాడని, భార్యనీ పిల్లల్ని వదిలి తిరుగుతున్నాడనీ తెలిసి తమ్ముణ్ణి మందలించి, వాడి సంసారం చక్కబెడదామని ఆత్రంగా పుట్టింటికి వచ్చింది. తమ్ముణ్ణి మందలించింది. మంచి మాటలతో హితబోధ చేసింది. నా కన్నవుగదా... మంచిబాబువికదా.. అని బుజ్జగించింది.

నిగమశర్మ మారినట్టే కన్పించాడు. అక్కగారి మంచిమాటలు విని నాలుగురోజులు ఇంట్లోనే వున్నాడు. భార్యతో సుఖించాడు. అందరూ సంతోషించారు.

ఒకరాత్రి చేతికి దొరికిన సొమ్ము మొత్తం మూట గట్టుకొని గోడదూకి ఉడాయించాడు. మళ్ళీ మామూలే! యథావిధిగా అందరూ ఏడ్చారు.

"కొత్తగా చేయించుకున్న నా ముక్కెర కూడా ఎత్తుకు పోయాడమ్మా... తమ్ముడూ-" అని నిగమశర్మ అక్క కూడా ఏడ్చింది -

**(రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారి సారస్వతాలోకం)**

# కవి కలహాలు

ఎంతటి సామాన్య మానవుడైనా కడుపు మండితే బూతుల పంచాంగం విప్పి తిట్ల దండకం మొదలుపెడతాడు.

ఇంక మహాకవులైన వారెంత...?

తిట్టడానికి ఎవరూ అతీతులు కారని నిరూపించుకున్నారు... ఆధునిక కవులలో... తిరుపతి వేంకట కవులు, కొప్పరపు కవులు, శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి గారు, వేంకట రామకృష్ణ కవులు, విశ్వనాథ సత్యనారాయణ గారు... వీరిలో కొందరు గురువులు - కొందరు శిష్యులు, కొందరు మిత్రులు -

ఒకరి నొకరు మించిన వారనే భావం - వీళ్ళ మధ్య ఎప్పుడూ ఏదోక జగడానికి కారణం అయ్యేది. ఆ విశేషాలన్నీ చదువుకోడానికి సరదాగా వుంటాయి.

తిరుపతి వేంకట కవులు "గీరతము" అనే పేరుతో ఓ తిట్టు కావ్యాన్ని రచించారు.

"గీః" అంటే వాక్కు "గీః + రతాః" అంటే మాట్లాడడంలోనే ఇష్టం వున్నవాణ్ణి - వాచాలుణ్ణీ, వదరుబోతునీ ఉద్దేశించిన గ్రంథం కాబట్టి 'గీరతం' అని పేరుపెట్టారు దానికి.

ఈ కావ్యాన్ని కేవలం వేంకట రామకృష్ణ కవుల్ని తిట్టడం కోసం ఉద్దేశించి రాశారు.

పిఠాపురం సంస్థాన కవులు ఓలేటి వేంకట రామశాస్త్రి, వేదుల రామకృష్ణ శాస్త్రి ఈ ఇద్దరూ 'వేంకట రామకృష్ణ కవులు' అనే పేరుతో తిరుపతి వేంకట కవులకు సమానంగా అవధానాలు వంటివి నిర్వహిస్తూ వుండేవారు.

నిజానికి వేంకట రామకృష్ణ కవులు తిరుపతి కవుల వద్ద కొంతకాలం శిష్యరికం చేసి కవిత్వం అభ్యసించారట! ఆ తర్వాత తమ పాండిత్యంతో మంచి పేరు తెచ్చుకున్నాక తిరుపతి కవుల్ని గురువులుగా చెప్పుకోవడం మానేశారట! ఇద్దరి వైరానికీ కారణం అది.

ఒకరి కవిత్వంలో ఒకరు తప్పులు పట్టుకొంటూ ఖండన మండనాలు చేసుకొంటూ పోట్లాటలు పెంచుకునేవారు. ఇదంతా 19వ శతాబ్దపు తొలినాటి కథ!

ఉ॥ చుక్కలు రాలలేదు రవి సోముల్ల పోకడ మాఱలేదు న
ల్దిక్కులు కూలలేదు జలధి జ్వలనం బుబుకంగ లేదు నేఁ
డక్కట! రామకృష్ణ కవులర్భకు లేగతి సేయనేర్తు రా
ధిక్కృతవైరి వేంకట సుధీకవిమౌళికి శృంగ భంగమున్?"

"చుక్కలు రాల్చేస్తామన్నారు, సూర్యచంద్రుల తీరు మార్చేస్తామన్నారు. నాలుగు దిక్కులూ కూల్చేస్తామన్నారు. బడబాగ్ని ఉబికిస్తామన్నారు... ఏదీ... ఏమీ చెయ్యలేక పోయారు -

ఈ రామకృష్ణ కవులు అర్భకులు ... తిరుపతి వేంకట కవులకు శృంగభంగం చెయ్యగలరా...' ' అంటూ వాళ్ళని రెచ్చగొట్టేవారు తిరుపతి వేంకట కవులు.

గిరతానికి వ్యతిరేకంగా "రామకృష్ణ మహాభారతము" అనే గ్రంథాన్ని రాశారు వేంకట రామకృష్ణ కవులు.

"పరులయున్న తిఁగని దుఃఖపడెడి వారు,
దోష రహితుల cబూజ్యుల దూఱువారు
నాత్మ దోషమ్ముc బరులపై నలము వారుc
బరిహసింపంగc బడుదు రీ భారతమున"

ఇతరుల గొప్పతనాన్ని చూసి ఏడ్చేవారూ, మంచివాళ్ళని పట్టుకొని వూరికే తిట్టి పోసేవారూ, తన తప్పుల్ని ఇతరుల మీద రుద్దేవారూ ఈ 'భారతం'లో పరిహసింపబడతారట!

"తన కంటె నిలాతలమున
ఘనులెవ్వరు లేరటంచు గర్వమ్మున మ
న్నును మిన్నును గానకుండెడు,
మనుజుcడు దెలియంగ లేcడు మా భారతమున్

ఈ నేల మీద తన కంటే గొప్పవాడు ఎవడూ లేడు - లేడనుకొంటూ, గర్వంతో కన్ను మిన్ను కానకుండా వుండే మనుషులు మా భారతం మహిమని తెలుసుకోలేరు - అని ఎద్దేవా చేశారు.

ఈ తిట్లన్నీ తిరుపతి వేంకట కవుల్ని ఉద్దేశించినవే!

రాజ్యకాంక్షతో సాగించిన సమరాన్ని ఆనాటి మహాభారతం వర్ణిస్తే ఈనాటి రామకృష్ణ మహాభారతం కీర్తి కాంక్షతో తెచ్చిపెట్టుకొన్న వైరాలు, కలహాలు సాహితీ సమరాలను సూచిస్తుంది.

ఈ వైరం ఇలావుంటే తిరుపతి వేంకట కవులకు కొప్పరపు కవులకూ రకరకాల కలహాలు జరిగినాయి. ఈ కవుల మధ్య చాలాకాలం వైదీకి, నియోగి పేరుతో కూడ యుద్ధాలు జరిగి కృష్ణా గుంటూరు జిల్లాలో 1920 నాటికి బ్రాహ్మణులు వైదీకులుగానూ, నియోగులు గానూ విడిపోయి ఒకరి మీద ఒకరు మాటల కత్తులు నూరుకునే పరిస్థితి ఉత్పన్నమైంది.

తిరుపతి వేంకట కవులు బందరులోనూ, కొప్పరపు కవులు గుంటూరులోనూ వుండేవారు.

ఒకసారి తిరుపతి కవులే గుంటూరు వచ్చి అవధానం చేసి ప్రత్యర్థి కవుల మెప్పు పొందారు.

"కొ[ప్రంపు వారు మాకుఁ గనిష్ఠు లవ్వారి కరియఁగా జ్యేష్ఠుల మగుదుమేము
కొ[ప్రంపు వారు మాకు సుశిష్యుల వ్వారి కరియఁగా నొజ్జల మగుదు మేము
తత్కవిత్వంబు సదరు మరాటా రైలు మదరాసు రైలయ్యు మాదు కైత
మిత్రుల నవ్వారు మెప్పింతు రేము శత్రులఁగూడ మెప్పింపఁగల మొకింత-"
అని గుంటూరు నించి వెళ్ళేప్పుడు పద్యం చెప్పారు -

"కొప్పరపు కవులు మా కన్నా చిన్నవాళ్ళు. వాళ్ళకన్నా మేము పెద్దవాళ్ళం. వాళ్ళు మాకు సుశిష్యులు. అలాంటి శిష్యులున్నారని సంతోషిస్తాం మేం ఎప్పుడూ! వాళ్ళ కవిత్వం మరాటా రైలు (బొంబాయి వెళ్ళే రైలుబండి) మా కవిత్వం మద్రాసు వెళ్ళే రైలుబండి వాళ్ళు మిత్రులైన వాళ్ళనే మెప్పించగలుగుతారు. మేం ఒకింత శత్రువులైన వాళ్ళని కూడా మెప్పించగలం-" అని!

"వయసుకా? పెద్దలము మేము వారి పిన్న
లింతియే భేద మింతకు నింత కలహ
మెందులకు స్నేహితుల మైతి మింక మారు
శంక దక్కుండు సెలవు నొసఁగుడు మాకు"
అంటూ పైన చెప్పిన సీసపద్యాన్ని ముగించారు తిరుపతి కవులు.

ఈ తిరుపతి కవులలో ఒకరైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు వ్రాసిన ఒక కావ్యంలో రెండువేల తప్పులున్నాయని శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు ఒకసారి విమర్శించారట!

వీళ్ళలో శ్రీపాద వారు గురువు, చెళ్ళపిళ్ళవారు శిష్యులు. శిష్యుడి కవిత్వంలో గురువు తప్పులు పట్టారు. గురువుగారు అసూయతోనే విమర్శించారని పండిత లోకం అనుకోవడం మొదలుపెట్టింది.

తననేమన్నా ఒప్పుకుంటానుగానీ, తన కుల విద్య కవిత్వాన్ని ఏమన్నా ఆక్షేపిస్తే సహించననీ, శ్రీపాద వారు చూపించినవి దోషాలే కావనీ చెళ్ళపిళ్ళవారు గురువు గారిని ధిక్కరించారు.

ఇద్దరి వాదననీ విని తీర్పు చెప్పమని జయంతి రామయ్య పంతులు గారి దగ్గరకు వెళ్ళారట! జయంతి రామయ్య పంతులు గారు విద్వాంసులు, రచయిత, ప్రాచీన తెలుగు శాసనాలను పరిష్కరించిన వ్యక్తి. భాషోద్ధారకులు. సూర్యరాయాంధ్ర నిఘంటువును రూపొందించిన ప్రముఖులు. కళాప్రపూర్ణ. వారు ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ -రాష్ట్ర న్యాయాధికారి పదవిని నిర్వహించారు. అలాంటి వ్యక్తిని తీర్పు అడిగారిద్దరూ!

"గురువును పూజిస్తారు గానీ, అవమానాన్ని సహిస్తారా?" తిట్టులే గాలికి పోతాయి. ఒట్టాలూ అంతే! "ఛీ" కొట్టులు నేను పట్టించుకోను. నాకు మంచి పేరు తెచ్చిపెట్టిన ఈ కవితా విద్యలో లేని చప్పట్టులు కొట్టే మాత్రం గురువైనా సరే సహించను - పైలోకం ఏమైనా సరే!" ఇలా తన ఆక్రోశాన్ని వెళ్ళగక్కారు చెళ్ళపిళ్ళ.

చివరికి తీర్పు చెళ్ళపిళ్ళ వారికే అనుకూలంగా వెళ్ళినట్లుంది - అందుకే ఈ కావ్యాన్ని జయంతి రామయ్య పంతులుగారికి అంకితం ఇచ్చి ఆ కావ్యానికి "జయంతి" అని పేరు పెట్టారు చెళ్ళపిళ్ళ!

శ్రీ పాదవారు ఇంకొకసారి చాలా ఘాటుగా విశ్వనాథ సత్యనారాయణ గారి కవిత్వాన్ని విమర్శించారు. శ్రీ పాదవారు ఈ సందర్భంలో తిట్టిన తిట్లు విశ్వనాథ వారిని బాగా బాధించాయి. కోర్టు కెక్కుతానన్నాడట విశ్వనాథ.

విశ్వనాథ వారి గురువు చెళ్ళపిళ్ళవారు. చెళ్ళపిళ్ళవారి గురువు శ్రీపాదవారు.

తన శిష్యుడుకీ, తన గురువుకీ మధ్య వివాదం ఇది : విచిత్రమైన పరిస్థితి.

"కోర్టు కవి వాదములు తీర్చుకొఱకు ౘబుట్టలేదు
సివిలో క్రిమినలో మీకున్ గవితా సామ్రాజ్య
మిచ్చుౘగా కది జయమే! కవులీవలెౘ
గైకోవలె–" అని మందలించి తన శిష్యుణ్ణే ఆపుచేశారు చెళ్ళపిళ్ళవారు.

కవి వివాదాలు అర్థం చేసుకోగలిగితే చాలా ఆనంద దాయకంగా వుంటాయి.

"శ్రవణానందం" అనే కావ్యాన్ని విమర్శిస్తూ "గులిమి తెడ్డీయం" అనే ప్రతికావ్యాన్ని రాసి ప్రచురించారట!

ఈరోజుల్లో ఇలాంటి వినోదాలు ప్రజలకు ఏవి చెప్పండీ!!

# ఔరంగజేబ్ లేఖ

కొమర్రాజు లక్ష్మణరావు గారు చిత్రించిన ఔరంగజేబు వ్యక్తిత్వానికి ఈ కథ ఒక మచ్చుతునక -

ఔరంగజేబుకు చిన్నప్పుడు చదువు నేర్పిన గురువు ముల్లా సాలే. తన శిష్యుడు చక్రవర్తి అయిన తర్వాత తనకో మంచి ఉద్యోగం ఇప్పించమని అడగడానికి రాజసభకి వెళ్ళాడు. ఔరంగజేబు ఏమాత్రం సంకోచించకుండా వెంటనే "కుదరదు" అని మొహానే చెప్పి పంపించేశాడు.

ఆ తర్వాత తన గురువుని తాను ఎందుకు తిరస్కరించాడో వివరిస్తూ ఔరంగజేబు స్వదస్తూరీతో ఒక ఉత్తరం రాశాడు ఆయనకు -

ఆ ఉత్తరంలో సారాంశం ఇది.

1) మీరు చిన్నప్పుడు నాకు అరబ్బీ భాషని నేర్పించారు. నిజానికి అదంతా నా దృష్టిలో వృధా.

2) ఇలా విదేశీ భాషని నేర్చుకోవడంలో నా విలువైన కాలాన్ని వృధా చేసుకోవడం వలన నా ఆలోచనా శక్తి నా నైపుణ్యం ఇవన్నీ చాలాకాలం మరగున పడిపోయాయి.

3) ఆ చిన్నవయసులో ఎంతో సున్నితమైన జ్ఞాపకశక్తి ఆలోచనాశక్తి ఇలాంటివి అరబ్బీ భాష నేర్చుకోవడం వంటి వృధాప్రయాస వలన నిర్లక్ష్యం అయ్యాయి.

4) భవిష్యత్తులో చక్రవర్తికాగల ఒక రాజకుమారుడికి, 12 సంవత్సరాలపాటు జీవితానికి ఏమాత్రం ఉపయోగించని ఒక భాషని నేర్పించడం వలన కల్గిన ప్రయోజనం ఏమిటి?

5) శత్రువుల్ని చెండాడవలసిన బాధ్యతని చేపట్టే రాజకుమారుడికి వ్యాకరణం, భాషలో మాధుర్యం, కవిత్వం ఇలాంటివా నేర్పవలసింది...? ఈ విధంగా నేను ఒక గొప్ప యోధుడిగా ఎదగవలసిన అతిముఖ్యమైన వయసులో నన్ను చేతకానివాణ్ణి చేసి కూర్చోబెట్టారు.

6) కనీసం ఏదేశం ఎక్కడుంటుందో చెప్పారా? పోర్చుగల్, హాలెండ్, ఇంగ్లండ్ ఇవి కనీసం ఏ ప్రాంతాల్లో వున్నాయో తెలియజేశారా? అవి దీవులో, ద్వీపాలో, పీఠభూములో అయినా చెప్పారా?

7) చైనా, పర్షియా, తార్తార్ ప్రభువుల గొప్పతనాన్ని అందమైన కవిత్వంలో వర్ణించి వల్లె వేయించారే గానీ భారత భావి చక్రవర్తి పేరు చెబితే ఒక్కొక్కరూ గజగజా వణికేలా నన్ను ఎలా తీర్చిదిద్దాలో కనీసం ప్రయత్నం చేశారా?

8) ఈ విశాల ప్రపంచంలో ఏఏ దేశాలున్నాయి...? అక్కడి ప్రజలు కనీసం ఎలాంటి వారు... వారి ఆచార వ్యవహారాలెలాంటివి....? అక్కడి ప్రభుత్వాలు ఎలా నడుస్తున్నాయి...? వారి మతపరమైన విశ్వాసాలు ఎలా వుంటాయి...? ఇవన్నీ ప్రపంచాన్ని జయించాలనుకునే వాడికి అత్యవసరమైన విషయాలు.. వీటిలో ఏ ఒక్కటైనా నాకు ఆనాడు నేర్పించారా?

9) ప్రపంచ జాతులు ఏ విధంగా జీవిస్తున్నాయి...? ఏ జాతి ఏ విధంగా తన దేశాన్ని నిర్మించుకుంటోంది-? తమదైన సంస్కృతిని ఎవరు ఎలా రూపొందించుకుంటున్నారు. ఎక్కడ ఏ రాజ్యం ఎందుకు కూలిపోయింది? ఏ ప్రభువు ఎందుకు పరాజితుడైనాడు? - వంటి విషయాలు కనీసం ఒక్కసారైనా చెప్పేందుకు ప్రయత్నించారా? సామ్రాజ్యాధిపతి కావలసిన వాడికి చెప్పవలసిన సమాచారం ఇదే కదా! ఇది చిన్నప్పుడు ఆలోచనలు వికసిస్తున్న సమయంలోనే బుర్రలో నాటవలసిన అంశాలు. యువరాజుకు అనుక్షణం నూరిపోయవలసిన ఈ ముఖ్యమైన సమాచారాన్ని ఎప్పుడయినా కనీసం మీరు స్పృశించారా?

10) నీతినీ, నిజాయితీని మీరు నాకు బోధించిన మాట వాస్తవం కానీ, దాన్ని ఒక విదేశీ అరబీ భాషలో ఎందుకు బోధించినట్లు... నా మాతృభాషలో నాకు అర్థం అయ్యేలా ఎందుకు చెప్పలేకపోయారు?

11) ఆ రోజున మా తండ్రి షాజహాన్ చక్రవర్తికి మీరు సమస్త విషయాలూ నాకు బోధిస్తానని వాగ్దానం చేశారు. చివరికి ఆత్మ గురించి పరమాత్మ గురించీ స్వర్గలోకాలు గురించి బోధించారు. ఇదంతా నేను శత్రురాజుల్ని చెండాడి గొప్పపాలకుడిగా నా ప్రజల్ని పాలించడానికి ఏవిధంగా నాకు ఉపయోగిస్తుంది?

12) యుద్ధ రంగంలో నేను కత్తి పట్టి నుంచున్నప్పుడు మాయావాదమూ శూన్యవాదమూ నాకే విధంగా తోడ్పడతాయని మీరు ఆశించారు...?

13) నన్ను ఓ మూర్ఖుడిగా తీర్చిదిద్దడానికి మీరు నాకోసం 12 సంవత్సరాలు శ్రమపడ్డారు. ఈ విషయంలో మిమ్మల్ని మించిన వారు లేరని మీరు గర్వించేవారు కూడా!

14) అబద్ధాలతోనూ, అతిశయోక్తులతోనూ నిండిన అంశాల్ని పాఠ్యాంశాలుగా బోధిస్తూ, చక్రవర్తుల వారిపట్ల అమితమైన వినయ విధేయతల్ని భయభక్తుల్ని ప్రదర్శించారే తప్ప మీ వలన మీ విద్యార్థిగా నేను పొందిన లాభం ఏమీ లేదు.

15) ఇప్పుడు మీరు నా ఆస్థానంలో సర్దార్ పదవి కావాలని కోరారు. ఆ పదవిని అలంకరించడానికి మీలో ఏ అంశం అర్హమైనది వుందని దాన్ని మీకిమ్మంటారు? నాకు శాస్త్రీయమైన సైనిక వ్యవస్థ నిర్మాణ నిర్వహణల గురించి మీరు నేర్పించారని... ఆ అర్హత మీకుందనుకోనా? అలెగ్జాండర్‌కు అరిస్టాటిల్‌లా మీరు అనుక్షణం నన్ను వెన్నంటివుండి - నన్నో పరిపూర్ణమైన వ్యక్తిగా, యోధుడిగా ప్రపంచ విజేతగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించారని... 'సర్దార్' లాంటి విలువైన పదవిని మీకు అప్పగించమంటారా?

16) మీమీద నాకు గౌరవం కలగలేదు. దయచేసి మీ గ్రామానికి మీరు వెళ్ళిపోండి. భగవధ్యాన్నంలో కాలం గడపండి. మళ్ళీ ఎప్పుడూ నా సన్నిధికి రావాలని ప్రయత్నించకండి. వచ్చి నా గురువునని చెప్పి లాభం పొందాలని చూడకండి.

ఇదీ ఔరంగజేబు రాసిన ఉత్తరం. బహుశా ఏ గురువూ చరిత్రలో ఇంత దారుణమైన మాట పడివుండడు. కానీ. పాఠ్యాంశాల నిర్ణయాల విషయాల్లోనూ, బోధనా విధానం విషయంలోనూ మన విద్యారంగ నిర్ణేతలు కూడా ఔరంగజేబ్ సూచించిన అంశాలను దృష్టిలో పెట్టుకోపోతే భవిష్యత్తరం ఔరంగజేబులానే ప్రశ్నిస్తుంది.

మాతృభాషలోనే విద్యాబోధన సాగాలనేది ఔరంగజేబ్ డిమాండ్! సామాజిక చారిత్రక అంశాల్ని, నైతిక విలువల్ని మానవతా విలువల్నీ, వృత్తిపరమైన అంశాల్ని, వాటిలో నైపుణ్యాల్ని బోధించే సమగ్ర విద్యా విధానం వున్నప్పుడే ఏ ప్రభుత్వం అయినా తమ పిల్లలకు నిజమైన న్యాయం చేసినట్లు!

**(జి. కృష్ణ - కొమర్రాజు వెంకట లక్ష్మణరావు అనే చిన్న పుస్తకం)**

# షేక్స్పియర్ వీలునామా

1616వ సంవత్సరం జనవరి 25వ తేదీ ఆంగ్ల సాహితీ రంగాన్ని తన అపారమైన కల్పనా చమత్కృతితో పరిపుష్టం చేసిన విలియం షేక్స్పియర్ సాలోచనగా ఆయన గదిలో కూర్చుని వున్నాడు.

అది ఆయనకు 52వ సంవత్సరం.

వయసు పెద్దది కాకపోయినా మనిషి కొద్దిగా నీరసంగా వున్నాడు.

కాలం ఒకలా వుండదుకదా... తన స్థిర చరాస్తుల గురించి వీలునామా వ్రాయడం మంచిదనే ఆలోచన వచ్చింది ఆయనకి. ఆలోచన వచ్చిందే తడవుగా తన స్నేహితుడు 'ఫ్రాన్సిస్ కోవిన్స్' అనే సొలిసిటర్‌ని రమ్మని కబురంపాడు.

తన ఆస్తి వివరాలన్ని చెప్పి పంపకం వగైరాల గురించి పూర్తి సమాచారం అందించాడు.

ఆ రోజున సొలిసిటర్ రాకకోసం ఎదురుచూస్తున్నాడు షేక్స్పియర్. సొలిసిటర్ ఇంకా రాలేదు.

తన కుటుంబంలో సంగతులన్నీ ఆయన కళ్ళముందు ముసురుకొంటున్నాయి.

కుమార్తె "జుడిత్" చేసిన పని ఆయనను మరింత బాధించింది... 32 సంవత్సరాల తన కుమార్తె 28ఏళ్ళ రిచర్డ్ క్వినీని పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించింది.

రిచర్డ్ తన స్నేహితుడి కొడుకే!

ఈ పెళ్ళికి తల్లిదండ్రులు అభ్యంతరాల సంగతి అలా వుంచితే, ఆనాటి చర్చి నియమాలు ఏ మాత్రం అంగీకరించని పరిస్థితి.

ఒకవేళ ఇలాంటి వ్యత్యస్త వివాహం తప్పనిసరి అయ్యేట్లయితే కాబోయే దంపతులు అందుకోసం ప్రభుత్వం నుంచి లైసెన్స్ తీసుకోవాల్సి వుంటుంది. అది షుమారు నాలుగువందల ఏళ్ళనాటి బ్రిటన్‌లో నియమం.

కూతురూ అల్లుడూ ఈ నియమాన్ని ఉల్లంఘించి స్వయంగా పెళ్ళిచేసుకొని కాపురం పెట్టారు.

మహారచయిత షేక్స్పియర్ ఏమీ మాట్లాడలేకపోయాడు. పెద్దాయన, పేరు ప్రఖ్యాతులున్నాయని - పోనీ లెమ్మని చూడకుండా, చర్చివారు షేక్స్పియర్‌కి నోటీసు

పంపారు లైసెన్స్ లేకుండా కూతురు వివాహం జరిపించి చట్టాన్ని ఉల్లంఘించిన నేరాన్ని ఆపాదిస్తూ.

కొత్త దంపతులు బాగానే కాపురం చేసుకొంటున్నారు. షేక్స్పియర్ మాత్రం వర్సెస్టర్‌లో బిషప్‌గారి కోర్టులో బోనులో చేతులు కట్టుకొని నిలబడి వున్నాడు.

అది ఆయన మనోవేదనకు ముఖ్య కారణం. వేదనలోంచి బైటపడేందుకు తాగుడు అలవాటు చేసుకొన్నాడు విపరీతంగా తాగుతున్నాడని స్నేహితులు గోల పెడ్తున్నారు.

ఆయన కుమార్తె చేసిన పనిని ఎవరూ తప్పు పట్టడంలేదు. ఆఖరికి షేక్స్పియర్ కూడా తప్పుపట్టలేక పోయాడు. ఎందుకంటే, షేక్స్పియర్ భార్య అతని కన్నా కనీసం ఎనిమిదేళ్ళు పెద్దది.

షేక్స్పియర్ నడివయసులోకి వచ్చేసరికి అతని భార్య అరవై ఏళ్ళ ప్రాయంలోకి వెళ్ళిపోయింది. ఇప్పుడామె సేవలు చేసే స్థితిలో లేదు - చేయించుకోవాల్సిన పరిస్థితిలో వుంది. ఆయన కదే దుఃఖకారణం.

మార్చి నెల వచ్చేసరికి ఈ మహా రచయిత ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. దిగులు కొంత - తాగుడు కొంత - ఆయన ఇంటి చుట్టూ దుర్గంధ భూయిష్టమైన వాతావరణం మరికొంత ఆయన ఆరోగ్యాన్ని పూర్తిగా దెబ్బతీశాయి.

ఎప్పుడైతే మనిషి బలహీనపడ్డాడో, ఇంటిచుట్టూ పందులు దొర్లే బురద గుంటలు వగైరా కల్పించిన అనారోగ్యకర వాతావరణం మరింతగా ఆయనని రోగాలపాలు చేసిందని షేక్స్పియర్ జీవిత చరిత్రకారులు రాశారు.

మార్చి 25వ తేదీ

మొదట తను రాయించిన విల్లులో చిన్న మార్పులు రెండు చేయించాడు షేక్స్పియర్

తన కిష్టమైన తన పందిరి మంచం, తన చెక్క కుర్చీలు వగైరా సామాగ్రి తన భార్యపేరుకు మార్పించాడు. అంతకు మునుపు ఆమె ఊసే ఈ వీలునామాలో ఎత్తలేదు. ఆయన భార్య కూడా దాని గురించి ఏమీ పట్టించుకోలేదు. ఎందుకంటే ఆమె కూడా ఆయన కన్నా ముందే మంచం పట్టింది కాబట్టి!

ఏప్రిల్ 23, 1616న షేక్స్పియర్ అంతిమశ్వాస విడిచాడు.

కల్పనా సామ్రాజ్యపు తొలి చక్రవర్తి సాహితీ జగత్తులోంచి నిష్క్రమించాడు.

**(యం.వి. కామత్ - ది ఫిలాసఫ్ ఆఫ్ లైఫ్ అండ్ డెత్)**

# కొడవటిగంటి క్షమాపణలు

1952 జూన్ 8న విజయవాడలో విజయా వారి పెళ్ళి చేసి చూడు శతదినోత్సవ వేడుకల సభ కోసం ముందురోజు రాత్రి ఆ సినిమా నటీనటులు కలకత్తా మెయిల్లో విజయవాడకి వస్తున్నారు. నట వర్గంతో కలిసి ప్రసిద్ధ విమర్శకుడు కొడవటి గంటి కుటుంబరావు గారు కూడా ప్రయాణించారు. ఆ వివరాలన్నీ "పెళ్ళి చేసి చూడు" శతదినోత్సవం పేరుతో 'కినిమా' అనే మాసపత్రిక డిసెంబర్ సంచికలో ఒక వ్యాసంగా రాసారాయన.

సంక్షిప్తంగా వ్యాసంలో వివరాలివి :

మా కంపార్ట్‌మెంట్‌లో కవి పింగళి నాగేంద్రరావు గారూ, డైరెక్టర్ కమలాకర్ కామేశ్వర రావుగారూ, మ్యూజిక్ డైరెక్టర్ ఘంటసాలగారూ, ఆర్ట్ డైరెక్టర్ గోఖలే, ఎస్.వి.రంగారావూ, నేను వున్నాం. సావిత్రీ, చౌదరిగారూ, సూర్యకాంతం, దొరస్వామి, డా॥ శివరామకృష్ణయ్య, జోగారావు, వెంకయ్య, పద్మనాభం, బాలకృష్ణ, మాస్టర్ కుందు, కేశవరాం.... ఇతర కంపార్ట్‌మెంటులో సర్దుకున్నారు.

తింటానికేమైనా దొరుకుతుందమోనని నేనూ, గోఖలే రైలు దిగి వెళ్ళాం. ఏవో అన్నం పొట్లాలూ అవీ వున్నాయి. గానీ, తినటానికి లాయకీగా కనిపించలేదు. మేమిద్దరమూ అయిదు నిమిషాల కల్లా తిరిగివచ్చి మా పెట్టెలు ఎక్కాం. రంగారావు ఒక్కడే ఇంకా ఫ్లాట్‌ఫారం మీద ఉన్నట్లు తెలుసుకున్నాను. బండి బయలుదేరటానికి చాలా టైముంది. ఇంతలోనే రంగారావు గాలికి కొట్టుకొచ్చే వాడల్లే వచ్చి మా పెట్టెలో పడ్డాడు. అతని వాలకం చూస్తే అతన్ని తోడేళ్ళ మంద ఏదో తరిమిందా... అనిపించింది. ఇంతలోనే పెద్ద పశువుల మంద పరిగెత్తుతున్నట్లు చప్పుడైంది. మరుక్షణం తోడేళ్ళు మా పెట్టి దగ్గర మూగి అరవసాగాయి.

ఆ దృశ్యం వర్ణనాతీతం. వాళ్ళంతా కలిసి యాభైమంది ఉంటారేమో. వాళ్ళు మాట్లాడేది మానవ భాషే గాని వారి భావ ప్రకటనలో మానవత ఏమీ గోచరించలేదు. వారు రంగారావును పలకరించటం లేదు. ప్రశ్నించటం లేదు. తమకూ రంగారావుకూ మధ్య భగవంతుడిచ్చిన భాష ఏదీ లేదన్నట్లు ప్రవర్తించారు. ఒకరి తరవాత ఒకరు 'పాతాళ భైరవి'లో మాంత్రికుడి సంభాషణలు వల్లె పెట్టసాగారు. "సంజీవి సిద్ధం సాయరా, డింగరీ' ' "నాకేసి చూడవో, బుల్ బుల్" ఈ విధంగా ఒకరిద్దరు మాంత్రికుడి శిష్యుడితో తాదాత్మ్యం సాధించి "మోసంగురో" అని కూడా ఆక్రోశించారు.

రంగారావు మాత్రం ఇది చూసి ఆనందిస్తున్నట్లు కనిపించలేదు. అతను మా పెట్టెలో వాళ్ళకే సరిగా కనిపించనట్టుగా నీడలో కూర్చుని తాను అక్కడ లేనట్టు నటించడానికి ప్రయత్నం చేస్తూ, ఇప్పుడు తనకిదంతా అలవాటయి పోయిందని మమ్మల్ని మధ్య మధ్య నమ్మిస్తున్నాడు.

బయట తోడేళ్ళ అరుపులు సాగుతూనే ఉన్నాయి. వారిలో ఒకడు కొత్త పంథా తొక్కి 'పెళ్ళి చేసి చూడు'లో వియ్యన్న సంభాషణలు - ఉన్నవి, లేనివి కూడా ఏకరువు పెట్ట నారంభించాడు. మరికొంతమంది అందుకున్నారు. ఇదంతా వాళ్ళకే విసుగ్గా తోచింది కాబోలు, మళ్ళీ ఎవడో 'పాతాళ భైరవి'కి మారాడు. మిగిలిన వాళ్ళు కూడా తమకూత మార్చారు. ఇంతలో చల్లగా రైలు కదిలింది. కానీ, తోడేళ్ళకు సొమ్మింకా గిట్టుబాటు అయినట్టు తోచలేదు - వాళ్ళు రైలుతో పాటు మా పెట్టి వెంబడే నడవసాగారు. తరువాత పరుగెత్తారు కూడాను. మాది చిట్టచివర పెట్టేమో, వాళ్ళు మమ్మల్ని ప్లాట్‌ఫారం ఒక చివర నుంచి దాదాపు రెండో చివర·దాకా సాగనంపారు. ఏం జరిగిందీ రంగారావు చెప్పాడు. అతను కాఫీ తాగుతుండగా ఎవరో, దొంగను పట్టుకున్నట్లు "అదుగోరా" అన్నాట్ట. వెంటనే తోడేళ్ళ గుంపు అప్పటికప్పుడు తయారయింది. రంగారావు ప్రమాదం గుర్తించి "శీఘ్ర బుద్ధేః పలాయనం" అనుకొని ఉండాలి. మిగిలింది మేము చూడనే చూశాం. ఆ తండా యావత్తూ తన వెంట రాలేదనీ అందులో ఒక దళం చీలి సావిత్రి వగైరాలున్న పెట్టెకేసి వెళ్ళిందనీ రంగారావు చెప్పాడు.

సావిత్రీ వాళ్ళ పెట్టె దగ్గర జరిగిన సంఘటనలు స్వయంగా చూడలేక పోయినందుకు చాలా చింతించాను. సావిత్రిని ఏం జరిగిందని అడిగితే - 'అబ్బే ఏం జరగలేదు. మా పెట్టెలో దీపాలార్పేశాం" అని చెప్పింది. ఈ తోడేళ్ళను చూసి సావిత్రి ఎంతమాత్రం జంకి వుండదు. ఆమె నిండా ముసుగుతన్ని పడుకున్నదని చూచాయగా విన్నాను. బహుశా సావిత్రికి చలివేసి వుంటుంది. నిద్రకూడా వచ్చి వుంటుంది.

ఈ సమయంలో తలవని తలంపుగా 'పెళ్ళి చేసి చూడు' సంభాషణ మరొకటి వినపడింది. సూర్యకాంతం మా దగ్గరికి వచ్చి, ముఖద్వారం కేసి చూపుతూ-" ఆ ముదనష్టపొళ్ళతో మీకెందుకు గాని దొడ్డదారిని పదండి. నాయనా!" అనేసింది...

ఇలా సాగింది ఆ వ్యాసం. ఇది సినిమా అభిమానుల్ని చాలా ఆగ్రహోదగ్రుల్ని చేసింది. తోడేళ్ళు, పశువుల మంద, తండా, ముదనష్టపోళ్ళు ఇలాంటి మాటలతో కొడవటిగంటి తెలుగు ప్రజల్ని అవమానించాడని ఘాటుగా విమర్శించారు జనం. బహుశా ఆ విమర్శ మోతాదు మించి వుండి వుంటుంది.

కినిమా పత్రికకి ఓ ఉత్తరం రాశారు కొడవటి గంటి – అది జనవరి సంచికలోనే ప్రచురితం అయ్యింది –

"కినిమా" – డిసెంబర్ సంచికలో 'పెళ్ళి చేసి చూడు' శతదినోత్సవం గురించిన అనుభవం ప్రకటిస్తూ సూళ్ళూరు పేటలో మా కంపార్ట్‌మెంట్ వద్దకు వచ్చిన వారిని "తోడేళ్ళు" అని వర్ణించినందుకు చాలా పశ్చాత్తాప పడుతున్నాను. ఈ విషయమై 'కినిమా' సంపాదకుడికి లేఖలు వ్రాసిన వారు నాకు, 'కినిమా' సంచాలకునికి చాలా హేయమైన ఉద్దేశాలు ఆపాదించారు. అటువంటి ఆపాదనకు ఎట్టి అవకాశమూ లేదనీ, యింకొకరిని విమర్శించే సమయంలోనే వారు విమర్శనీయమైన ఆపాదనలు చేసి వుండడం శోచనీయమనీ మనవి చేస్తున్నాను"

**(కొడవటిగంటి కుటుంబరావు సినిమా వ్యాసాలు ఒకటవ సంపుటం)**

# తురగా రామకవి

**తు**రగా రామకవి 18వ శతాబ్దంలో పెద్దాపురం సంస్థానంలో తిమ్మ జగపతి కాలంవాడు. ఈయనకి కోపం తెచ్చేలా ప్రవర్తించి తిమ్మ జగపతి నాశనమైనాడంటారు.

"పెద్దాపురపుఁగోట పెద్దమ్మ కిల్లోట కవి వరేణ్యుల కోప కలనఁగాదె" అని తిరుపతి వేంకట కవులు ఈ కవిగురించి రాశారు. "నిరాఘాటత్వానికి తురగా రామకవి ముందర ఏ శ్రీనాథుఁడూ చాల"దని చెళ్ళపిళ్ళవారు 'కథలూ గాథలూ'లో ఉటంకించారు. రామకవిగారి సానుల గురించి చాలా కథలు ప్రచారంలో వుండటం మూలాన శ్రీనాథుడు చాలదని అన్నారు.

సూర్యప్రకాశరావు అనే భూస్వామి ఉంగుటూరులో చాలా పెద్దదైన మేడని కట్టి రామకవిగారిని తీసుకెళ్ళి చూపించి ఎలా వుందన్నాడట!

"కట్టితివి గాక. సూర్యప్రకాశరాయ! ఉంగుటూరిండ్ల రాక్షసులుండవచ్చు–" అని నిర్మొహమాటంగా చెప్పాడు. అది ఆ భూస్వామికి కోపం తెప్పించడం, ఆయనేదో హానిచేయడం సహజంగా జరిగి వుంటుంది. –

"ఇరువది చేతులుం దలలు నింతియ తక్కువ, యంతె కాని వీఁ దరయగ రావణాసురుని యంతటి వాఁడు ...." అని తిట్టిపోశాడు!

# ఆదివారం శెలవు కథ

With the Merchant - comes the Musket
With the Bible - comes the Bayonet

అని నేపాల్‌లో ఒక కొత్త సామెత పుట్టింది. వ్యాపారస్తులుగా బైబిలు పుచ్చుకొని లోపలికి ప్రవేశించి తుపాకులు చూపించి రాజుల్ని రాజ్యాల్నీ లోబరుచుకోసాగారు బ్రిటిష్ వాళ్ళు.

1844లో "హెన్రీ హార్డింజి" అనేవాడు ఇండియాకు గవర్నర్ జనరల్‌గా వచ్చాడు. అంతకు మునుపు గవర్నర్ జనరల్‌గా చేసి వెళ్ళిపోయిన ఎల్లెంబరో కుట్రలు ఎక్కడ ఆగాయో అక్కడి నించి కొనసాగించడానికి "హార్డింజి"కి అవకాశం కుదిరింది.

నాలుగేళ్ళపాటు అతను భారతదేశంలో గవర్నర్ జనరల్‌గా వుండి, సిక్కురాజ్యాన్ని పతనం చేసి మహరాజా రంజిత్‌సింగ్‌ను పరిమార్చాడు. నేపాల్ రాజ్యాన్ని, అయోధ్య రాజ్యాన్ని కూడా మింగేసే ప్రయత్నాల్లో వున్నాడు.

రెండేళ్ళు యుద్ధ తంత్రాలు, యుద్ధ వ్యూహాల్లో మునిగి తేలేసరికి అలసట అనిపించింది ఆయనకి. అకస్మాత్తుగా దేవుడు గుర్తుకొచ్చాడు. ప్రతి ఆదివారం చర్చికి వెళ్ళి ప్రభువును ప్రార్థించుకోవడం మొదలు పెట్టాడు. తనలాగే తన బ్రిటిష్ సైనికులు కూడా ప్రతి ఆదివారం చర్చికి వెళ్ళి ప్రార్థనలు చేసుకొనే అవకాశం కల్పించాడు.

సైనికాధికారులు బ్రిటిష్ వాళ్ళయితే వాళ్ళ సామానుని ఇంకో మనిషిని పెట్టి మోయించుకోవచ్చని ప్రకటించాడు. భారతీయులైన సైనికాధికారులు మాత్రం తమ సామాను తామే మోసుకోవాలని నిర్దేశించాడు.

ఎల్లకాలం ఎవడో ఒకరి రాజ్యాన్ని కాజేయడం ఎలా ... అనే ఆలోచనల్లోనే వుండిపోయి ప్రజల యోగ క్షేమాలు విచారించే తీరిక లేకుండా పోయిందని బాధపడిపోయేవాడు. ఆదివారం ఆదివారం చర్చికి వెళ్ళి ప్రజాసేవ చేసే శక్తి ప్రసాదించమని ప్రార్థించేవాడు. అతని దృష్టిలో ప్రజాసేవ అంటే పరరాజ్య కబళనమే! క్రైస్తవం పుచ్చుకున్న వారంతా ఆదివారం నాడు చర్చికి వెళ్ళడం మొదలుపెట్టారు.

సంతోషించాడు హార్డింజి. 1846 అక్టోబర్ నెల గెజిట్‌లో ప్రకటన చేయించాడు - ఇంకనుంచీ ప్రతి ఆదివారం క్రైస్తవులందరూ చర్చికి వెళ్ళి ప్రార్థనలు చేసుకొంటారు కాబట్టి ప్రభుత్వ కార్యాలయన్నింటికి ఆదివారం సెలవు ప్రకటిస్తున్నాను - " అని!

అదే అలవాటు ఈనాటికీ కొనసాగుతోంది.

**(మానికొండ సత్యనారాయణ శాస్త్రి "బ్రిటిష్ మహాయుగం")**

# శ్రీరాములు ఋణం తీరేనా?

1952 అక్టోబర్ 23 నుండి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కోసం ఆమరణ నిరశన దీక్ష ప్రారంభించారు శ్రీ పొట్టి శ్రీరాములు

అప్పటిదాకా సాగిన ఉద్యమం ఒక ఎత్తు. ఆంధ్రరాష్ట్ర సాధన ఉద్యమం ద్విగుణం బహుళం అయ్యిందింక! సమ్మెలు నిరసన ప్రదర్శనలు బందులు హర్తాళ్ళతో ఆంధ్రప్రాంతం ఉడికి పోతోంది.

ఇది ఇలావుంటే –

అంతర్జాతీయ దృక్పథంతో ఆలోచించే పండిట్ నెహ్రూ భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన జరిగితే ప్రాంతీయ సంకుచిత తత్వాలు జనాల్లో పెరుగుతాయని, జాతీయ దురహంకారం వంటివి పెచ్చుమీరతాయని, భవిష్యత్తులో ఇది దేశానికి నష్ట దాయకంగా వుంటుందనీ అభిప్రాయపడ్డాడు.

మద్రాసు నగరంలో అధిక సంఖ్యలో తెలుగువారు వున్నారు కాబట్టి, ఇది తెలుగునగరమే కాబట్టి, తెలుగువారిలో చాలామంది ఆస్తిపాస్తులు ఈ రాజధాని నగరంలోనే వున్నాయి కాబట్టి మద్రాసు లేనిదే ఆంధ్రరాష్ట్రాన్ని అంగీకరించేది లేదని టంగుటూరి ప్రకాశం గారు, పట్టుబట్టారు.

మద్రాస్ నగరం ఒక్కదాన్ని ప్రత్యేక కమీషనర్ నగరం చేసి అటు తమిళులూ, ఇటు తెలుగు వారూ సమానంగా ఉపయోగించుకునేట్లు ఉమ్మడి రాజధానిగా ప్రకటించమని మధ్యేమార్గంగా సూచించారు – బులుసు సాంబమూర్తి, స్వామీ సీతారాం వంటి పెద్దలు.

మద్రాసు నగర భవితవ్యాన్ని ఆ ఊరు ప్రజల నిర్ణయానికి వదిలేసి వివాదం లేని 11 జిల్లాలతో ఆంధ్రరాష్ట్రాన్ని తక్షణం ఏర్పాటు చేయాలని, పొట్టి శ్రీరాములు గారి ప్రాణాన్ని కాపాడాలనీ చండ్ర రాజేశ్వరరావు గారు కోరారు. 1952 డిసెంబరు 1వ తేదీన మద్రాసు రాష్ట్ర శాసనసభలో కమ్యూనిస్ట్ పక్షం ఈ మేరకు ఒక తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది. చండ్రరాజేశ్వరరావు, మోటూరి హనుమంతరావు, కోడుగంటి గోవిందరావు, కాట్రగడ్డ రాజగోపాలరావు, చండ్ర పుల్లారెడ్డి గార్లతో ఒక ఉపసంఘాన్ని వేశారు. ఆంధ్రరాష్ట్ర సమస్యని మద్రాసు నగరంతో ముడిపెట్టి స్వరాష్ట్ర సాధనకు మోకాలు అడ్డుపెట్టవద్దని కాంగ్రెస్ నాయకుల్ని కోరారు.

ప్రత్యేకాంధ్రకు రాయలసీమ నాయకులు సుముఖంగా లేరంటూ ఆనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి చక్రవర్తుల రాజగోపాలాచార్యులు (రాజాజి) అన్నారు.

"పదేళ్ళు అభివృద్ధి పొందేదాకా ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోనే మా రాయలసీమ జిల్లాలు వుండిపోతాయి" అని నీలం సంజీవరెడ్డిగారు ప్రకటించారు.

ఆంధ్ర ప్రాంతంలో కమ్యూనిస్టులు ఎక్కువగా గెలిచి వున్నారు. అందుకని "ఓ ఐదేళ్ళో పదేళ్ళో ఈ సమస్యని వాయిదా వేస్తే మంచిది –" అని రంగాగారు అన్నారని కమ్యూనిస్టులు ఆయన్ని తీవ్రంగా విమర్శించారు.

డిసెంబర్ 7వ తేదీన అన్ని రాజకీయ పక్షాలతో అఖిల పక్ష సమావేశాన్ని ఏర్పాటుచేశారు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు అధ్యక్షులుగా సభను ప్రారంభించారు. మద్రాసు నగరాన్ని చీఫ్ కమిషనర్ రాష్ట్రంగా చేసి వెంటనే ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని తెన్నేటి విశ్వనాధంగారు తీర్మానం ప్రవేశం పెట్టారు.

ఈ తీర్మానం మీద సవరణలు ప్రవేశ పెట్టడానికి నార్ల వెంకటేశ్వరరావు, గౌతు లచ్చన్న, తరిమెల నాగిరెడ్డి నిలబడగా, ప్రకాశంగారు వాళ్ళని మాట్లాడడానికి వీల్లేదని రూలింగ్ ఇచ్చి, విశ్వనాధం గారి తీర్మానం నెగ్గిందని ప్రకటించి సభను వాయిదా వేశారు.

వెంటనే చంద్ర రాజేశ్వరరావు గారు లేచి, సభ కొనసాగుతుందని ప్రకటించి, తరిమెల నాగిరెడ్డిని అధ్యక్షుడిగా ప్రతిపాదించి సభని నడిపించారు.

మద్రాస్ భవితవ్యాన్ని ప్రజాభిప్రాయ సేకరణ ద్వారా నిర్ణయించుకోవాలని, నిర్వివాద ప్రాంతాలతో ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలనీ చంద్ర రాజేశ్వరరావు తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఈ తీర్మానాన్ని 1140 మంది ప్రతినిధులు ఏకగ్రీవంగా ఆమోదించారు.

అప్పుడు పార్లమెంటులో పుచ్చలపల్లి సుందరయ్య గారు ప్రతిపక్ష నాయకుడు. ఆయన ఉపరాష్ట్రపతి రాధాకృష్ణన్ తదితర పెద్దలతో సంప్రదించి సమస్యని ఒక కొలిక్కి తెచ్చే ప్రయత్నం చేశారు. నిరాహార దీక్ష విరమించవలసిందిగా ఢిల్లీ నుంచి శ్రీరాములు గారికి టెలిగ్రాం ఇచ్చారు.

పొట్టిశ్రీరాములు గారి పరిస్థితి విషమించుతోంది. ఎక్కిళ్ళు వాంతులూ ఎక్కువైనాయి. ఆయన స్పృహతప్పి కోమాలోకి వెళ్తున్నారు.

శ్రీరాములు ప్రాణం కాదు – ఇంకా ప్రాణాలు చాలా త్యాగం చెయ్యవలసి వుంటుంది. బ్రహ్మదేవుడు దిగి వచ్చినా మద్రాసు వదులుకోనని అన్నారు ప్రకాశం.

ఆయన తన ఆస్తులు కోసం ఆంధ్రుల ప్రయోజనాలు పణంగా పెడ్తున్నాడని విశాలాంధ్ర దినపత్రిక ఘాటుగా విమర్శించింది.

ఇదిలావుంటే డిసెంబర్ 10వ తేదీ మద్రాస్ మినహా మిగిలిన నిర్వివాద ప్రాంతాలతో ఆంధ్ర రాష్ట్రం నిర్మాణానికి భారత ప్రభుత్వానికి అభ్యంతరం లేదని ప్రకటించారు. ఉపవాస దీక్ష శ్రీరాములు గారు విరమించుకోగలరని ఉపరాష్ట్రపతి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ స్టేట్ కౌన్సిల్‌లో ప్రకటించారు.

నెహ్రూ అభ్యంతరం లేదు అని మాత్రమే అన్నారు గాని, అంగీకరిస్తున్నాను - అనలేదు కదా" అని స్పృహ కోల్పోయారు శ్రీరాములు గారు.

శ్రీరాములుగారి నిరశన వ్రతం ప్రారంభమై 58వ రోజు

తెలుగుజాతికది దుర్దినం ...

ఆరోజు సూర్యుడు ఉదయించకుండానే అస్తమించాడు. గాంధేయ మార్గంలో ఆశయ సాధన కోసం పోరాడిన యోధుడు శ్రీరాములు గారు ఆంధ్ర రాష్ట్రంకోసం ఆత్మార్పణ చేశారు -

"మద్రాస్ కోసం ప్రకాశం గారు పట్టపట్టక పోతే శ్రీరాములు గారు ఆత్మత్యాగం అవసరమయ్యేది కాదు-" అని విమర్శించారు కమ్యూనిస్టులు.

త్యాగాలు,. ప్రాణార్పణలు గాంధేయ వాదంతో నడిచేవారికి కొత్త కాదు. కడదాకా పట్టు విడకుండా వుంటే మద్రాసును తెలుగువారు కోల్పోయేవారు కాదు... అన్నారు ప్రకాశం.

మద్రాసు సరే... మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, నైజాం, కర్నాటక రాష్ట్రాలలో వున్న తెలుగు ప్రాంతాల మాటేమిటని తెలుగు ప్రజలు తమలో తాము తర్కించుకోవడం మొదలు పెట్టారు.

వారి ప్రశ్నలకు సమాధానాలు చెప్పే వారెవరూ లేరానాడు అక్కడ... ఎక్కడా...!!

శ్రీరాములు గారి పేరు ఒక జిల్లాకు పెట్టడం అంటే ఆయన త్యాగాన్ని తక్కువగా అంచనా వేయడమే! ఈ రాష్ట్రాన్ని "శ్రీరాములు ప్రదేశ్" అని పిలిచినా ఆయన ఋణం తీరేది కాదు.

**(కమ్యూనిజం - జూన్ 1994 ప్రత్యేక సంచిక)**

### మహామహోపాధ్యాయులకైనా

# పరీక్షలంటే హడలే...

వేదము వెంకటరాయ శాస్త్రులు గారు-

'మహోపాధ్యాయ' కళాప్రపూర్ణ వంటి బిరుదులు పొందిన కవిపండితులు. ఆధునిక యుగంలో సాధికారికమైన తొలితరం భాషావేత్త. ఆయన 1875వ సంవత్సరంలో ఎఫ్.ఎ.పరీక్షలకు హాజరైనప్పుడు అందులో తెలుగుపేపర్‌ని ఇంత చక్కగా రాశారు...

పరీక్షకి 3 గంటలే సమయం! మొదటి రెండు గంటలూ ప్రశ్నల్ని అర్థం చేసుకోవడానికే సరిపోయిందిట. రెండు గంటలసేపు రాసిన తర్వాత తాను ప్రశ్నల్ని తప్పుగా అర్థం చేసుకున్నానని గమనించి అప్పటిదకా రాసిందంతా ఈమూల నుంచి ఆ మూలకి కొట్టేశారు. ఇంక గంటే సమయం వుంది. ఆగకుండా వడివడిగా రాయడం మొదలుపెట్టారు.

చివరగా ఆటవెలది, తేటగీతి లక్షణాలు రాయవలసి వుంది.

"ఇన గణ త్రయంబు నింద్ర ద్వయంబును" అని రాశారు. ఠంగున గంట మోగింది.

"హంస పంచకంబునాట వెలఁది" అని రాసేశారు.

అంతలోనే ఇన్విజలేటర్ రయ్యిన ఆయన దగ్గరకు వచ్చాడు. రాయడం ఆపెయ్యమంటూ చేతిలో పెన్ను లాక్కుపోయాడు.

దాంతో, చేసేదిలేక సిరాబుడ్డిలో చిటికెన వేలు ముంచి -

"సూర్యుడొక్కరుండు సురరాజు లిద్దరు" అని వేలితోనే రాసేశారు.

ఇన్విజిలేటర్ మళ్ళీ వెనక్కి వచ్చాడు. "ఇంకా రాస్తున్నావా?" అని కసిరాడు. ఎదురుగా వున్న సిరాబుడ్డి పట్టుకుపోయాడు.

చిటికెన వేలుకి అంటిన సిరాని ఎంగిలి తడి చేసి

"దినకర ద్వయంబు తేటగీతి" అని పూర్తి చేసేశారు.

ఇన్విజలేటర్ కోపంగా వచ్చి చేతిలో పేపర్లు లాక్కుపోయాడు.

ఈ హడావిడిలో ఆయన పేపర్ మీద తన నెంబర్ వేయడమే మరిచిపోయాడట...

ఇంత ప్రయాస ఎందుకూ పనికిరానిదై పోయింది.

సగం దూరం దుఃఖంతో ఇంటిదాకా వచ్చి, మళ్ళీ వెనక్కి వెళ్ళి ఫ్యూన్‌ని మంచి చేసుకొని తన పేపరు మీద నెంబర్ వేసుకున్నారట!

బహుజనవల్లి సీతారామాచార్యులుగారు ఆయనకు తెలుగు చెప్పిన గురువు. చదువు అయిపోయాక ఒకసారి వెంకటరాయ శాస్త్రి గారు ఆయన దగ్గరకు వెళ్ళి తనకో యోగ్యతాపత్రం కావాలని అడిగారు.

"ఇది వేదము వేంకట రాయ శాస్త్రుల వారి యోగ్యతను తెలియఁజేయు పత్రిక... వీరు కొన్ని యేండ్లకు ముందు రమారమీ ఒకటియునర సంవత్సరము నార్మలు స్కూలులో నాయొద్ద తెనుగు చదువుచుండిరి. అది మొదలు నేను వీరిని బాగుగ గుర్తెఱుంగుదును. చదువునప్పుడు వీరు చేయు విద్యా విషయకమైన ప్రశ్నలకు సదుత్తరములు చెప్పి వీరిని సమాధాన పఱిచి నా పాండిత్య గౌరవమును మాటి మాటికిని నిలువఁబెట్టు కొనవలసి వచ్చుచుండెను...." అని!

అపారమైన మేధావులు పరీక్ష హాల్లో తొట్రుపడడం సాధారణమే! పుట్టపర్తి నారాయణాచర్యుల వారి విషయంలో కూడా ఇలాంటిదే చెప్తారు. ఆయన వ్రాసిన గ్రంథమే ఆయనకు పాఠ్య పుస్తకంగా వుండేది! తీరా పరీక్షరాయాల్సి వచ్చినప్పుడు అందులోనే ఆయన ఫెయిలయ్యారు. అదీ సంగతి!

**(వేదము వేంకటరాయ శాస్త్రిగారి జీవితము)**

# కర్నాట భాష అంటే నెల్లూరు తెలుగే!

శ్రీనాథుడు పాకనాటివాడు. నా భాష కర్ణాట భాష అని చెప్పుకున్నాడు. "కర్నాట కటక పద్మ వనహేణి శ్రీనాథ భట్టసుకవి" అని తనగురించి తాను చెప్పుకొన్నాడు పాకనాడు. అంటే నెల్లూరు ప్రాంతం. దీనికే కర్నాటమనే పేరున్నట్లు 'గ్లోసరీ ఆఫ్ మద్రాసు ప్రెసిడెన్సీ' చెప్తోంది. తెలుగుభాషనే ఒకప్పుడు 'కర్నాట భాష" అనే వారన్నమాట!

"హాటకమైన ప్రకీర్ణము, పాటించి గుణింపజేతు బహు పద్ధతులన్, గాటంబగు లెక్కలు కర్ణాటకమున వెలయ సూర్యానారాయణుడా!" అని, వీరాచార్య రచించిన సంస్కృత గణిత శాస్త్రాన్ని తెలిగిస్తూ ఎలుంగంటి పెద్దన వ్రాశాడు.

ఆర్కాటు నవాబుని కర్నాట నవాబు అని కూడా పిలిచేవారు.

శ్రీనాథుడు చెప్పిన కర్ణాటాంగనలు నెల్లూరు నెరజాణలే

శ్రీనాథుడి భాష కర్నాటాంధ్రం. అది ఆంధ్రంలో ఒక మాండలికం. అంతేకాని, కన్నడభాష కాదు.

**(ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు 'అక్షర యజ్ఞం' అనే గ్రంథం.)**

# తాతాచార్యుల ముద్ర

కృష్ణ దేవరాయలు వైష్ణవాన్నీ, శైవాన్ని రెండింటినీ సమానంగా ఆదరించాలని ప్రయత్నించాడు.

తాతాచార్యులవారు వైష్ణవాన్ని, అప్పయ్య దీక్షితులవారు శైవాన్నీ ప్రచారం చేసే ప్రముఖులు ఆ రోజుల్లో.

ఈ ఇద్దరి మధ్య ఎంత విరోధం వున్నా, రాయలు ఇద్దరినీ తన ఆస్థానంలో బ్రతిమాలి వుంచుకొన్నాడని చెప్తారు.

ఒకసారి ఈ ఇద్దరు మతప్రచారకుల్నీ వెంటపెట్టుకొని కాశీయాత్ర చేశాడు రాయలు.

మందీమార్బలం తోనూ, తాతాచార్యులు, అప్పయ్యదీక్షితులు తదితర కవి ప్రముఖులతోనూ సాగిన ఈ యాత్ర కొండవీడు దాకా వచ్చినప్పుడు - అక్కడ జొన్న అన్నం తప్ప ఇంకో ఆహారం దొరకలేదట. జొన్నన్నం అంతకుమునుపు అప్పయ్య దీక్షితులు తినలేదు. అందుకని దాన్ని శివుడికి ఎలా నైవేద్యం పెట్టాలా.. అని ఆలోచించాడు. చటుక్కున ఓ శ్లోకం మెదిలింది మనసులో.

కాలకూట విషం భుంక్త్వా గర్వితోసి మహేశ్వర
అస్తి చే త్తవ సామర్థ్యం యావనాళో దనంగిళ -

కాలకూటం విషం తాగానని గర్విస్తున్న మహేశ్వరా... ఈ జొన్నన్నం తిని జీర్ణించుకొని నీ సామర్థ్యం చూపు... అని!

యాత్ర సాగుతోంది.

ఒకచోట భైరవుడు ముక్కున వేలేసుకొని ఆశ్చర్యపోతున్నట్లున్న ఒక విగ్రహం కన్పించింది.

దాన్ని చూసి తాతాచార్యులు - "లోకం అంతా విష్ణుమయం అయినప్పటికీ, ఈ క్షేత్రంలో వైష్ణవ మతం వ్యాపించక ఇంకా శివ మహాత్మ్యమే మిగిలి వుందని భైరవుడు ఆశ్చర్యపోతున్నాడు..." అంటూ ఎద్దేవా చేశాడు.

"ఆహాఁ! తమరంత ఘనమైన రహస్యాన్ని కనుక్కొన్నా, భైరవుడు ముక్కుమీంచి వేలు తియ్యలేదే...?" అనడిగాడు అంతకన్నా వ్యంగ్యంగా అప్పయ్య దీక్షితులు -

"విగ్రహం వేలు తీస్తుందా ఎప్పుడైనా... సరే! మీరు ఇంతకన్నా ఘనంగా చెప్పి వేలు తీయించండి చూద్దాం-" కోపంగా అన్నాడు తాతాచార్యులు.

"తీయించగలను!" ఖండితంగా చెప్పాడు దీక్షితులు.

ఈసారి విస్తుపోవడం రాయలవారి వంతయ్యింది.

"తీయించగలిగితే నేను చండాలుణ్ణయిపోతాను. మీరు కూడా ఈ పందానికి సిద్ధమేనా...?" అడిగాడు రోషంగా తాతాచార్యులు.

"పంతాలకు పోకండి..." వారించాడు రాయలు. ఇద్దరూ వినలేదు.

దీక్షితులు పరమేశ్వరుణ్ణి ధ్యానించి ఈ శ్లోకం చెప్పాడు -

"అంబేతి లక్ష్మీపతి మాహ్వయామి
పత్న్యః పితుర్మాతర ఏవసర్వాః
కథన్ను లక్ష్మి మితి చింతయంతం
శాస్తార మీడే సకలార్థ సిద్ధైః"

విష్ణువు జగన్మోహనావతారం ఎత్తినప్పుడు శివుడు ఆమెని మోహించిన కథ అందరికీ తెలుసు. ఆ మోహిని ద్వారా శివుడు భైరవుణ్ణి కన్నాడు. కాబట్టి భైరవుడికి తండ్రి శివుడు. తల్లి విష్ణువు. కానీ, తల్లి అయిన విష్ణువుకి లక్ష్మి అనే భార్య వుందికదా... తల్లి భార్య అయిన లక్ష్మిని ఏ వరసతో పిలవాలా... అని భైరవుడు తన ముక్కుమీద వేలు వేసుకున్నాడు..."

అప్పయ్య దీక్షితులు ఈ శ్లోకం పూర్తి చేస్తుండగానే భైరవుడి విగ్రహం ముక్కున వేలు తీసేసిందిట...

ఈ సంఘటన చూసి ప్రతి ఒక్కరూ ముక్కున వేలేసుకొని వుంటారు.

"ఛండాలత్వం వచ్చింది కాబట్టి తాతాచార్యుల వారు దూరంగా వుండి అస్పృశ్యాన్ని పాటించడం మంచిది-" అన్నాడు దీక్షితులు- పందెం ఓడిపోయిన ఆచార్యుల వారితో!

దుఃఖం ముంచుకొచ్చింది అప్పలా చార్యులవారికి జాలిపడ్డాడు అప్పయ్య దీక్షితులు

కోటి కన్యాదానాలు చేస్తే ఈ పాపం పోతుందని ప్రాయశ్చిత్తం చెప్పాడాయన. దోష పరిహారం కోసం కోటి కన్యాదానాలు తాను చేయిస్తానిని బాధ్యత తీసుకొన్నాడు రాయలు.

మాట చెల్లించుకొనే రోజు వచ్చింది -

వైష్ణవులు కాని వారికి కన్యాదానాలు చెయ్యనని వైష్ణవులను మాత్రమే రావలసిందిగా ఆహ్వానించాడు తాతాచార్యులు. కోటిమంది వైష్ణవులు ఎక్కడ దొరుకుతారు... ఆ రోజుల్లో..

చక్రాంకితులైన వారినీ, స్మార్తుల్నీ కూడా దానానికి అర్హులుగా నిర్ణయించారు. అయినా కోటిమంది సరిపోలేదు.

అప్పటికప్పుడు భుజాలమీద శంఖుచక్రాలను ముద్ర వేయించుకొన్న వారిక్కూడా దానం ఇవ్వడం మొదలుపెట్టారు.

కొంతమంది భుజాన చక్రాంకితాలున్నాయని అబద్ధాలాడి కన్నుగప్పి లోపలకు పోయి దానం పుచ్చుకొంటున్నారని తెలిసింది.

అందుకని, దానం కోసం వచ్చిన వారందరికీ వీపున ముద్రధారణ చెయ్యమని ఆదేశించాడు తాతాచార్యులు.

తాతాచార్యుల ముద్ర భుజాన తప్పినా వీపుకు తప్పలేదనే సామెత ఇలా పుట్టింది!

ఏమైనా, దక్షిణ భారత దేశంలో వైష్ణవ మతవ్యాప్తి విషయంలో తాతాచార్యుల ముద్ర గొప్పది.

ఏ పక్షంలోనైనా చేరడానికి గేట్‌పాస్ లాంటిది తాతాచార్యుల ముద్ర. ఈ ముద్ర పడిందంటే లోనికి ప్రవేశం లభించినట్టే!!

**(వావిళ్ళ వారి 'అప్పయ్యదీక్షితులు' గ్రంథం)**

**భాషకు ముప్పు**

# అజ్ఞాని కవిత్వం

**అ**నంత పంతులు రామలింగస్వామి అనే కవి 1932 లో వెలువరించిన శుక్లపక్షం అనే కావ్యంలో కవిత్వం గురించి తెలియని వాళ్ళంతా కావ్యాలు రాయడానికి ప్రయత్నించడాన్ని అవహేళన చేస్తూ ఈ సీసపద్యాన్ని రాశారు.

రసము నేనెఱుగనా ప్రారబ్ధమిది యేమి, ద్రవిడదేశాన్నసత్రముల నిదరె?
సముచితాలంకార సమితి నేనెఱుంగనా, మగువలు ధరియించు నగలు గావె?
యతిని నే నెఱుఁగనా, క్షితిలోనఁ గాపోయ వస్త్రధారుండైన వాఁడు గాఁడె?
గురువు నే నెఱుఁగనా, సరి సరి యక్షరాభ్యసనంబు సలిపిన యతఁడు గాఁడె?
శబ్దమన నే నెఱుంగనా చప్పుడుగదె,
యనుచు వచియించు నజ్ఞాన జనములోన
నగ్రగణ్యుండవను నీ వహో!
కవిత్వమును రచించుట భాషకు ముప్పుగాదె?

### అప్పులు తీర్చడం కోసం

# గవర్నర్ జనరల్ పదవి

1813వ సంవత్సరం అక్టోబర్ 1వ తేదీన కలకత్తా వచ్చి భారత గవర్నర్ జనరల్ పదవినీ, దాంతోపాటు సర్వసేనాపతి పదవిని కూడా స్వీకరించాడు మార్క్విస్ హేస్టింగ్స్. కంపెనీ తరఫున గవర్నర్ జనరల్స్‌గా పనిచేసిన క్రూరుల్లో కెల్లా క్రూరుడు ఈ హేస్టింగ్స్.

ఈ పెద్ద మనిషి లండన్‌లో ఉన్నప్పుడు పెద్ద దుబారా ఖర్చుదారుడు. అమ్మా బాబులు ఇచ్చిన ఆస్తినంతా తాగి తందానాలాడి నాశనం చేశాడు. చివరికి అందిన చోటల్లా అప్పులు చేశాడు. హేస్టింగ్స్ తండ్రి గారి పలుకుబడితో పెద్ద పెద్ద వాళ్ళ దగ్గర అప్పులు చేశాడు. ఇతనికి అప్పులిచ్చిన పెద్దల్లో అప్పట్లో ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లు కూడా వున్నారు.

ఒకరికి తెలియకుండా ఒకరి దగ్గర అప్పులు చేసినా అందరికి తెలిసి పోయింది - ఈ బాకీలు వసూలయ్యే మార్గం కన్పించలేదు. అందుకని, ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లంతా కూర్చుని బాగా ఆలోచించి, ఈ హేస్టింగ్స్‌కు గవర్నర్ జనరల్ పదవి, సర్వసేనాధిపతి పదవి రెండూ ఇచ్చి భారత్‌కు పంపి - అతని రెండు జీతాల్లోంచి తమ అప్పుల్ని లాక్కోవాలని నిర్ణయంచేశారు.

తక్షణమే అతనికి ఉద్యోగం ఇచ్చి ఇండియాకి పంపారు. అదీ హేస్టింగ్స్ కథ. భారత్ గవర్నర్ జనరల్ చెయ్యడానికి ఇతని కున్న ఒకే అర్హత ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్ల దగ్గర అప్పు చేయగలగడం! జీతం అతని చేతికొస్తే మళ్ళీ తమకు రావని, వచ్చిన జీతం వచ్చినట్లు పిక్కుకు రమ్మని ఓ నక్షత్రకుణ్ణి వెంటే పంపారట! వాడిపని వీడి జీతాన్ని వసూలు చేసుకొని కంపెనీ డైరెక్టర్లకు పంపడమే!

నెలా నెలా నెల జీతం ఇలా అప్పువాళ్ళు గద్దల్లా తన్నుకుపోతుంటే సొంత ఖర్చులకోసం అడ్డదారులు వెతుక్కోక తప్పలేదు హేస్టింగ్స్‌కి!

అయోధ్యరాజుని బెదిరించి కోటి రూపాయిలు గుంజేశాడు. కన్పించిన రాజ్యం మీద యుద్ధం ప్రకటించి యుద్ధ ఖర్చుల్లోంచి కమీషన్లు వెనకటి గుణం మానకుండానే గుంజేవాడు. భారతదేశంలో క్రూరమైన పాలకుడిగా రక్తపుటేరులు పారించాడు... ఇదంతా డబ్బుకోసమే! అందులో తన వాటా సొమ్ముకోసమే!

డబ్బు కక్కుర్తి ఎక్కువగా పడ్తున్నాడన్న సంగతి కంపెనీ డైరెక్టర్లకు తెల్సింది. పైగా యుద్ధాల్లో లాభం కన్నా నష్టం ఎక్కువగా కన్పించసాగింది. భారతీయులు ఇతన్ని

అసహ్యించుకొంటున్నారని తెలుసుకొన్నారు కంపెనీ డైరెక్టర్‌లు. వాళ్ళక్కూడా వీడంటే అసహ్యం వేసింది. ఇంక చేసిన నిర్వాకం చాల్లే వచ్చేయమన్నారు. నేపాలీయుల్ని, మహారాష్ట్రుల్ని పడగొట్టడంలోనే ఎక్కువ శ్రమపడిన హేస్టింగ్స్ లండన్‌లో మళ్ళీ రోడ్డున పడ్డాడు.

చేతిలో పైసా లేకుండా అల్లాడుతున్నాడని అతని గురించి జాలిపడి, జాగ్రత్తగా బతకమని హెచ్చరించారు. మాల్టా దీవికి గవర్నర్‌గా పంపారు.

అవసాన కాలంలో పింఛనుగా ఉపయోగపడ్తుంది లెమ్మని... ఆ చిన్న పదవికే ఒప్పుకొన్నాడు హేస్టింగ్స్!

కంపెనీ డైరెక్టర్ల పాలనా కాలంలో ఇలాంటి కథలే ఎక్కువ! హేస్టింగ్స్ లాంటి దుష్టుణ్ణి ఎలా ఎన్నిక చేశారంటే - ఆ ఎన్నిక చేసిన డైరెక్టర్లు కూడా అలాంటి వాళ్ళేకాబట్టి!!

(మానికొండ సత్యనారాయణ శాస్త్రి "బ్రిటిష్ మహాయుగం")

# కూచిమంచి తిమ్మకవి రసికత

'రసిక జన మనోభిరామం' రాసిన రసికవతంసుడు కూచిమంచి తిమ్మకవి. ఆ రోజుల్లో ఆడవాళ్ళు చాలా మంది ఈయనంటే వ్యామోహపడేవాళ్ళు. ఓ అందమైన అమ్మాయి ఎన్నాళ్ళనుంచో అవకాశం కోసం ఎదురుచూస్తూ, ఒక రోజు నది రోడ్డుమీద దొరికాడని అమాంతం కావులించుకొంది! కవిగారికి మతిపోయినంత పని అయ్యింది. ఖంగుతిని వెనకాముందూచూస్తూ బిత్తరపోయి నిలబడిపోయాడు!

అప్పుడా యువతి పగలబడి నవ్వి-

'చతురులలోన నీవు కదు జాణ వటంచును నేను కౌఁగిలించితినిటు మాఱు మోమిడఁగఁ జెల్లునె?' "అంది "నువ్వేదో గొప్ప మొనగాడనుకొని కావులించుకొన్నానని దెప్పిపొడుస్తూ! తిమ్మకవిగారికి సమాధానం చెప్పక తప్పలేదు.

".... ..... ..... ఓ రసికాగ్ర గణ్య! య
ద్భుతమగునట్టి బంగరపుఁ బొంగరపుం గవఁబోలునీ...
.... ........ యల వీపునఁ దోచె నటంచుఁ జూచితిన్"

"ఓ రసికాగ్రగణ్యా! నువు ధడేల్న నన్నుగుద్దుకొని కావులించుకోగానే బంగారపు బొంగరాల్లాంటి నీ రెండు స్తనాలు గుచ్చుకొని నా వెన్నులోంచి వెనక్కి ఎంత బైటకు వచ్చాయా... అని చూస్తున్నాను-" అన్నాడట.

(దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి చాటుపద్య రత్నాకరం)

### స్త్రీలకు ఆస్తి హక్కునిచ్చిన తెలుగువాడు

# లొల్ల లక్ష్మీధర పండితుడు

ఒరిస్సాని పరిపాలించిన కళింగ గజపతులు విజయవాడ వరకూ విస్తరించారని చరిత్ర చెప్తుంది.

గజపతులలో చివరివాడైనప్పటికీ ప్రతాపరుద్ర గజపతి పేరెన్నిక గలవాడు.

ఆయన ఆస్థానంలో లొల్ల లక్ష్మీధర పండితుడనే కవి "సరస్వతీ విలాసం" అనే సామాజిక శాస్త్రపరమైన గ్రంథాన్ని రాశాడు. ఇందులో న్యాయాలు, చట్టాలు, ధర్మాలు అనేకం వున్నాయి కాబట్టి, గ్రంథానికి ప్రాచుర్యం రావడం కోసం ఈ గ్రంథాన్ని ప్రతాపరుద్రుడే రాశాడని ప్రకటించాడుగానీ, అది లక్ష్మీధరుడే రాసిన గ్రంథం అని విమర్శకులు తేల్చారు. తెనాలి తాలూకా అనంతవరం గ్రామాన్ని గజపతులు ఈ కవిగారికి అగ్రహారంగా ఇచ్చినట్లు శాసనం వుంది.

లక్ష్మీధర పండితుడు అప్పటివరకూ యాజ్ఞవల్క్యుడు. మునుపు ఇతర ధర్మశాస్త్రాలను కాదని అనేక విషయాలను ఆధునిక జన జీవితానికి అనుగుణ్యంగా రూపొందించాడు సరస్వతీ విలాసం గ్రంథాన్ని.

"ఒకడి దగ్గర ఒక వస్తువు వున్నంత మాత్రాన అది అతనిదే కాదు. ఎవరిదో ఆస్తి ఎత్తుకొచ్చిన వాడి చేతిలో అది వుండటం లేదా? అంచేత, స్వాధీనంలో వుండడం మాత్రమే కాక, అధికార పత్రాల ద్వారా ఆస్తిహక్కు నిరూపించబడాలంటుంది సరస్వతీ విలాసం.

వారసత్వం, కొనడం, పంచుకోవడం, తీసుకోవడం, దొరకడం... ఇలా ఎలాగైనా ఆస్తిని సంపాదించుకోవచ్చు -

దొరకడం అంటే నిధుల రూపంలో లభించేదనీ, తెచ్చుకోవడం అంటే ఆడవుల్లో దొరికే కలప, గడ్డి, వంట చెరకు లాంటివి ఏరుకొని తెచ్చుకోవడం అనీ స్పష్టమైన తేడాని ఆయన నిర్దేశించాడు.

దీనిని బట్టి, ఆస్తి మీద వ్యక్తిగత హక్కుని న్యాయశాస్త్రం అంగీకరించినట్టే లెక్క!

అది కేవలం భౌతిక కారణాల వలనే వస్తోంది. అందుచేత వారసత్వ నిర్ధారణ హేతుబద్ధంగా జరగాలి గాని, దైవిక కారణాల వలన జరిగేదిగా వుండకూడదు - అంటాడు లక్ష్మీధర పండితుడు.

దీని ప్రకారం తల్లి దండ్రుల ఆస్తి వారు జీవించి వుండగా పంపిణీ జరగకూడదు. తండ్రి వృద్ధుడై కొడుకుల మీద ఆధారపడి జీవిస్తున్నప్పుడు, ఆ కొడుకులు వత్తిడి చేస్తే ఆస్తి పంపకాలు జరగవచ్చు - అప్పుడయితే కొడుకులూ, కోడళ్ళూ, కూతుళ్ళూ సమాన వాటాలు వేసుకోవాలి... ఆయన మరణానంతరం అయితే కొడుకులు సమానంగా పంచుకొంటారు-" అనేది సరస్వతీ విలాసం సూచిస్తున్న మార్గం.

"భార్య అర్థ శరీరం. మంచి చెడులన్నింటిలో ఆమెది సమభాగం. భార్య బతికున్నదంటే అతని సగం శరీరం బతికున్నట్టే! సగం శరీరం బతికుండగా ఆస్తి మరొకరికి ఎట్లా వెడ్తుంది?

సంతానం లేకుండా చనిపోయిన వాడికి తల్లిదండ్రీ అన్నదమ్ములు అప్పచెల్లెళ్ళు ఎందరున్నా, అతని వాటా ఆస్తి అతని భార్యకే చెల్లుతుంది-" అని స్పష్టంగా నిర్దేశించాడు లక్ష్మీధరుడు.

భర్త ఆస్తిలో గానీ, తండ్రి ఆస్తిలో గానీ, ఆఖరికి తల్లి ఆస్తిలో కూడా కూతురుకు వాటా వుంటుందని, అది జన్మహక్కనీ,... స్పష్టీకరించాడు లక్ష్మీధరుడు.

కృష్ణానదికి గుంటూరు జిల్లా వైపు ఒడ్డున 'కొల్లూరు' గ్రామం లక్ష్మీధర పండితుడిది. కొల్లూరుకు రేవుకి ఇటువైపున ఆంధ్ర మహావిష్ణువు వెలిసిన శ్రీకాకుళం వుంటుంది.

గజపతుల్ని కృష్ణరాయలు జయించిన తర్వాత బెజవాడ నుంచి శ్రీకాకుళం వెళ్లి అక్కడ ఆంధ్ర మహావిష్ణువును సందర్శించుకొన్నాడు రాయలు. ఆంధ్ర మహా విష్ణువు ప్రేరణతోనే ఆముక్తమాల్యద కావ్యరచనకు ఇక్కడ బెజవాడలో శ్రీకారం చుట్టాడని చెప్తారు.

లక్ష్మీధర పండితుడి పాండితీ ప్రకర్ష విని ఆయన్ని తన ఆస్థాన కవులలో ఒకరిగా చేసుకొన్నాడురాయలు.

**(కంభంపాటి ఆంధ్రుల సంస్కృతి చరిత్ర - రెండవ భాగం)**

# అరిస్టాటిల్ - కౌటిల్యుడు

కౌటిల్యుడు, అరిస్టాటిల్ ఇంచుమించు సమకాలికులు. ఇద్దరూ ఒకే తరహా సిద్ధాంతాలతో, ఒకే తరహా ఆదర్శాలతో ఇంచుమించు ఒకేరకంగా జీవించారు.

అరిస్టాటిల్ శిష్యుడు అలెగ్జాండర్. అతన్ని ప్రపంచ విజేతని చేయడం, రాజనీతిని ప్రపంచం అంతా ప్రవేశ పెట్టడం అరిస్టాటిల్ లక్ష్యం.

కౌటిల్యుడి శిష్యుడు చంద్రగుప్తుడు. అతన్ని మగధకు రాజుని చేసి విశాల భారతదేశాన్ని రూపొందించడం, ధర్మబద్ధమైన పాలనతో జాతిలో జాతీయతని రగిలించడం కౌటిల్యుడి లక్ష్యాలు.

అరిస్టాటిల్ క్రీ.పూ. 335లో ఏథెన్స్ నగరంలో ఒక విశ్వవిద్యాలయం నెలకొల్పాడు. 'రాజనీతి' (Politics) అనే పేరుతో వేర్వేరు సమయాలలో ఐదు పుస్తకాలురాశాడు.

"రాజ్యం అత్యుత్తమైన రాజ్యాంగ విధానం ద్వారా పాలించబడాలి. రాజ్య పాలకుడు సుస్థిరంగా వుండాలి. అతని అనుచరులైన అధికారులు కార్యనిర్వహణాదక్షులే కాక సద్గుణాలు కలిగివుండాలి–" అంటాడు అరిస్టాటిల్.

కౌటిల్యుడు కూడా తన చుట్టు పక్కల సంఘ రాజ్యాలలో లోపాలను దౌర్బల్యాలను గుర్తించి రాజ్యం సుస్థిరంగా వుండాలంటే, ఒకే వ్యక్తి సర్వాధికారాలతో పాలకుడిగావుండాలి. ఈ అధికారాలతో ధర్మానికి అనుగుణ్యంగా పాలకుడు నడుచుకోవాలంటాడు. ఏకనాయకత్వమే మంచిదంటాడు – వేదానుగుణమైన దండనీతే అన్ని శాస్త్రాలకూ ఆధారం అని కౌటిల్యుడు నొక్కిచెప్పాడు. రాజనీతి ఏదోక విధంగా రాజ్యం నడవడానికి మాత్రమే ఉద్దేశించిందిగా వుండకూడదంటాడు.

సమకాలీనులైన ఈ ఇద్దరి అభిప్రాయాలూ ఇంత దగ్గరగా వుండటం పరిశీలకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఒకే వ్యక్తి అరిస్టాటిల్ పేరుతో అలెగ్జాండర్ని కౌటిల్యుడి పేరుతో చంద్రుగుప్తుణ్ణి నడిపారా... అనిపిస్తుంటుంది!

ప్లేటో తరహా గణతంత్ర రాజ్య వ్యవస్థ మీద కౌటిల్యుడికి సదభిప్రాయం లేదు.

"ఐక్యమత్యంగా వున్నంతకాలం ఇవి బలంగానే వుంటాయి. అధికార కాంక్ష ప్రబలిందంటే ఇవి చెల్లాచెదురై పోతాయి. ఎందుకంటే ఇలాంటి వాటిలో బాధ్యత వహించేవాడు ఒక్కడూ వుండడు–" అన్నాడు కౌటిల్యుడు.

భారతదేశం ఫ్యూడల్ వ్యవస్థనుంచి, అనేక అవస్థల నుంచి నేటి రిపబ్లిక్‌గా మారినా, ఆనాటి అరిస్టాటిల్ కౌటిల్యుల ఆదర్శాలు పుస్తకాలకే పరిమితంగా వుండిపోయాయి. అయితే, వాటిని ఎవరూ తెరిచి చదవరు! అదే మన దౌర్బల్యం!!

**(పుల్లెల శ్రీరామచంద్రుడు : భారతీయ విజ్ఞానవేత్తలు)**

# పొగిడితేనే ప్రతిభ?

జటప్రోలు సంస్థానాధీశ్వరుడు సురభి వెంకట లక్ష్మారాయ బహద్దర్ జీవితాన్ని 1929లో వాజిపేయయాజుల రామసుబ్బారాయుడు రాశారు.

రాజావారి వినోదపు అలవాట్లు గురించి కవిగారు ఎలా రాశారో గమనించండి.

"సప్త వ్యసనములలో వేటయనున దొకటని మహాత్ములు ప్రయోగించినను, త్యాజ్యం బైనను (చెయ్యకూడని పని), ప్రస్తుత కొల్లాపురి నేతయగు శ్రీరాజా వేంకట లక్ష్మారావు బహద్దర్ వారు వేట యందారితేరితిరి...

"మహీపతులకు వేట యనునది ఒక్క క్రీడకు గాదు. స్వదేశ జనులను క్రూర మృగ బాధల నుండి వెడలించి ప్రాణదాన మొనర్చుట...కు"

"పరమ దయాళురగు తన్మహీపతులు... బాల్యమాది నేటి దనుక 139 పెద్ద పులులను దునుమాడిరని చారిత్రము వలన స్పష్టపడుచున్నది"

'వేట అనేది కేవలం మృగయా వినోదం అయితే హరిశ్చంద్రుడు ఎలా వేట కెళ్ళాడు...?"

"రాజావారు వేటకి వినోదం కోసం వెడితే కుందేళ్ళను చంపుతాడు గానీ, పెద్దపులుల్ని చంపుతాడా?" అని ఎదురు ప్రశ్నిస్తాడు.

"అట్టి సన్మాన్యుఁడు కొల్లాపుర జనులకు ప్రభువగుట వారి భాగ్యమేమని చెప్పవచ్చును? ఈ బహువ్యాఘ్ర వధ వారిని ప్రజారక్షణ మొనర్చెడు పావన చరిత్రులలో ప్రథముణ్ణి చేసింది-" ఇలా సాగింది ఈ పొగడ్తల పర్వం.

15-4-1928న రాజవారు చనిపోయారు.

రాజావారి జీవిత చరిత్ర పూర్తి చెయ్యక మునుపె ఆయన చనిపోవడంతో రాణీగారు ఆ సంగతి తెలిసి ఆ పుస్తకం పూర్తిచేసి అచ్చువేయమని చెప్పి,"మా సంస్థానమున నుద్యోగ మొసంగి తిమ"ని అభయం ఇచ్చినట్లు కూడా రాసుకున్నారు.

"చూచితిరా యీనాటి కాలంబున నింతటి యౌదార్య ముండుట సంస్తవనీయము (మెచ్చుకోదగినది)" అని పుస్తకాన్ని ముగించాడు కవిగారు.

# రఘురామయ్య జరీ కండువా

ఇద్దరు మహానటులు ఒకే వేదిక మీద నటిస్తే చూసే వాళ్ళకి కన్నులపండుగే

పద్మశ్రీ స్థానం నరసింహారావు గారు చిత్రాంగి వేషాన్నీ, ఈలపాటి రఘురామయ్య గారు సారంగధరుడి వేషాన్నీ వేశారు - ఒక నాటక ప్రదర్శనంలో!

సారంగధరుడు పావురం కోసం చిత్రాంగి అంతఃపురంలోకి రావడం, చిత్రాంగి వలపు హొయలు చూపెట్టడం, అతడు తల్లివరస అవుతావని చెప్పి నిరాకరించి వెళ్ళిపోవడం. ఇదీ సీను. సారంగధరుడు వెళ్ళిపోయేముందు ఆయన భుజం మీద ఉత్తరీయం లాక్కుంది చిత్రాంగి.

రఘురామయ్యగారి అత్తవారు పెట్టిన కొత్త పట్టుజరీ ఉత్తరీయం అది. ఖరీదైంది. దర్జాగా వుంటుందని భుజాన వేసుకొని స్టేజీ మీద కొచ్చాడు. దాన్ని కాస్తా చిత్రాంగి వేషంలో వున్న స్థానం వారు లాక్కొన్నారు. అక్కణ్ణించి సీను మారి పోయింది -

చిత్రాంగి ఆ ఉత్తరీయాన్ని పట్టుకొని - సారంగధరుడిగా భావిస్తూ, వలపులు ప్రదర్శించడం మొదలెట్టింది. జరీ ఉత్తరీయం మీద చిలిపిగా చిటికెలు వేయడం, ముద్దులాడినట్లుగా అభినయించడం ఆ ఉత్తరీయం ఏదో అంటున్నట్లుగా భావించి సిగ్గుపడటం... ఇలాంటి నటనా విశేషాలు అత్యద్భుతంగా ప్రకటించింది... చిత్రాంగి. అక్కణ్ణించి అలగడం మొదలుపెట్టింది. ఆ అలకలో తళుకులెన్నో చూపించింది. స్టేజీ సైడ్‌వింగ్‌లో తెరచాటు నుంచుని తన జరీ ఉత్తరీయం గురించి బాధపడసాగారు రఘురామయ్య గారు.

అలక కోపంగా మారింది. ఉత్తరీయాన్ని వుండగా నలిపి నేలకేసి గిరాటు కొట్టింది..

"అయ్యో.... అయ్యో..." అంటున్నారు రఘురామయ్యగారు, తన జరీ ఉత్తరీయం నలిగి పోతోందని! ఉత్తరీయం బాధ ఉత్తరీయానిది!

కసి తీరా కాలితో తొక్కడం మొదలుపెట్టింది ఇంక చిత్రాంగి... ఆ ఉత్తరీయాన్ని.

రఘురామయ్య గారు లబలబలాడం అంతా ఓకంట గమనిస్తూనే వున్నారు స్థానంవారు - చిత్రాంగిలా ఇంత నాటకం ఆడ్తున్నా!

కింద పడివున్న ఉత్తరీయం తీసుకొని, అలా కోపం ప్రదర్శించినందుకు పశ్చాత్తాపం అభినయిస్తూ ఉత్తరీయాన్ని పైకి తీసి, దులిపి, జరీ అంచుల్ని అందంగా సరిచేసి -

క్షమించమన్నట్లు సైడ్ వింగ్‌లో వున్న రఘురామయ్య గారి వంక క్రీగంట చూస్తూ... ప్రియుడి మీద ఆరాధనని ఆ ఉత్తరీయంతో దాదాపు పావుగంట సేపు అభినయించారట... స్థానం వారు.

తెలుగు నాటక రంగానికి తొలిసారిగా పద్మశ్రీ గౌరవం సాధించిన మహానటుడు స్థానం నరసింహారావుగారు.

(స్థానం వారి స్థానం సంకలనం)

# ఆరోజు ... ప్రకాశంగారి కార్‌డ్రైవర్...

ప్రకాశంగారు రాజకీయరంగప్రవేశం చేసేనాటికే మద్రాస్ ప్రావిన్స్‌లో న్యాయవాదిగా అమితమైన కీర్తిప్రతిష్టలతో పాటుకోట్లాది రూపాయిల ఆస్తిని కూడా సంపాయించుకున్నాడు.

రిక్షాపుల్లర్ నుంచి రాక్‌ఫెల్లర్ వంటి వ్యక్తులదాకా అందరితోనూ సమాన స్థాయిలో వ్యవహరించే వాడాయన.

సామాన్య ప్రజానీకంలో కూడా పేదప్రజల న్యాయవాదిగా ఆయనకు పేరుండేది.

ఆయన మాట సౌమ్యంగా వుండేదిట. పుల్లవిరుపుగానో, కొట్టినట్టుగానో, కరిచినట్టుగానో ఆయన మాట్లాడేవాడుకాదు. కానీ, మాట్లాడిన ప్రతిమాట వెనక మహాపర్వతం అంత దృఢనిశ్చయం వుండేది. ప్రకాశం బలం ఆయన గుండె బలమె - అనేవారు జనం ఆరోజుల్లో.

ఆనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ప్రకాశం ప్రకాశించే అద్భుత తార! ఆయన రాజకీయాలలోకి రాకమునుపే న్యాయవాదిగా లబ్ధప్రతిష్టుడు. నేటిసినీ తారల కన్నా ఆరోజుల్లో ప్రకాశంగారికి అభిమానుల ఎక్కువగా వుండేవారు.

ఒకరోజు కొచ్చిన్ నుంచి కోయింబత్తూర్‌కు ఆయన త్వరగా చేరుకోవాల్సివుంది. ఎవరో కారు ఏర్పాటు చేశారు.

కోయింబత్తూరు చేరాక, చక్కగా కారు నడిపినందుకు డ్రైవర్‌కు ధన్యవాదాలు చెప్తూ జేబులోంచి డబ్బులు తీసి టిప్ ఇవ్వబోయి, డ్రైవర్ వంకచూశాడు.

ఆశ్చరంగా "మీరా?" అనడిగారు ప్రకాశం!

"సార్! మీతో కలిసి ప్రయాణం చేసే అదృష్టం నాకు కల్గింది ధన్యవాదాలు" అన్నాడు డ్రైవర్- ఆయన సాక్షాత్తూ కొచ్చిన్ యువరాజు!

(వి.రాజేశ్వరరావు రాసిన NBT వారి టి. ప్రకాశం అనే చిన్న పుస్తకం)

# గాంధీ దక్షిణాఫ్రికా ప్రయాణం

**జీ**వితంలో మొదటిసారి భంగపడ్డారు గాంధీ.

లండన్ బార్ - ఎట్ - లా పూర్తిచేసుకొని బాంబాయివచ్చి ప్రాక్టీస్ పెట్టాలని మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ ప్రయత్నిస్తున్న రోజులు. గాంధీగారి ప్రజా జీవితానికి అవి మొదటి రోజులు. పాతికేళ్ళ ప్రాయంలో వున్నాడాయన.

పోరుబందరు గాంధీగారి జన్మస్థలం. పోరుబందరు సంస్థానాధీశుడు రాణాసాహెబ్ ఇంకా సింహాసనంలోకి రాకమునుపు గాంధీగారి అన్నగారు రాణాగారికి సలహాదారుగా వుండేవాడు. ఈయన ఇచ్చిన సలహా ఏదో రాణాగారికి బెడిసికొట్టింది. తనకు తప్పుడు సలహా ఇచ్చాడని కేసుపెట్టాడు రాణా. అప్పట్లో బ్రిటిష్ వారి తరపున పొలిటికల్ ఏజెంట్‌లు జడ్జి కుండే అన్ని అధికారాలతో పెత్తనం చెలాయించేవారు. ఈ కేసు ఓ పొలిటికల్ ఏజెంట్ దగ్గరకు వెళ్లింది.

సదరు పొలిటికల్ ఏజెంట్ గాంధీగారికి ఇంగ్లండ్‌లో వున్నప్పుడు పరిచయం.

ఆ పరిచయాన్ని ఉపయోగించి, తన గురించి నాలుగు మంచి మాటలు చెప్పమని అన్నగారు గాంధీని వత్తిడిచేశాడు. గాంధీగారు సరేననక తప్పలేదు.

"మన పరిచయాన్ని దుర్వినియోగం చేయవద్దన్నట్లు మాట్లాడాడు పొలిటికల్ ఏజెంట్.

గాంధీ తన అన్న గురించి ఏదో చెప్పబోయాడు.

"అయితే దయచేసి మీరు వెళ్ళిపోండి-" అన్నాడు గట్టిగా పొలిటికల్ ఏజెంట్. గాంధీ ఇంకా చెప్పాలనే ప్రయత్నించాడు.

"మీరు వెంటనే బయటకు వెళ్ళకపోతే నేనే పంపించవలసి వుంటుంది" మరింత కటువుగా అన్నాడతను. "మీ అన్న కుట్రదారుడు! అతని గురించి మీరు నాతో ఏమీ చెప్పకండి" అరిచాడు ఏజెంట్.

"దయచేసి నేను చెప్పేది వినండి-" ప్రాథేయపడ్డాడు గాంధీ-

బెల్‌కొట్టి బంట్రోతుని లోపలికి పిలిచాడు పొలిటికల్ ఏజెంట్.

గాంధీగారు కదలకుండా అలానే నిల్చున్నాడు.

"ఈయన్ని బయటకు పంపించేయ్" అరిచాడు ఏజెంట్. బంట్రోతు దౌర్జన్యంగా గాంధీగారి భుజంమీద చేతులువేసి బయటకు లాక్కొచ్చేశాడు. ఆ తర్వాత, పొలిటికల్ ఏజెంట్ కోపంగా బైటకు వెళ్ళిపోయాడు.

గాంధీ అతని వెంట పరిగెడుతూ వెళ్ళి"- నా పట్ల మొరటుగా ప్రవర్తించారు. నన్ను అవమానించారు. బంట్రోతుతో నా మీద దౌర్జన్యం చేయించారు. చట్టపరంగా మీమీద చర్యతీసుకొంటాను" అని హెచ్చరించాడు గాంధీ!

గాంధీ మాటల్ని వాడు లెక్కచెయ్యలేదు. "నేను పొమ్మన్నా పోకుండా నిలబడడం వలన బలప్రయోగం తప్పలేదు. కనక నీ యిష్టం వచ్చిన చర్య తీసుకోవచ్చు-" అని నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు.

'సర్ ఫిరోజ్ షా మెహతా' అప్పట్లో ప్రసిద్ధుడైన న్యాయవాది. దేశభక్తుడు. ఆయన్ని సంప్రదించాడు గాంధీ - తనను అవమానించిన పొలిటికల్ ఏజెంట్ మీద చర్య గురించి!

ఫిరోజ్‌షా మెహతా నవ్వుతూ గాంధీని సముదాయించాడు "వకీళ్ళకు బారిస్టర్‌లకూ ఇలాంటివి జరగడం మామూలే! చేపట్టిన ప్రతికేసులోనూ ఒకసారైనా ఈ అనుభవం వుంటుంది. ఉడుకునెత్తురు కాబట్టి కాస్త బాధవుంటుంది. బ్రిటిష్ ఉద్యోగులు అంటే ఇలానే ప్రవర్తిస్తారు. వాటిని తట్టుకొని కార్యం సాధించాలి. ఇలా ఆవేశ పడకూడదు-" అని హితవు చెప్పాడాయన!

"ఈ సలహా నాకు విషప్రాయంగా తోచింది. కానీ, నేను దానిని మింగి వూరుకొన్నాను. అవమానాన్ని భరించాను. దానివలన లాభంపొందాను కూడా! ఇంక ఎప్పుడూ ఇలాంటి దురవస్థలో పడకూడదు అనుకొన్నాను. స్నేహాన్ని ఈ విధంగా ఉపయోగించు కోకూడదని కూడా అనుకొన్నాను. ఈ సంఘటన నాజీవి తానికి పెద్ద షాక్ యిచ్చి గొప్పమలుపు తిప్పింది-" అని రాసుకొన్నారు గాంధీ తన ఆత్మకథలో ఈ విషయాల గురించి.

ఈ పొలిటికల్ ఏజెంట్ వున్నంతకాలం ఇంక అక్కడ తను న్యాయవాద వృత్తిచేయలేదు.

అందుకే దక్షిణాఫ్రికాకు వెళ్ళి అక్కడ న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించేందుకు అవకాశం వస్తే వెంటనే దాన్ని సద్వినియోగం చేసుకొంటూ ప్రయాణం అయ్యాడు గాంధీ.

దక్షిణాఫ్రికాలో గాంధీ కూలీల దేవుడిగా మారాడు. భారతీయులకు జాతిపితగా నిలిచేందుకు దక్షిణాఫ్రికాలో అంకురార్పణ అలా జరిగింది.

(ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ - సం : కొడాలి ఆంజనేయులు)

# కోలవెన్ను వారి వ్యక్తిత్వం

1910 షుమారుగా!

అది వ్యవహారభాషోద్యమానికి తొలిరోజులు. బుర్రా శేషగిరిరావు, గిడుగు సీతాపతి వంటి భాషా సంస్కరణ వాదులు వాడుకభాషని వ్యాప్తి చేయాలని పూనుకొన్నారు.

కవి పండితుల సంగతి అలావుంచితే, విద్యార్థులు కూడా ఎక్కువగా గ్రాంధికాభాషాభిమానులుగానే వుండడంతో వ్యవహార భాషావాదులకి సరయిన ప్రోత్సాహం దొరికేదికాదు.

ఒకసారి ప్రెసిడెన్సీ కాలేజీలో గిడుగు సీతాపతిగార్కు విద్యార్థుల్ని ఉద్దేశించి వాడుకభాషమీద ఉపన్యశిస్తున్నాడు.

ఆనాటి విద్యార్థుల్లో, కోలవెన్ను రామకోటేశ్వర రావుగారు కూడా వున్నాడు. ఈయనే ఆ తర్వాత త్రివేణి పత్రికని వ్యవస్థాపించారు.

విద్యార్థులు సీతాపతి గారిని లెక్కచేయడం లేదు. కానీ, సీతాపతి గారు ఆత్మవిశ్వాసంతో– "మీరిప్పుడు మా మాట లక్ష్యపెట్టడం లేదు గానీ భవిష్యత్తులో మా తీర్పు ప్రకారమే నడుచుకొంటారు –" అన్నాడు.

సరిగ్గా ఇవే మాటలు బేకన్స్‌ఫీల్డ్ ఒకసారి పార్లమెంట్‌లో అన్నాడు.

విద్యార్థిగా వున్న కోలవెన్ను రామకోటేశ్వరరావు ఆవేశంగా "మహా దిగావు లేవయ్యా... అభినవ బేకన్స్ ఫీల్డువి – " అని మాట విసిరేశాడు. దానికి సీతాపతిగారు చిన్నబుచ్చుకున్నారో లేదోగానీ, ఆ తర్వాత చాలాకాలంపాటు కోలవెన్ను వారు మాత్రం తన కుర్రచేష్టలకు పశ్చాత్తాప పడ్డాడు. ఆరోజునుంచీ ఎవర్నీ ఎప్పుడూ నువ్వు అని అగౌరవ వాచకంతో సంబోధించలేదాయన.

కాటూరి వెంకటేశ్వరావుగారు, అడవిబాపిరాజుగారూ విశ్వనాథ సత్యనారాయణగారూ, నండూరి సుబ్బారావుగారూ, బసవరాజు అప్పారావుగారూ మల్లంపల్లి సోమశేఖర్ శర్మగారూ వీళ్ళంతా కోలవెన్నువారికి ఆత్మీయులైన కవి మిత్రులు.

ఈ మహాకవులు ఒకరినొకరు చనువుగా 'నువ్వు' అనుకొనేవారుగాని కోలవెన్నువారిని మాత్రం 'ఏమండీ' – అనే పిలిచేవారు. ఆయన ఎవ్వరినీ 'నువ్వు' అని పిలవలేదు.

ఒకసారి అడవి బాపిరాజుగారు నవ్వుతూ–" ఏమండీ– మీరు ఎవ్వరినీ నువ్వనటం చూడలేదు. ఇంటిదగ్గర ఇల్లాలిని కూడా మీరనే మన్నిస్తారా... ఏమిటీ–" అనడిగారు.

"మీరనను గానీ, ఒసే, ఏమే - అని మాత్రం అనను –" అన్నారు కోలవెన్ను. "అత్యంత సన్నిహితులైన, ఆత్మీయులైన, మిత్రుల, వ్యక్తుల మధ్యకూడా వొక సంస్కారాన్నీ, వొక నడవడినీ, వొక వొద్దికనూ, వొక దిద్దితీర్చిన సుందర భావాన్నీ కాంక్షిస్తాను. అది బాగా అలవాటయింది. –"

1921లో మద్రాసులో ప్రకాశంగారు తన ఆస్తులన్నీ పణంగా పెట్టి నడిపిన 'స్వరాజ్య' పత్రికలో ఖాసా సుబ్బారావుగారితో కలిసి సహాయ సంపాదకుడిగా పనిచేశారు కోలవెన్ను.

ఒకసారి సర్ యస్. సుబ్రమణ్యఅయ్యర్ గురించి ఎవరో రాస్తూ, ఆయన రెండుసార్లు కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా వున్నారని ఉదహరించారట. ఇది పొరపాటనీ, ఆయనెప్పుడూ కాంగ్రెసధ్యక్షుడుగా వుండలేదనీ ప్రకాశం గారితో అన్నారు కోలవెన్ను.

"నీవప్పటికి పుట్టలేదు– నీకెట్లా తెలుసు?" అని చమత్కార ధోరణిలో వేళాకోళం చేశారట ప్రకాశం. నొచ్చుకున్నారు కోలవెన్ను

తర్వాత పొరపాటు తెలుసుకొని, కోలవెన్నునే వెళ్ళి ఆ పొరబాటు దిద్దమని పురమాయించారు ప్రకాశం.

"మొదట తొందరపడినా ఇతరుల మాటను మన్నించడం పంతులుగారి దొడ్డ గుణాలలో ఒకటిగా వుండేది–" అని వినయంగా తన జీవిత చరిత్రలో రాసుకొన్నారాయన. ఇది కోలవెన్ను వారి ఉన్నత వ్యక్తిత్వానికి నిదర్శనం!

కానీ, స్వరాజ్య పత్రికలోంచి బైటకువచ్చి భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి ఆహ్వానం మీద జాతీయ కళాశాలలో అధ్యాపకత్వం స్వీకరించారు కోలవెన్ను.

**(కోలవెన్ను వారి జీవితానుభవాలు)**

### చెన్నపట్నం మీద

# తెలుగువారిదే అధికారం

"ప్రళయ కావేరి మైలాపురంబుగల్మి
బీరమున బోర నది మట్టుబెట్ట
దండ్రి పేర దన్మధ్యభూమిని బృధువిభూతి
నల వరిచె చెన్న పట్టణ మయ్యనృపతి"

ప్రళయ కావేరి మైలాపూర్ దాకా వున్న ప్రాంతాన్ని ముంచెత్తు తున్నప్పుడు తండ్రిపేర చెన్నపట్టణాన్ని నిర్మించాలని 'అయ్యప్ప' అనే ప్రభువుకి ఆలోచన వచ్చిందని ఈ పద్యం భావం. అంకభూపాలుడనే రాజకవి 'ఉషాపరిణయం' లో రాసిన పద్యం ఇది.

ఈ మొత్తం కథ ఇది సంక్షిప్తంగా పరిశీలించండి!

కృష్ణదేవరాయలు మరణానంతరం బలహీనపడి, 1565 తళ్ళికోట యుద్ధంలో భంగపడిన విజయనగర సామ్రాజ్యం సామంతుడైన నాయకరాజులు చేసిన కుట్రల ఫలితంగా పూర్తిగా కుంటుపడింది.

కృష్ణరాయలి బంధువర్గం, ముఖ్యంగా ఆర్వేటి వంశస్థులు రాజ్యాధికారాన్ని కైవసం చేసుకొన్నారు గాని నిలబెట్టుకోగలిగే స్థితిలో లేకుండా పోయారు.

మొదట పెనుగొండకీ, తర్వాత చంద్రగిరికి రాజధాని మారింది.

1600 నాటికి చంద్రగిరిని పాలిస్తున్న వెంకటపతిరాయలు - దామెర చెన్నప్పనాయకుడు సహాయకుడిగా వేలూరు వరకూ మిగిలిన విజయ నగర సామ్రాజ్యాన్ని కొంతమేర శాంతిని నెలకొల్పి పాలిస్తున్నాడు.

ఇదిలావుంటే, నేటి మద్రాస్‌లోని మైలాపూర్ ఆరోజుల్లో చిన్న నగరంగా వుండేది. పోర్చుగీసువారు అక్కడ స్థావరం ఏర్పాటుచేసుకొని విదేశాలకు ఎగుమతులు చేసే వ్యాపారంలో వున్నారు. వాళ్ళకు పోటీగా డచ్ వారుకూడా వచ్చి, తమక్కూడా ఇలాంటి స్థావరం ఇమ్మని వెంకటపతిరాయల్ని అర్థించారు.

విదేశీ వర్తకుల వలన దేశంలో ముఖ్యంగా నేతపని వారికి చేతినిండా పని దొరకడం అనే ప్రయోజనం ఏర్పడింది. అందుకని, బాగా ఆలోచించి, ప్రజలకు అన్నోదకాలు కల్పించడమే రాజుగా తన బాధ్యత అని నిర్ణయించుకొన్నాడు. వేంకటపతిరాయలు పాలనాకావేరి - (ప్రళయకావేరీ) అంటే, నేటి పులికాట్ ప్రాంతాన్ని డచ్‌వారికి కౌలుకు

ఇచ్చాడు. అతని భార్య, గొబ్బూరి వారి ఆడపడుచు కొండమ్మ జమీలో వున్న చిన్న నగరం ఈ ప్రళయకావేరీ పట్నం ఇది 1610లో జరిగిన సంగతి.

కాలవశంలో చంద్రగిరి సింహాసనంమీద ఇద్దరు ముగ్గురు రాజులు మారి, చివరగా పెద్ద వేంకట పతిరాయలు అధికారంలోకి వచ్చాడు.

ఈ పెద్ద వేంకటపతి రాయలుకి సామంతుడిగా పులికాటు మొదలు కడలూరు వరకూ వున్న ప్రాంతాన్ని "దామర" వెంకటప్పా నాయకుడు' పాలిస్తున్నాడు. చరిత్ర ప్రసిద్ధిచెందిన చెన్నప్పనాయకుడి కొడుకు ఇతను. ఈయన తమ్ముడు అయ్యప్పనాయకుడు పూనమల్లి' రాజధానిగా, ఇప్పటి చెన్నై నగరం వున్న ప్రాంతానికి అధికారి వ్యవహరిస్తున్నాడు, ' తండియార్ పేట, రాయపురం, తిరువళ్ళిక్కేణి, చింతాద్రిపేట, మైలాపూరు, కీల్పాకు, పెరంబూరు, మంగంబాకం, మాంబళం ఇవన్నీ ఆకాలంలో పెద్ద వూళ్ళుగానో, చిన్నపాటి పట్టణాలుగానో వుండేవి.

తనతండ్రి పేరుతో చెన్న సాగరం అనే తటాకాన్ని ఉత్తర ఆర్కాడ్ జిల్లాలో తవ్వించాడు వెంకటప్పనాయకుడు.

దామెర వెంకటప్ప నాయకుడి తమ్ముడు అయ్యప్పనాయకుడి ఏలుబడిలో వున్న నేటి మద్రాసు ప్రాంతంలో పోర్చుగీసులు, డచ్‌వారు చీటికీ మాటికీ తగువులు పడుతూ ప్రజలకు పెద్ద తలనొప్పిగా మారారు. వీళ్ళిద్దరి పీడా వదిలించుకోవాలంటే, ఇంకో పెద్ద వ్యాపారిని తెచ్చి ఇక్కడ పెడితే తప్ప లాభంలేదని ఆలోచించడం మొదలు పెట్టాడు అయ్యప్పనాయకుడు.

నౌకాబలం ఎంత ఎక్కువగా వుంటే విదేశీ వాణిజ్యం అంత ఎక్కువగా జరపవచ్చనీ, తన నౌకాబలాన్నీ పెంచుకొనేలా ఆలోచనలు చేయాలనీ పావులు కదల్చడం మొదలుపెట్టాడు.

ఆధునిక స్పిన్నింగ్ యంత్రాలు కనుగొనేదాకా, ఢాకా, సూరత్ మగ్గాలకు పోటీలేదు అప్పట్లో! ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోదలిచాడు ముందుగా తమ తండ్రిపేరుతో సముద్ర తీరంలో 'చెన్నపట్నం' అనే నగరాన్ని కట్టించడం ప్రారంభించి అచిరకాలంలోనే పూర్తి చేశాడు! సముద్రరేవు కల్గిన నగరాన్ని పట్నం అంటారు. చెన్నప్పనాయకుడి పేరున చెన్నపట్నం ఏర్పడింది.

(1) తన సొంత నౌకని విదేశాలకు పంపగలగాలి.

(2) విదేశీనౌకలు భారత సరుకుల్ని తీసుకువెళ్ళేప్పుడు స్థానికులు కూడా

వాటితోపాటు విదేశాలకు వెళ్ళాలి. అంటే, విదేశీ నౌకలు కేవలం కిరాయి నౌకలుగా మాత్రమే వ్యవహరించాలి.

(3) వర్తక వాణిజ్యాల్ని యూరోపియన్ పద్ధతుల్లో మనంకూడా అభివృద్ధి చేసుకోవాలి....

ఇవే ఆనాటి అయ్యప్ప నాయకుడి మదిలో గూడుకట్టుకున్న ఆలోచనలు.

ఇందుకు అన్నగారు దామెర వేంకటప్పానాయకుడి ప్రోద్బలం. చంద్రగిరి ప్రభువు పెదవేంకటపతి రాయలు అనుమతి కూడా లభించాయి.

ఈ షరతులన్నింటికీ ఒప్పుకున్నాక 1639లో, ఆంగ్లేయుల అభ్యర్థనమేరకు చెన్నపట్టణంలో వారికి ఆశ్రయం కల్పించాడు అయ్యప్పనాయకుడు.

ఆంగ్లేయుల ప్రవేశం తర్వాత జరిగిన పరిణామాలన్నీ అందరికీ తెల్సినవే!

కానీ, ఈ కథకు కొసమెరుపు వుంది-

చంద్రగిరిలో పెద్ద వెంకటపతిరాయలు తర్వాత శ్రీరంగరాయలు రాజ్యాధికారంలోకి వచ్చాడు. ఈ కొత్తరాజుగారికీ దామెర సోదరులకీ సయోధ్య కుదరకపోవడం వలన, చెన్నపట్నాన్ని పేరుమార్చి తన పేరుతో "శ్రీరంగరాయపట్నం" అని పిలవాలని శాసించాడు.

దామెర సోదరులు రాజనీతి తెలిసినవారు. వ్యతిరేక పరిస్థితుల్ని సరిదిద్ది కార్యాన్ని సాధించగలిగారు. మొత్తంమీద, కొంతకాలం వైరంనడిచినా రెండు మూడేళ్ళలో రాజుగారిని శాంతింపచేశారు.

1642లో శ్రీరంగరాయలు కొత్త ఫర్మానా రాయించి విడుదలచేశాడు. అందులో విశేషాలు ఇవీ...

(1) ఇది తెలుగు సార్వభౌముడైన శ్రీరంగరాయలవారు దయ చేయించిన రాజశాసనం

(2) చెన్నపట్నము అనే నగరం....

(3) ఇందలి దేవాదాయబ్రహ్మాదాయములు అవిచ్ఛిన్నంగా అమలు జరపాలి.

(4) మరిన్నీ - ఈ స్థలాన్ని ఎల్లప్పుడున్నూ తెలుగుపట్నంగా గౌరవప్రపత్తులతో చూచుకుంటూ ఉండవలెను.

సరిగ్గా 310 సంవత్సరాలు తిరిగేసరికి తెలుగువారు శాశ్వతంగా చెన్నపట్నాన్ని కోల్పోయారు.

**(రామచంద్రుని వెంకటప్ప - మద్రాసునగరం, తెలుగుపట్నం)**

భారతదేశపు మొదటి సోషలిస్ట్

# మేడమ్ కామా

జాతియోద్యమంలో విప్లవాత్మక పాత్ర వహించిన తొలితరం నేతల్లో మేడమ్‌కామా ముఖ్యులు.

1861లో పార్శీ కుటుంబంలో ఆమె పుట్టింది. పార్శి కుటుంబాలు కట్టుబాట్లకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తాయి. కానీ, 'బికాజీ రుస్తుమ్ కామా' పదిహేనేళ్ళ సంసారజీవితాన్నీ, కన్నవారిని, అత్తవారినీ అందరినీ వదిలేసి ప్రజా పోరాటాల్లోకి నేరుగా ప్రవేశించింది.

భర్త రుస్తుమ్ కె.ఆర్.కామా కన్జర్వేటివ్ మనస్తత్వం కలవాడు. ఈ దేశాన్ని మరోవందేళ్ళు బ్రిటిష్‌వాళ్ళు పరిపాలిస్తేగానీ బాగుపడదని దృఢంగా నమ్మేవాడు. అలాంటి వ్యక్తితో తాను కాపురం చేసేదిలేదని బైటకువచ్చేసింది – కామా!

పుట్టింటి వారిక్కూడా ఆమె నిర్ణయం నచ్చలేదు. తమ్ముడు ఆర్దర్‌షీర్ పటేల్ అక్కగారిమీద నిందులు తొక్కాడు. ఆడది బజార్న పడి సాధించేదేమిటి? అన్నాడు.

"బ్రిటిష్ వారిని కాదని ఈ ప్రపంచంలో ఎక్కడికీ పోలేం" అనేది ఆనాటి మధ్యతరగతి, పై తరగతి ప్రజల నమ్మకం. సాధ్యమైనంత వరకూ ప్రభుత్వానికి ఆగ్రహం కలగకుండా తమ ధనమాన ప్రాణాలకు ఇబ్బంది లేకుండా మనుగడ సాగించాలనే ధ్యేయంతో వుండేవారు.

ఆరోజుల్లో రాజకీయ రంగంలోకి వచ్చినవారు అటు బ్రిటిష్ ప్రభుత్వంతోనూ, ఇటు సొంత కుటుంబ సభ్యులతోనూ పోరాడ వలసివచ్చేది.

మేడమ్ కామా 1902లో లండన్ చేరుకున్నారు. దాదాభాయ్ నౌరోజీతో కలసి పనిచేశారు

నిజానికి, 1896 వరకూ సరోజినీ నాయుడు లండన్‌లో వున్నా ఎటువంటీ రాజకీయ కార్యక్రమాల్లోనూ పాల్గోలేదంటారు. కానీ, మేడమ్ కామా బ్రిటన్‌వస్తూనే విప్లవ కారులతో చేతులు కలిపారు. వినాయక సావర్కార్ వంటి యోధులు ఆమె సహచరులు అయ్యారు.

1907లో బ్రిటిష్ ప్రభుత్వం ఆమెపైన ఆంక్షలు విధించడంతో పారిస్‌కు తరలివెళ్ళారు.

వినాయక సావర్కార్ తుపాకులతో సహా బ్రిటిష్‌పోలీసులకు దొరికిపోయినప్పుడు, ఆ నేరాన్ని తనపైన వేసుకొని వాటిని పారిస్‌నుంచి తానే పంపినట్లు సాక్ష్యం చెప్పింది మేడమ్ కామా! తద్వారా ఇతర విప్లవ యోధుల్ని రక్షించడం ఆమె ధ్యేయం.

మొట్టమొదటి భారతీయ మహిళా సోషలిస్ట్‌గా ఆమె ఘన చరిత్ర అద్భుత సాహసాలతో ఉత్తేజపూరితంగా వుంటుంది.

1907 ఆగస్ట్ 16న స్టుటగార్ట్‌లో జరిగిన సోషలిస్ట్ ఇంటర్నేషనల్ కాంగ్రెస్‌లో రష్యా సామాజిక విప్లవాన్ని భారతీయులు ఆదర్శంగా భావిస్తున్నారనీ, భారత స్వాతంత్ర్య సమరానికి లెనిన్ నడిపిన కమ్యూనిస్ట్ ఉద్యమాలు ప్రేరణగా వుంటాయని ప్రకటించి అంతర్జాతీయ మేధావుల దృష్టిని ఆమె ఆకర్షించారు. జాతీయజెండాని స్వయంగా రూపొందించి ఈ సభలో ఆవిష్కరించి ఆమె అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తారు. మొదటిసారిగా జాతీయ జెండా ఎగిరింది ఈ సభలోనే అదీ విదేశీ గడ్డమీద -! ఫ్రెంచి మహా విప్లవోద్యమంలో ఆమె కూడా సభ్యురాలు 'వందేమాతరం' అనే పత్రికని నడిపారు.

భారత జాతీయోద్యమానికి అనుకూలంగా అంతర్జాతీయ ప్రతిస్పందనని సాధించడంకోసం ఆమె చేసిన కృషి గొప్పది! గాంధీగారు రాజకీయాల్లోకి వచ్చేసరికి ఇవన్నీ ఆయనకు అనుకూలించిన పరిస్థితులు.

అంతర్జాతీయ స్థాయిలో అలా ఆమె అందర్నీ అధిగమించి సోషలిస్ట్ పెనుఉద్యమానికి నాయకత్వం వహించేస్థాయికి ఎదిగినా ఆమె తమ్ముడు ఆర్దర్ షీర్ పటేల్‌కి, ఆమెపట్ల పెంచుకున్న ద్వేషభావం తగ్గలేదు.

తనకున్న స్త్రీ ద్వేషమే కారణం కావచ్చు పెళ్ళి చేసుకోకుండా బ్రహ్మచారిగావుండి పోయాడు. వ్యాపార దక్షతతో కోట్లు గడించాడు. కానీ, అక్కగారి ఆదర్శంకోసం పైసా వెచ్చించలేక పోయాడు. మొత్తం తన యావదాస్తినీ బంధువర్గంకోసమే ఖర్చుచేశాడు.

ఆఖరికి మంచానపడ్డాడు. ఆస్తులైతే పంచుకున్నారు గానీ గుక్కెడు మంచినీళ్ళిచ్చే బంధువు ఒక్కడూ మిగలకుండా పోయాడతనికి!

చేసిన తప్పు గుర్తించాడు. మనిషిగా పుట్టినందుకు మాతృభూమికోసం తపనపడకపోవడం తన పాపంగా భావించాడు. పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు. సమస్త శక్తులూ కూడగట్టుకొని పారిస్‌లో వున్న అక్కగారిని ఆశ్రయించాడు చివరికి ఆమె చేతులమీదుగానే ప్రాణాలు వదిలాడు!

జీవితం చరమాంకంలోనైనా మాతృభూమి గురించి ఆలోచించే అవకాశం అతనికి దొరకడం అతని జీవనగాథలో ఓ కొసమెరుపే!

ఎందరో వ్యథార్తులను అక్కున చేర్చుకున్న మాతృమూర్తి మేడమ్ కామా! దుఃఖభాజనులైన మానవులంతా ఆమెకు పుత్రులే! ఈ పటేల్ కూడా వారిలో ఒక్కడు!! 1936లో మేడమ్ కామా పారిస్‌లోనే కన్నుమూశారు.

**(బులురాయ్ చౌధురి ఆంగ్లగ్రంథం మేడమ్‌కామా ఎ షార్ట్ లైఫ్ స్కెచ్)**

# కవిత్వం షాట్లు

**1856** - ఆ ప్రాంతంలో తిరుమల బుక్క పట్టణం చినతాతాచార్యులు అనే ఆయుర్వేద వైద్యుడుండేవాడు. ఈ డాక్టర్‌గారు మంచి కవి కూడా "విశ్వగుణాదర్శము" అనే కావ్యాన్ని రాశాడు.

మనిషి సౌమ్యుడేగానీ, కోపం వస్తే బూతులు విపరీతంగా వచ్చేవి. సహజంగా కవి కాబట్టి ఆయన తిట్లుకూడా అందమైన కవిత్వంలాగా వుండేది. అచ్చన్న అనే పెద్ద మనిషి ఈయన దగ్గర మందుపుచ్చుకొని, రోగంకుదిరాక ఇస్తానన్న ఫీజు ఎగ్గొట్టాడట. దాంతో కడుపు మండి ఏ రాజుగారికో చెప్పి శిక్షవేయించి వుంటాడు - ఆయన చెప్పిన ఈ పద్యం చూడండి -

"పచ్చడము దుప్పటాయెను, విచ్చలవిడి తులసి పత్రి విడియంబాయెన్
అచ్చల నగుఁబాటాయెను, అచ్చన్నా! నీదు కీర్తి యిట్టిట్టాయెన్."

జమీందారులు కప్పుకొనే ఖరీదైన పచ్చడం చింకిదుప్పటిగా మారింది. కర్పూర తాంబూలం వేసుకొనే వాడివి - తులసాకులే ఏరుకొచ్చుకొని నములుతున్నావు. వూళ్ళో పెద్దలదగ్గర పరువుపోయి నగుబాటయ్యావు - అచ్చన్నా! నీ కీర్తి ఇట్టిట్టాయె గరా..." అని!

ఒకసారి మతుకు మల్లి శాస్త్రి అనే మిత్రుణ్ణి కొంచెం ముక్కుపొడుం వుంటే పెట్టమని అడిగాడట ఆయన ఏ ధ్యాసలో వున్నాడో... లేదు పొమ్మన్నాడు.

అంతే! తాతాచార్యులుగారికి కోపం నషాలానికి అంటి

"శాస్త్రుర్లఁట యీనీచుడు
పాస్తొత్తుల మగఁడు వీని పరువేమో
కాస్తంత నస్యమడిగిన
నాస్తేయని పలుక వీని నాలుకపీఁకా" అనే పద్యం చెప్పాడు.

అవతలి వాడూ తక్కువ వాడుకాదు - వెంటనే అంతే ఘాటుగా సమాధానం చెప్పాడు.

"అహహ తిరుమల వంశంబు నడివిఁగలిపి,బుక్క పట్టణ మంతయు బూది చేసి
కొంటె కూఁతలు నేరుచు కొంటివౌర, కుటిల తిరుమల తాతన్న! కొంటెదున్న!!"

శ్రీమాన్ తిరుమల బుక్క పట్టణము చిన తాతాచార్యుల వారికి గుక్క తిప్పుకోవడానికి కొంచెం సేపు పట్టి వుంటుంది!!

(తెలుగులో తిట్టుకవిత్వం - రావూరు దొరస్వామి శర్మ)

కాంగ్రెస్‌లోంచి

# సుభాష్ చంద్రబోస్ నిష్క్రమణం

**అవి 1939** జనవరి 30న కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఎన్నికలు జరుగుతున్నాయి.

సుభాష్ చంద్రబోస్ తిరిగి ఎన్నిక కావడం కోసం పోటీపడ్తున్నాడు. తెలుగువాడైన డా॥భోగరాజు పఠాభి సీతారామయ్యగారు గాంధీగారి మనిషిగా ఆయనని ఎదుర్కొంటున్నారు. పట్టాభిగారు మచిలీపట్నం వాస్తవ్యుడు

సుభాష్ చంద్రబోస్ రంగప్రవేశంతో కాంగ్రెస్‌లో రైట్ వింగ్, లిఫ్ట్ వింగర్ అనే రెండు భిన్నమైన ధృవాలు అనదగిన గ్రూపులు మొదలయ్యాయి. రైట్‌వింగ్ పూర్తి గాంధేయవాదులది. లెఫ్ట్ వింగ్‌లో తీవ్రవాదం, సోషలిజం, రష్యా అనుకూలత జర్మనీ వ్యతిరేకత వంటి అనేక అభిప్రాయాలున్నవాళ్ళు వుండేవాళ్ళు. సంఖ్యాపరంగా వీరి బలం తక్కువే.

గాంధీగారు "పట్టాభి ఓటమి - నా ఓటమి" అని, బహిరంగంగానే ప్రకటించినా కూడా సుభాష్‌బాబు వ్యక్తిగత ఆకర్షణ ఆరోజున గాంధీ ఆకర్షణతో పోటీపడింది! ఇది చారిత్రాత్మకమైన అంశమే! ఎన్నికల్లో సుభాష్ చంద్రబోస్ 203 ఓట్ల తేడాతో రెండవసారి కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడిగా గెలుపొందాడు.

అసలు కథ ఇక్కణ్ణించి మొదలయ్యింది.

"నా మాటకు, నా ఆదర్శాలకూ, నా సిద్ధాంతాలకూ విలువలేనప్పుడు కాంగ్రెస్‌లో నేను నామమాత్రుణ్ణి అయ్యాను- నా సిద్ధాంతాలు మైనారిటీగా మారాయి. ఇన్నాళ్ళుగా నా సిద్ధాంతాలపైన విశ్వాసం వున్నవారు, బోసుగారి సిద్ధాంతాలతో ఏకీభవించలేని వారూ నిరభ్యంతరంగా కాంగ్రెస్‌లోంచి బైటకు వచ్చేయండి!" అని పిలుపు ఇచ్చాడు గాంధీ.

దానికి సుభాష్ బోస్ - "కాంగ్రెస్‌లో చీలిక తెచ్చామన్న అపప్రధని లెఫ్టిస్టుల మీదకు నెట్టకండి. చీలిక 'మావల్ల' కాదు - 'మేం ఉన్నప్పటికి కూడా' అనివార్యం అయ్యింది. - అనండి -" అన్నాడు. దేశప్రజల విశ్వాసాన్ని పొందాను - మెజారిటీ కాంగ్రెస్‌వాదుల విశ్వాసాన్ని పొందాను. కానీ, దేశంలోనే ప్రముఖ వ్యక్తి గాంధీజీ విశ్వాసాన్ని పొందలేకపోయాను-" అని బాధపడ్డాడు బోస్.

వారం రోజులు గడిచింది ఎన్నికలు జరిగి -

ఫిబ్రవరి 8న జవహర్‌లాల్ నెహ్రూతో సహా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులంతా రాజీనామాచేసారు. కమిటీలో సుభాష్ బోస్, శరత్‌బోస్ మాత్రమే మిగిలారు. పార్టీ అధ్యక్షుడు స్వతంత్ర నిర్ణయాలు తీసుకొనేందుకు బోస్‌కు స్వేచ్ఛ నివ్వడం కోసమే తామంతా వర్కింగ్

కమిటీలోంచి బైటకువచ్చినట్లు ప్రకటించాడు నెహ్రూ కానీ, బోస్‌కి స్ట్రాంగ్ డోస్ ఇవ్వడానికి చేసిన పని అని దేశంలో ప్రతి ఒక్కరికీ తెలుసు - అనాడు!

"నా దృష్టిలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ చచ్చి పోయింది - లాంగ్‌లివ్ వర్కింగ్ కమిటీ -" అన్నాడు నెహ్రూ!

బోస్ ఆలస్యం చెయ్యకుండా అందరి రాజీనామాలూ ఆమోదించి తాను దిగివచ్చే సమస్యేలేదని సూచించాడు అందరికీ!

ఇప్పుడు జెనరల్ బాడీ రంగంలోకి రావడం అనివార్యం అయ్యింది. తనపైన అవిశ్వాస తీర్మానం పెట్టుకోమని రెచ్చగొట్టాడు కాంగ్రెస్‌వాదుల్ని బోస్.

మార్చి 10న త్రిపురలో కాంగ్రెస్ సర్వసభ్య సమావేశం జరిగింది. బోస్ దానికి అధ్యక్షత వహించాడు. వేడిచర్చలు చోటుచేసుకున్నాయి.

చివరికి - త్రిపుర కాంగ్రెస్ సభ గాంధీజీపట్ల తమసంపూర్ణ విశ్వాసాన్ని ప్రకటించింది. వర్కింగ్ కమిటీని గాంధీజీతో సంప్రదించి నియమించమని అధ్యక్షుడు బోస్‌కు సూచించింది. పండిత గోవింద వల్లభ పంత్ ప్రవేశపెట్టిన ఈ తీర్మానానికి 218 మంది అనుకూలంగా 115 మంది వ్యతిరేకంగా ఓటుచేశారు.

ఏప్రియల్ 29న సుభాష్‌బోస్ పార్టీ అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు. డా॥బాబూరాజేంద్రప్రసాద్ తాత్కాలిక అధ్యక్షుడిగా వ్యవహరించారు.

తనని తాను లెఫ్టిస్ట్‌గా వ్యవహరించుకున్న సుభాష్‌బాబు 'ఫార్వర్డ్‌బ్లాక్" అనే ఓ గ్రూపుని కాంగ్రెస్‌లో నెలకొల్పాడు. దాన్ని కాంగ్రెస్‌వాదులు అంగీకరించలేదు. మద్యపాన నిషేధం వంటి అంశాలపైన కాంగ్రెస్ భావాలకు వ్యతిరేకంగా బోస్ ప్రకటనలు ఇవ్వడాన్ని నెహ్రూ ఖండించాడు.

ఆగస్ట్ 11, 1939న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ బోస్‌మీద క్రమశిక్షణా చర్యలు తీసుకొంది. పార్టీలోంచి బహిష్కృతుడైనాడు బోస్.

భారతదేశంలో సుభాష్‌చంద్రబోస్ రాజకీయజీవితానికి ఇక్కడితో తెరపడింది!

తిరిగి రెండవ ప్రపంచ యుద్ధంలో 'నేతాజీ'గా 'అజాద్-హింద్-ఫౌజ్' వ్యవస్థాపకుడిగా మిలిటరీ దుస్తులతో భారతీయులకు దర్శనం ఇచ్చాడు బోస్‌బాబు.

గాంధీని ఆయన అంగీకరించకపోయినా, గాంధీ ఆయనని అంగీకరించకపోయినా, ఆయన ఆలోచనా విధానాలు భారతదేశంలో అనేక వివాదాలకు దారితీసినా మొక్కవోని ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో దేశంకోసం వంటరిపోరాటం తుదకంటా కొనసాగించిన స్వాతంత్ర్యయోధుడు ... మరో పురుషోత్తముడు.... సుభాష్‌బాబు!

**(దిహిందూ 100 ఇయర్స్)**

నూరేళ్ళనాటి

# తొలి తెలుగు పత్రికలు

**గాం**ధీజీ భారతస్వాతంత్రోద్యమంలోకి అడుగుపెట్టే నాటికి బాలగంగాధర తిలక్, లాలాలజపతిరాయ్, బిపిన్‌చంద్రపాల్‌వంటి ప్రముఖులు బ్రిటిష్‌వారి అకృత్యాల్ని ఖండిస్తూ, నిరసనలు తెలుపుతూ, ఊరేగింపులు జరుపుతూ ప్రజల్ని జాగృతం చేస్తూ దేశాన్ని పెద్దయుద్ధానికి సమాయత్తం చేస్తుండేవారు. కానీ బ్రిటిష్ ప్రభుత్వం వీళ్ళ ఉద్యమాన్ని తాటాకు చప్పుళ్ళుగా భావించేది.

1974లో పురుషార్థ ప్రదాయిని అనే పత్రిక కలకత్తా, మద్రాస్, బొంబాయిలో క్రైస్తవ మతాంతరీకరణని ఖండిస్తూ వ్యాసాలు రాసింది.

1885లో మద్రాస్‌నుంచి ఎ.పి. పార్థసారథి నాయుడు సంపాదకత్వంలో 'ఆంధ్రప్రకాశిక' వారపత్రిక తెలుగులో వెలువడిన వెలువడిన మొదటి పత్రిక. పాతికేళ్ళు నడిచింది. జాతీయతా భావాలగురించి ఇందులో వ్యాసాలు ప్రచురిత మయ్యేవి.

అదేరోజుల్లో వెలువడిన లోకరంజని అనే తెలుగు పత్రిక భారతీయయువకులు లండన్ వచ్చి అక్కడి పోటీ పరీక్షల్లో నెగ్గితేనే ఇండియాలో సివిల్ సర్వీసెస్‌లోఉద్యోగం ఇవ్వాలనే ప్రభుత్వ నిర్ణయాన్ని ఖండిస్తూ, రోడ్డున పడ్డ వేలాదిమంది నిరుద్యోగ యువకుల భవిష్యత్తు పట్టించుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వానిదే నని హెచ్చరించింది.

1901లో 'గౌతమి' అనే తెలుగు పత్రిక పోలీస్ ఇన్‌స్పెక్టర్ జెనరల్ ఆఫీస్‌లో గుమాస్తా ఉద్యోగానికి "ఒక ముస్లిం అభ్యర్థి కావలెను-" అని ప్రకటించడాన్ని ఖండిస్తూ మతం ఆధారంగా ఉద్యోగాలు ఎలా ఇస్తారని నిలదీసింది.

1902లో శశిరేఖ తెలుగుపత్రిక ఎడ్వర్డ్ (7) రాజ పట్టాభిషేకం ఖర్చుని పేద భారతదేశం ఖర్చులో రాసి దుబారాచేయడాన్ని తీవ్రంగా తప్పుబట్టింది.

1902లోనే కృష్ణాపత్రిక ప్రారంభం అయ్యింది. దేశభక్త కొండ వెంకటప్పయ్యగారు దాని వ్యవస్థాపకుల్లో ఒకరు. ఆ సంవత్సరం దక్షిణ ఆఫ్రికాలో బ్రిటిష్ ప్రభుత్వం నల్లజాతిప్రజల అణచివేతను చేస్తున్న అకృత్యాలను ఎండగడుతూ అద్భుతమైన సంపాదకీయం రాశారు.

1905లో కేసరి పత్రికలో తిలక్ ఇలా రాశారు- సంవత్సరానికొకసారి కాంగ్రెస్ సభలు - అప్పుడప్పుడూ పత్రికల్లో సంపాదకీయాలూ, వ్యాఖ్యలూ విసుర్ల వలన మనం సాధించేదేమీ లేదని తేలిపోయింది. లక్షలాది భారతీయుల అభిప్రాయాలు విలువలేనివిగా

బ్రిటిష్ ప్రభుత్వం భావిస్తోంది. మహా సముద్రం అలలు ఒడ్డున వున్న పర్వతాన్ని బలంగా తాకి రయ్యిన వెనక్కి వచ్చినట్లుందీ పరిస్థితి... అలలే నయం ఉప్పగానయినా వుంటాయి. మన ఉద్యమమే చప్పగా వుంది... మరీ...!!" అని!

లోకం అంతా ఆ స్వాతంత్ర్య భానుడు ఉదయించడం కోసం ఎదురుచూస్తోంది. తిలక్ అందుకు ఆవాహన చేస్తున్నాడు.

(సరోజినీ రేగాణి – హైలైట్స్ ఆఫ్ ది ఫ్రీడమ్ మూవ్‌మెంట్ ఇన్ ఆంధ్రప్రదేశ్)

# ఖడ్గ తిక్కన వీరమరణం

13వ శతాబ్దంలో నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధి రాజు దగ్గర సేనాని ఖడ్గ తిక్కన.

భారతాన్ని తెనిగించిన కవిత్రయంలో రెండవవాడైన – తిక్కన సోమయాజి కవిగారికి ఇతను పెదనాన్నగారి కొడుకు – తమ్ముడు వరుస అవుతాడు.

ఈ రణ తిక్కన కవి అవునో కాదో గానీ, ఇతని భార్య, తల్లి ఇద్దరూ కవయిత్రులే!

కాటమరాజుకీ, మనుమసిద్ధికీ జరిగిన యుద్ధంలో రణరంగం నుంచి పారిపోయి వచ్చినందుకు భార్య వేళాకోళం చేస్తూ ఈ పద్యం చెప్పింది –

"పగఱకు వెన్నిచ్చినచో, నగరే నిను మగతనంపు నాయకులెల్లన్
ముగురాఁడువారమైతిమి వగపేటికి జలకమాడ వచ్చిన చోటన్ – "

అంటూ ఆడవాళ్ళు స్నానం చేసే చోట నీళ్ళు తోడి మంచం అడ్డు పెట్టిందిట – శత్రువులకు వెన్నిచి పారిపోయి వస్తే మగతనం కల్గిన నాయకులు మిమ్మల్ని చూసి నవ్వరా? ఇంట్లో ముగ్గురు ఆడవాళ్ళం అయ్యాం – ఇక్కడ స్నానం చేయడానికి వగపెందుకు?" అని!

భోజనం చేద్దామని కూర్చుంటే –

"అసదృశముగ నరివీరులఁ బసమీఱఁగ గెలువలేక పందక్రియన్ నీ
వసివైచి విఱిగి వచ్చినఁ బసులున్ విఱిగినవి తిక్క! పాలున్ విఱిగెన్"

"శత్రువీరుల్ని చంపి అద్భుతంగా గెలవలేక పిరికి పందలా విరిగి వచ్చావు. పశువులు కూడా విరిగాయి. పాలు కూడా విరిగాయి–" అన్నదట తల్లి.

సిగ్గుపడ్డ ఖడ్గ తిక్కన అన్నం ముట్టకుండా రణరంగానికి వెళ్ళి పోరాడి వీర స్వర్గం అలంకరించాడు.

ఆమె వీర పత్ని! ఈమె వీర మాత!! ఇద్దరూ అమర కవయిత్రులు!!

*ఉరికంబంమీద చిరునవ్వు నవ్విన*

# ఖుదీరామ్‌బోస్

**1908** బెంగాల్ విభజనకు వ్యతిరేకోద్యమం ముమ్మరంగా జరుగుతోంది. సురేంద్రనాథ్ బెనర్జీ, బిపిన్ చంద్రపాల్ చిత్తరంజన్ నాయకత్వం వహిస్తున్నారు ఉద్యమాన్ని అణిచి వేయడానికి దమన చర్యలు మితిమీరాయి.

ఎం.ఆర్.కింగ్స్ ఫర్డ్ అనే జిల్లాకలెక్టర్ కర్కోటకుడు. వందేమాతరమ్ అన్నందుకు సుశీలసేన్ అనే చిన్న కుర్రవాణ్ణి వేపబెత్తంతో చితకగొట్టించాడు.

ఈ వార్త విప్లవకారులను కోపోద్రిక్తుల్ని చేసింది. దౌర్జన్యాన్ని దౌర్జన్యం తోనే ఎదుర్కొవాలని నిర్ణయించుకున్నారు. కింగ్స్‌ఫర్డ్ విధించే నరకలోకపు శిక్షలు జనాన్ని వెర్రెత్తించాయి. ఖుగీరాంబోస్, ప్రఫుల్లఛాకీ అనే ఇద్దరు విప్లవకారులు 1908 ఏప్రియల్ 30వ తేదీ రాత్రి 8-30 గంటలకి 'కింగ్స్‌ఫర్డ్' వాహనం మీద బాంబు వేసి పారిపోయారు.

ఖుదీరామ్‌బోస్ ఆ పక్కనున్న 'వేణి' గ్రామానికి చెందినవాడు. నెమ్మదిగా తప్పించుకొని తనవూరు వెళ్ళిపోయాడు వూళ్ళోకి వెళ్ళగానే, ఓ దుకాణం దగ్గర "బాంబుపేలుడులో బండిలో వున్న ఇద్దరు దొరసానులు మరణించారు." అని చెప్పుకుంటున్నారు.

ఖుదీరామ్ ఆశ్చర్యపడ్డాడు. నిలువున నీరయ్యాడు. తననుతాను మరిచిపోయాడు. ఆ స్థితిలో అప్రయత్నంగానే- "చచ్చింది కింగ్స్‌ఫర్డ్‌కాదా?" అనేశాడు పైకి!

ఆ మాటలు అనడంతో ఖుదీరామ్‌ని అనుమానించారు జనం. వార్త పోలీసులకు తెల్సింది. వెంటనే ఖుదీరామ్‌ని అరెస్ట్ చేశారు. ప్రఫుల్ల చాకీ రైల్వేస్టేషన్‌లో దొరికాదుగానీ, రివాల్వర్‌తో కాల్చుకొని ఆత్మహత్య చేసుకొన్నాడు.

ఖుదీరామ్‌కు ఉరిశిక్ష పడింది.

అతను భగవద్గీత చేత్తో పుచ్చుకొని మరణశిక్షను ఆనందంగా స్వీకరించాడు. ఉరికంబం మీద నవ్వుతూ నిలబడ్డ అతన్ని చూసి ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపోయారు.

మనిషిగా పుట్టడం నా అదృష్టం.

మనిషిగా ఈ పుణ్యభూమిలో పుట్టడం నా భాగ్యం అని పాడుతూ దేశంకోసం ఖుదీరామ్ మరణించేసరికి అతనికి 17 సంవత్సరాల వయసు!

ఖుదీరామ్ సాహసాన్ని ప్రశంసిస్తూ లోకమాన్య బాలగంగాధర తిలక్ 'కేసరి' పత్రికలో రెండు లేఖలు రాసిన నేరానికి ఆయన్నిఅరెస్ట్ చేసి కఠిన శిక్ష విధించారు. అరవిందఘోష్ (మహర్షి అరవిందులు) ఈ కేసులో కూడా ఇరుక్కున్నాడు.

**(హేమేంద్రనాథ్ దాస్ గుప్త "దేశబంధు చిత్తరంజన్ దాస్" గ్రంథంలోంచి)**

### ‘ల’ కు ఏత్వం ‘ద’కు కొమ్ము తెలియని

# రాయని భాస్కరుడు

కొండవీటి సీమని పాలించిన రెడ్డిరాజుల దగ్గర మంత్రిగావుండేవాడు భాస్కరుడు. రాయన్న గారి కొడుకు కాబట్టి రాయని భాస్కరుడు అని పిలిచేవారు.

“కృతయుగే బలిర్దాతా త్రేతాయాం రఘునందనః

ద్వాపరే సూర్యపుత్రశ్చ కలౌ రాయని భాస్కరః” అనే సంస్కృత శ్లోకం ఎవరు రాశారో తెలీదుగానీ, రాయని భాస్కరుడి దానగుణాన్ని చెప్తుంది. కృతయుగంలో బలిచక్రవర్తి, త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు, ద్వాపరయుగంలో కర్ణుడు, కలి యుగంలో రాయని భాస్కరుడు మహాదాతలని దీనిభావం.

“చేకొని రాయని బాచఁడు, కాకాలు గుణించునట్టి కాలమునాఁడే

‘లా’కేత్వమియ్య నేరఁడు, ‘దా’కును గొమ్మియ్యఁడిట్టి ధన్యులు గలరే-”

అని పొగడబడిన దాత రాయని భాస్కరుడు.

‘క’ గుణితం నేర్చుకునే రోజుల్లోనే అంటే చిన్నప్పుడే ఈ రాయని భాస్కరుడు ‘ల’కు ఏత్వం, ‘ద’కు కొమ్ము ఇవ్వడం తెలీనివాడట! ‘లేదు’ అనని వాడని! ఆయన మేరమీరిన దానాలు చేయడం వలన - కుటుంబం సహజంగానే వీధినపడింది.

కొడుకు కొండయ్య సైనికుడిగా వుండి చిన్నతనంలోనే పోయాడు. మనమడు రామలింగ భాస్కరుడు ఓ వీధిబడిలో చదూకొంటున్నాడు. రాచవైభవాలేమీ లేకుండా చిన్న బడిలో చదూకొంటున్న ఆ చిన్న భాస్కరుణ్ణి చూసి, ఓ భట్టుగారు-

రాయని భాస్కరుతోనే పోయెఁ జుమీ కీర్తికాంత...” అంటూ బాధపడ్డాడు. అది విన్న మనమడు రామలింగ భాస్కరుడు లేచి, తనచేతికి వున్న చిన్న మురుగును తీసి భట్టుగారికిచ్చి “పోదే...” అన్నాడు! ఇదిచూసిన మరొకవ్యక్తి “మరేదీ?” అనడిగాడు.

“ఆయన మనమఁడు చతురోపాయుండగు రామలింగభాస్కరుఁజేరెన్” అని పద్యాన్ని భట్టుగారు పూరించాడు.

సాయంకాలానికి రామలింగభాస్కరుడి మురుగు కథ తల్లికి తెల్సిపోయింది. పిల్లవాడు ఇంటికి రాగానే చాచి చెంపమీద కొట్టిందట... “అమ్మా! కొట్టకు... ఆ భట్టు ఎక్కడున్నాడో వెదికి మురుగు పట్టుకొచ్చేస్తాను-” అని ఏడ్చేశాడు చిన్ని భాస్కరుడు.

అప్పుడు తల్లి నవ్వి - నెమ్మదిగా అందిట- ఒరే... ఆ మురుగుని భట్టుకిచ్చినందుకు కాదురా నిన్నుకొట్టింది - ఒక చేతి మురుగు మాత్రమే ఇచ్చి పిసినిగొట్టులాగా రెండో మురుగు దాచుకొని, మీ తాతగారికి చెడ్డపేరు తెచ్చిపెట్టినందుకు కొట్టాను-” అని! “వెంటనేపోయి ఆ రెండో మురుగు కూడా ఇచ్చేసిరా-” అని ఆదేశించిందట. పుణ్యభూమీ! వర్ధిల్లు!!

**(చిలకమర్తివారి చమత్కారి మంజరి)**

# దువ్వూరు వేంకట రమణశాస్త్రి

కులపతి శ్రీమత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులవారు బందరుదగ్గర చిట్టి గూడూరులో నడిపిన సంస్కృత పాఠశాలలో అనేకమంది శిక్షణపొంది తెలుగుప్రముఖులుగా రాణించారు. దువ్వూరు వేంకట రమణశాస్త్రిగారు ఆ విద్యాలయంలో ఉపాధ్యాయులు.

కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా వుండే రోజుల్లో 'ఆనర్స్' క్లాసుల్ని సృష్టించి వజ్ఝల వారినీ మల్లాదివారినీ అధ్యాపకులుగా నియమించారు. ఆ పెద్దలిద్దరూ రిటైరయ్యాక సంస్కృతం, తెలుగు రెండూకలిపి ఒకే పండితుడు కావాలని ప్రకటించారు.

సంస్కృత పండితులు తెలుగుమీద గౌరవం చూపించరనీ, అద్వితీయమైన సంస్కృత భాషావైభవం ముందు తెలుగు ఒక లెక్కా అన్నట్లు మాట్లాడుతుంటారనీ, వసుచరిత్ర వంటి ప్రబంధాలు సంస్కృతంలో లేవనీ, నన్నయ, తిక్కన శ్రీనాథుల వంటి కవులు సంస్కృతంలో కొద్దిమందే వున్నారనీ తెలుగు పండితులు చాలామంది భావిస్తూండేవారు ఈ పరిస్థితుల్లో సంస్కృతం తెలిసిన తెలుగుపండితుడా, తెలుగు తెలిసిన సంస్కృత పండితుడా ఈ పదవికి అర్హుడని చాలామంది ఎదురుచూశారు.

తెలుగుదనం తెలియని వాడు, తిక్కన, సోమనవంటి తెలుగు కవుల మెలకువల్ని గుర్తించలేనివాడు ఈ పదవిలోకి వస్తే అన్యాయం జరిగినట్టేనని తెలుగు పండితులు భయపడ్డారు.

అందరి భయాన్నీ పోగొడ్తూ, ఉభయభాషలలో అపారపాండితీ గరిమకల్గిన పుంభావ సరస్వతి శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారిని ఆ పదవికి ఎంపిక చేశారు. వీరి ఎంపికని ఆంధ్రలోకం హర్షించింది. ముఖ్యంగా వారిశిష్యులు బాగా సంతోషించారు.

పండిత కొత్త సత్యనారాయణ చౌదరిగారు కులపతి వరదాచార్యుల వారి జీవితచరిత్రలో ఈ విశేషాలు రాశారు. ఒకసారి బి.యే. తెలుగుక్లాసు తీసుకొంటూ, "మా గురువులిట్లా చెప్పారు" అన్నారట...చౌదరిగారు

మీ గురువెవ్వరండీ... అని అడిగారు విద్యార్థులు. వరదాచార్యులవారు, దువ్వూరివారు ఈ ఇద్దరి గురించీ వివరంగా చెప్పి చివరలో అన్నారట చౌదరిగారు-

"బాబూ! మీ చదువుల ధోరణి వేరు. మాచదువుల ప్రసక్తి వేరు. కాలేజీ ఆఫీసులో ఫీజులు కట్టి, క్లాసులో కాలం గడిపి రైలు ప్రయాణంచేసినట్లు మీరు ఇళ్ళకు వెళ్ళిపోతుంటారు. కానీ, మేము వ్యాకరణం వారి వద్ద చదివాము, సాహిత్యం వీరి దగ్గర నేర్చుకున్నాం అని చెప్పుకొంటాం. మీరు ఏమని చెప్పుకొంటారు...? వీడు తెలుగు క్లాసుకొస్తాడు - వాడు సైన్సుక్లాసు తీసుకొంటాడు. అని చెప్పుకొంటారు.

'గురు శిష్య సంబంధాలు మీకాలంలో ఎక్కడున్నాయి'-?" అని!

### హైదరాబాద్‌కు

# ప్రిన్స్ ఎడ్వర్డ్ రాక

రాజాబహద్దూర్ వెంకట్రామారెడ్డి గారు హైదరాబాద్ నగరానికి కొత్వాలుగా పనిచేశారు. కొత్వాలు అంటే సర్వసత్తాక అధికారాలు కల్గిన పోలీస్ కమీషనర్‌లాంటివాడు. ఆయన సేవల్ని గుర్తించి వెంకట్రామారెడ్డి గారికి నిజాం ప్రభువు రాజా బహద్దూర్ బిరుదుని, బ్రిటిష్ చక్రవర్తి ఆర్డర్ ఆఫ్ బ్రిటిష్ ఎంపైర్ (ఓ.బి.ఇ.) బిరుదునీ ఇచ్చి గౌరవించారు.

అది 1930... ప్రాంతం.

ప్రిన్స్ ఎడ్వర్ట్ - వేల్సు యువరాజు (ఐదవజార్జి చక్రవర్తి పెద్దకొడుకు) హైదరాబాద్ నగరాన్ని సందర్శించాలని రాబోతున్నారు. అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేసే బాధ్యత కొత్వాలు రెడ్డిగారి పైన పడింది.

ఆ రోజుల్లో దేశం అంతా సహాయ నిరాకరణోద్యమం ప్రచండంగా జరుగుతోంది. ప్రిన్స్ ఎడ్వర్డ్ భారతదేశానికి రావడానికి ఇది సమయం కాదని హెచ్చరించారు గాంధీ.

ఆయన ఎక్కడికి వెళ్ళినా నల్లజెండాలు తప్ప ప్రజల స్వాగత సత్కారాలు ఉండరాదని కాంగ్రెస్ తీర్మానించింది.

హైదరాబాద్ సంస్థానంలో పరిస్థితి వేరు. ఇక్కడ కాంగ్రెస్ అప్పటికే ప్రజలలో ఉద్యమస్ఫూర్తిని తెచ్చినప్పటికీ, బ్రిటిష్ వారితో నిజాం స్నేహం రీత్యా ఎడ్వర్డ్ గౌరవ మర్యాదలకూ రాజలాంఛనాలకూ ఏ మాత్రం లోపం జరగకూడని పరిస్థితి.

ఎడ్వర్డ్ మోటారు కారులో కాకుండా గుర్రపు బగ్గీలో ప్రయాణించి ఊరంతా చూస్తారని కబురంపారు. మిగిలిన దేశం అంతా నిరసనలు వెల్లువెత్తుతుంటే, ఇక్కడ హైద్రాబాద్ సంస్థానంలో ప్రశాంతతని ఎలా సాధించగలం..? ఎడ్వర్డ్ కోరికి తీర్చడం అసాధ్యం అన్నారు అధికారులు.

కొత్వాల్ వెంకట రామారెడ్డిగారిని పిలిపించారు.

ఆయన సౌమ్యంగా "అలాగే చేద్దాం" అన్నారు. మతిపోయింది అధికారులకి. "నీకేమైనా పిచ్చి పట్టిందా? బ్రిటిష్ ఇండియాలో పరిస్థితులు చూసి కూడా ఇక్కడ మనం కంట్రోలు చెయ్యగలమనే అనుకొంటున్నావా?" అడిగాడు సూటిగా నిజాం.

"నాదీ బాధ్యత!" ఖండితంగా అన్నారు రెడ్డిగారు.

"ఏమైనా ప్రమాదం జరిగితే?"

"నా తల తీయించుకొంటాను"

"బాగా ఆలోచించి చెప్పు! ఏ చిన్న తేడా వచ్చినా మొత్తం హైదరాబాద్ సంస్థానానికే కళంకం"

"ఏమీ కాకుండా అంతా జయప్రదంగా చెయ్యలేకపోతే ఇంక నా సేవలు దేనికి?"

చివరికి రెడ్డి గారి మాట మీద, ఓపెన్‌గా వున్న గుఱ్ఱపు బగ్గీలో యువరాజుని ఊరేగించడానికి హైదరాబాద్ సంస్థానం అంగీకారం తెల్పింది.

అన్ని రకాల ప్రమాదాల్ని ముందుగానే ఊహించి చెయ్యవలసిన కట్టుదిట్టాలన్నీ చేశారు రెడ్డిగారు.

"రోడ్డు మీద మనిషనే వాడు లేకుండా నిర్మానుష్యం చేసి ఊరేగిస్తావా?" అనడిగాడు బ్రిటిష్ అధికారి హెంకిన్. నవ్వి వూరుకున్నారు రెడ్డిగారు. అప్పటికే దండోరా విన్పించడం మొదలయ్యింది-

"యువరాజు గారి వేడుకలు చూడదల్చుకున్న వారంతా ప్రొద్దున్నే ఎనిమిది గంటలకే వచ్చి రోడ్డుకు రెండువైపులా ఏర్పాటుచేసిన ప్రత్యేక స్థలాలలో కూర్చోవచ్చు-" అని ఆ దండోరా ప్రజల్ని తండోపతండాలుగా రావాలని ఆహ్వానించింది.

యువరాజు రానే వచ్చాడు. నాలుగు లక్షల మంది శాంతంగా, మౌనంగా యువరాజుని సందర్శించుకొన్నారు. నాలుగు గుఱ్ఱాల బగ్గీలో 'ఫలక్నూమా' భవంతి వరకూ ఊరేగింపుగా తోడ్కొని వెళ్ళారు.

సి.ఐ.డి. అధికారులు ఈ జనాన్ని చూసి భయపడిపోయారు. "అంతా నాది బాధ్యత! భయపడకండి" అభయం ఇచ్చారు రెడ్డిగారు.

ఐదు రోజులు హైదరాబాద్ నగరంలో ఆనందంగా గడిపాడు యువరాజు.

ఆఖరికి వెళ్ళేప్పుడు ఇంత చక్కని ఏర్పాట్లు చేసిన రెడ్డిగారిని తన దగ్గరకి రమ్మనమని పిలిపించాడు యువరాజు ఎడ్వర్డ్.

"మీరు పంజాబు నుండి వచ్చిన పోలీసాఫీసరా?" అనడిగాడు ఎడ్వర్డ్.

"కాదు! ఆరణాల తెలుగువాణ్ణి!"

"ఎప్పటినిండీ పోలీస్ శాఖలో పనిచేస్తున్నారు?"

"నలభై ఏళ్ళ నుండీ! చిన్న అమీనా (కానిస్టేబుల్)గా చేరి అన్ని పదవులూ చేసి కొత్వాలు నయ్యాను-"

"నేను వచ్చినప్పుడు నాలుగు లక్షల మంది జనం ప్రశాంతంగా వచ్చి కూర్చున్నారు. వాళ్ళంతా ఎక్కడి వాళ్ళు..."

"సగం మంది ఈ ఊరువాళ్ళే! సగం మంది చుట్టుపక్కల జనం-"

ఎవరిని రప్పించాలో - ఎవరిని రానీకూడదో తెలిసిన ఆఫీసర్- అని మెచ్చుకున్నాడు యువరాజు.

ఇంత శ్రమతీసుకుని విజయవంతంగా నెరవేర్చడానికి ముందు ఆయన ఇంకా పెద్ద శ్రమ తీసుకున్నారు - అది, ఆయన ఇంగ్లీషు చదువు! యువరాజు వస్తాడని ముందుగానే ఓ స్కూలు మాస్టారిని పిలిచి తనకి ఇంగ్లీషు నేర్పమని అడిగారట రెడ్డిగారు.

రాత్రిపూట పాఠాలు చెప్పించుకొని తెల్లవారు ఝామున వల్లెవేసే వారట!

రెడ్డిగారి గది ముందు కాపలా వుండే జవానుకి ఈ సంగతి తెలీదు.

ఓ తెల్లవారుఝామున ఎప్పుడూ వినని శబ్దాలతో కొత్త కొత్త ధ్వనులతో వింత వింత ఉచ్చారణలతో ఏవేవో మాటలు గదిలోంచి విన్పిస్తుంటే అతను భయపడి తుపాకి అక్కడే పెట్టి తనపై అధికారి కోసం పరుగు పెట్టాడట!

అయ్యగారికి దయ్యం పట్టిందో - లేక వింత వ్యాధి ఏదైనా సోకిందేమోనని అతని భయం.

అది కొత్వాలు గారి కొత్త ఇంగ్లీషు పాఠం అని తెలసి కుదుటపడ్డారంతా!

**(సురవరం ప్రతాపరెడ్డి - రాజబహదూర్ వెంకట్రామిరెడ్డి జీవితం)**

### *కంకంటి పాపరాజు మీద*

# ఓ చాటుపద్యం

ఉత్తర రామాయణాన్ని తెలుగులో ప్రబంధ కావ్యంలా రాసిన మహాకవి కంకంటి పాపరాజు. ఈయన 17 లేక 18వ శతాబ్ది వాడని పరిశోధకుల అభిప్రాయం.

ఈ పాపరాజుగారి మీద ఎవరో కవిగారికి బాగా అసూయ వుండి వుండాలి - నిందాస్తుతిగా ఈ పద్యాన్ని చెప్పాడా అజ్ఞాత కవి!

"ఒంటి మిట్టను గాపురంబున్న యట్టి, సిద్ధసానికి సంకల్ప సిద్ధి రస్తు
చెలఁగి నా మీఁద పద్యంబు చెప్పినట్టి, పాపరాజుకు సంగమ ప్రాప్తిరస్తు-" అని!

# ఉపేక్షా దేవి ఉపాసన

రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ గారు “రాయల వైదుష్యము” అనే వ్యాసం రాస్తూండగా మధ్యలో ఏ కారణం చేతో ఆయనకు మన తెలుగువారి ఆలోచనా విధానం మీద అమితమైన ఆగ్రహం కల్గింది.

ఏకబిగిన మన మనస్తత్వాన్ని ఇలా కడిగేశారు...

“ఫలమీయని తప్పు దైవముది గాని, పని చేయని తప్పు నాదిగానుండరాదనుట’ ’ రాయలవారి గుణం.

మనం రాయల వారు సంపాదించిన శాంతి అనుభవించాం. ఇచ్చిన ఈనాముల్ని తినేశాం. కట్టించిన దేవాలయాల్లో కంఠం ఎత్తి పాడి భగవద్భజన చేశాం. అతనే సిగ్గుపడి తలవంచుకొనేటంత పొగిడాం.

కానీ, అతని ఉపదేశాన్ని మాత్రం పెడచెవిని పెట్టాం. మనం అంటే, మీరూ నేనూ మాత్రమే కాదు. నేటి, నిన్నటి, మొన్నటి తరతరముల నాటి హిందూ సంఘమే!

మనకు మన పనులన్నీ మరియెవడో మహాత్ముడు చేసిపెట్టాలి. మనం మాత్రం కాలి మీద కాలు వేసుకొని పడుకోవాలి. ఎన్నాళ్ళ క్రితం వేశామో గానీ, ఈ పరతంత్రం పరుపు మళ్ళా ఎప్పుడూ దాన్ని విదిలించి చుట్టి పెట్టిన పాపాన పోలేదు.

ఇంకెవడో వచ్చి పక్కకు పొరలించి దుమ్ము దులిపే పుణ్యానికి పోవలసిందే! కానీ, ఎన్ని నల్లులు, ఎన్ని చీరపేలు రక్తాన్ని పీలుస్తున్నా వట్టి నేలకన్నా ఇదే మెత్తగా వుందని వాదిస్తుంటాం. మనల్ని కదిలించని వాళ్ళని ఇంద్రుడు, చంద్రుడు అని పొగుడుతూ సుఖంగా వున్నామనే భ్రమలో జీవిస్తుంటాం -

శ్రీ కృష్ణ దేవరాయల రాజ్యాన్ని రామరాజ్యం అన్నాం. సరే... తరవాత రామరాయుడి సుగ్రీవరాజ్యాన్ని కూడా రామరాజ్యమే అని పొగిడాం. (వసుచరిత్ర) వారి ఆశ్రయంలో అణిగిమణిగి వున్న మహమ్మదీయుల్ని “ముసలి మానులు” అని గేలిచేశాం (వసుచరిత్ర)

అవమానాలు పొందిన మహమ్మదీయులు మన రాజ్యాల్ని ధ్వంసం చేస్తే, మళ్ళీ అదే నోటితో “ఇభరాములు” శౌరులు అని పొగిడాం. (యయాతి చరిత్ర - తపతీ సంవరణోపాఖ్యానం)

ఆ కాలాలన్నీ గడిచిపోయాక చిక్కిన చిల్లర రాళ్ళకు, నాయలకు, భుజాలు తట్టి, కాళ్ళకు మొక్కి బిచ్చం సంపాదించి తినడానికి అలవాటు పడ్డాం.

విసిగివేసారి, చివరికి ఇంకెవరో వీరభోగ వసంతరాయుడు ముందు ముందు పెద్ద గుర్రం ఎక్కి వచ్చి మనల్ని రక్షిస్తాడని ఎదురు చూస్తున్నాం.

ఇలా మనం ఉపేక్షాదేవి ఉపాసన చేయడం వలనే బైటినుంచి వచ్చిన ప్రతివాడూ ఈ దేశంలో వీరభోగ వసంత రాయుడై పోతున్నాడు.

ఇంత పరతంత్ర రసికత మన ఎముకల దాకా అంటివుండటం చేతనే ఇప్పుడు కూడా ఇంటి ముంగిట మురికి గుంట - ఈగలు ముసిరి కుళ్ళుతున్నా, కూర్చుని మున్సిపాలిటీ వాళ్ళని తిట్టగలమే... కాని, దోసెడు మట్టి తెచ్చి ఆ గుంటను పూడ్చుకొని ముక్కును కాపాడుకోవాలనే ఆలోచనే మనకు లేకుండా పోయింది.

మన పరతంత్రతత ఇంత పరమావధికి వచ్చింది. కాబట్టి రాయల వంటి మహాపురుషుడి పేరు చెప్పుకొని చేసే ఈ రోజు ఉత్సవ దినం కాదని చెప్పాను. సిగ్గుతెచ్చుకొని మనపై మనకు అసహ్యం పుట్టి, ఆత్మశోధన చేసుకోవాల్సిన రోజు. ఆత్మశక్తిని ధ్యానించి స్వాతంత్ర్యమంత్రాన్ని జపించే రోజు... ఆ మంత్రానికి మహర్షి కృష్ణ దేవరాయలు -

**(రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ - సారస్వతాలోకము)**

# ఒంగోలు సంత

**ఒ**కసారి శాసన సభలో ఒంగోలు పశువుల సంతని ఆపి వేయాలని మహావేగంగా ఉపన్యసించడం మొదలు పెట్టారు కొండ వెంకటప్పయ్యగారు.

విదేశాలనుంచి వర్తకులు ఒంగోలు వచ్చి మంచి బలిష్ఠమైన ఎడ్లని తమ దేశాలకు కొనుక్కుపోతున్నారని, వాటిని చంపితినడానికే వాళ్ళు కొనుక్కు వెళ్తున్నారనీ ఆరోపించారాయన! అప్పట్లో గవర్నర్‌గారు కూడా శాసనసభలో కూర్చుని విషయాలను ఆకళింపు చేసుకొనేవారు.

వెంకటప్పయ్యగారు ఇంత సీరియస్ విషయాన్ని ప్రస్తావిస్తుంటే, ముఖ్యమంత్రి రాజాజీ, గవర్నరూ ఇద్దరూ ఏవేవో మాట్లాడుకొని, నవ్వుకొని, అల్పాహారానికి టైమయ్యిందని లేచి వెళ్ళి పోయారట! ఇంత ప్రధాన విషయం మీద ఏ మాత్రం వాళ్ళిద్దరూ లక్ష్యం పెట్టకపోవడాన్ని చూసి బాధపడ్డారు వెంకటప్పయ్యగారు!

తర్వాత రాజాజీ వెంకటప్పయ్యగారిని పిలిచి, 'మేము ఏం మాట్లాడుతున్నామో తెలుసా? నీ వయసెంత' - అని! నేను యాభై వుంటాయని, కాదు ముప్పైయిదే వుంటాయని మేమిద్దరం వాదులాడుకున్నాం- ఇంతకీ నీ వయసెంతంటావ్...?" అని అడిగాడట కొంటెగా రాజాజీ!

చట్టసభల్లో విషయాలు ఇలానే వుంటాయి కాబోలు!!

# రాట్నం తెచ్చిన స్వరాజ్యం

1920 -

కాంగ్రెస్ రాజకీయాల్లోకి గాంధీగారి ప్రవేశం తర్వాత నాన్-కో-ఆపరేషన్, సివిల్ డిజొబీబేడియన్స్ అనే రెండు పదాలు మేథావి వర్గంలో కలకలం రేపాయి.

తిలక్ తరహా అతివాదానికి భిన్నంగా, గోఖలే తరహా మితవాదానికి భిన్నంగా - ఎవరూ ఎప్పుడూ వినని రీతిలో అహింసే పరమావధిగా ఇవి రెండు ఉద్యమ స్థాయిలో రూపొందసాగాయి.

మొదటగా - ఎన్నికల్ని బహిష్కరించమన్నది గాంధీ గారి పిలుపు. ఆయన పిలుపుకు వెంటనే ప్రతిస్పందించిన వారు తక్కువ. మధ్యేవాద జాతీయతా వాదులు (Moderate Nationalists) ఎన్నికల్లో పాల్గొనడానికే నిర్ణయించారు. సహాయ నిరాకరణని ప్రకటించిన గాంధీగారికి వీరంతా సహాయనిరాకరణ చేసినట్లే అయ్యింది. బ్రిటిష్ వారికి సాయపడటంగా కూడా మారింది.

బహిష్కరణ నినాదం విఫలం కావడంతో, చిత్తరంజన్ దాస్, మోతాలాల్ నెహ్రూ వంటి మితవాదులు కాంగ్రెసులోంచి బైటకు వచ్చేసి స్వరాజ్య పార్టీ పేరుతో 1925 ఎన్నికల్లో పోటీచేశారు.

అలాగే, విదేశీ వస్త్ర బహిష్కరణ, రాట్నం వడకడం, నూలు తయారు చేయడం, చేనేత వస్త్రాలను ప్రోత్సహించడం...

ఇలా గాంధీగారు మరో ఉద్యమానికి పిలుపిచ్చారు.

రాట్నం ఇంట్లో వుంటే గాంధేయవాదే... ఆ రోజుల్లో! ఖద్దరు ధరించడం జాతీయతావాదికి ఒక యూనిఫాంగా వుండేది.

కానీ, దేశంలో మేధావులు రాట్నం స్వరాజ్యం తెస్తుందంటే నమ్మలేక పోయారు.

ఒకసారి రవీంద్రనాథ్ ఠాగూర్ గాంధీ ఇద్దరూ కల్సినప్పుడు, "విశ్వకవీ-" అని సంభోదించారు గాంధీ ఆయన్ని! "మహాత్మా!" అని ఆలింగించుకున్నారు ఠాగూరు గాంధీని.

ఉభయకుశలోపరి తర్వాత, "మీరు కూడా రోజూ ఒక గంటసేపైనా రాట్నం వడకండి-" అని కోరారు విశ్వకవిని మహాత్ముడు.

"ఓ... తప్పకుండా! రాట్నం దేశానికి ఉపయోగపడ్తుందనుకొంటే గంటేమిటీ... ఎనిమిదిన్నర గంటలు వడుకుతాను - అన్నాడు విశ్వకవి. ఆయన భావంలోని వ్యంగ్యం గాంధీకి తెలియనది కాదు. అది సగటు మేధావి వర్గం ఆలోచన అని గాంధీ ఊహించిందే!

ఇలాంటి ఉద్యమాలు నడుపుతుంటే, గాంధీ బ్రిటిష్ ప్రభుత్వానికి ఏమాత్రం హానికరం కాదని బ్రిటిషర్లు కూడా భావించారు. గాంధీ కాంగ్రెస్‌లు ఒకరి కంట్రోల్లో ఒకరు వున్నంతకాలం ఏ ఇబ్బందీ వుండదనుకోసాగారు.

"సహాయ నిరాకరణోద్యమం వలన ఎవరికి నష్టం...? భారతీయులకే!" అనేది బ్రిటిష్ వారి వ్యాఖ్య.

"హర్తాళ్- అన్ని చోట్ల తాళాలు వేసెయ్యండి - ఉపవాసం పాటించండి-" అని గాంధీ ఇచ్చిన పిలుపులో లోతు ఆ తర్వాత గానీ వాళ్ళకి తెలిసి రాలేదు.

1925లో ఎన్నికల్లో పోటీచేసి చాలా చోట్ల అధికారం లోకి వచ్చిన స్వరాజ్య పార్టీ మరుసటి సంవత్సరానికే విచ్ఛిన్నం అయ్యింది. మెజారిటీ స్వరాజ్యవాదులు ప్రభుత్వానికి సహాయనిరాకరణ ప్రకటిస్తూ అసెంబ్లీలకు రాజీనామాలిచ్చి గాంధీని అనుసరించారు. 'సత్యం సౌందర్యాన్ని కౌగిలించు కొంది' గాంధీలూ, టాగూర్‌లు కలిశారు.

**(Michael Edwardes - The last years of British India)**

# ఫ్రాయిడ్ చెప్పిన విట్

'అగస్సిజ్' అనే ప్రకృతి శాస్త్రవేత్త దగ్గరకు ఆయన విద్యార్థులు ఓ చిన్న (బగ్) పురుగును తీసుకువెళ్ళి - "సార్! ఇది ఎలాంటి పురుగంటారూ?" అనడిగారట!

ఆయన పరిశీలించి చూశాడు. రకరకాల కీటకాల అవయవాల్ని తీసుకొని ఒకచోట పేర్చి తయారుచేసిన "బగ్" అది! ఆట పట్టించడానికి చేస్తున్నారని అర్థం అయ్యిందాయనకి.

చిన్నగా నవ్వి - 'హంబగ్' అనేసి వెళ్ళిపోయాడు.

**(బేసిక్ రైటింగ్స్ ఆఫ్ సిగ్మండ్ ఫ్రాయిడ్)**

# రౌండ్ టేబుల్ చర్చలు విఫలం

1931 -

గాంధీగారు వైస్రాయి ఇర్విన్‌కి భారతదేశంలో మితిమీరుతున్న పోలీస్ అత్యాచారాలు మీద ఫిర్యాదు చేశారు.

వైస్రాయి లార్డ్ ఇర్విన్ చిద్విలాసం చేసి - "జరిగిందేదో జరిగింది. మరిచిపోండి - భవిష్యత్తు గురించి ఆలోచించండి-" అన్నాడు.

గాంధీగారు ఈ సమాధానాన్ని జీర్ణించుకోలేకపోయాడు. ఇద్దరి మధ్యా ప్రతిష్టంభన పెరిగింది.

మితవాదులు ఇర్విన్‌ని కలిసి గాంధీ గారిని ఎలాగైనా చర్చలకు రప్పించి ఆహ్వానించమని వత్తిడి చెయ్యసాగారు. ఇదే వత్తిడి గాంధీపైన కూడా వచ్చింది. తప్పని సరి పరిస్థితుల్లో - ...

రాజకీయ ఖైదీలందరిని విడుదల చెయ్యమని ఆదేశించింది ప్రభుత్వం.

గాంధీగారు సహాయ నిరాకరణోద్యమాన్ని విరమించడానికి అంగీకరించాడు. రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొనడానికి ఒప్పుకొన్నాడు.

ఒక విధంగా ఇది ఇర్విన్ విజయం. కాంగ్రెస్‌ను దారికి తెచ్చినందుకు -

ఇంకోవిధంగా కాంగ్రెస్‌కూ విజయమే! భారత దేశం మొత్తానికి ప్రాతినిధ్యం వహించేదిగా కాంగ్రెస్‌ను గుర్తించినందుకు.

కానీ, బ్రిటన్‌లో దీని ప్రభావం చాలా ప్రకంపనలకు కారణం అయ్యింది. బాల్ట్‌విన్‌ని కన్జర్వేటివ్ పార్టీ నాయకత్వం నుంచి ఈ వంకతో దింపెయ్యడానికి చర్చిల్ పూనుకొన్నాడు. బ్రిటన్ సార్వభౌమత్వాన్ని దెబ్బతీసే ఈ చర్యకు నిరసనగా చర్చిల్ చివరికి తన మంత్రి పదవికి రాజీనామా కూడా చేశాడు.

అదిలా వుంటే, దేశంలో గాంధీ గారిక్కూడా అంతేస్థాయిలో వ్యతిరేకత ఏర్పడింది. నెహ్రూ వంటి నాయకులు ఈ రకమైన సెటిల్‌మెంట్లకు అంగీకరించలేక పోయారు. సుభాష్ చంద్రబోస్ ఘాటుగా గాంధీని విమర్శించాడు.

ప్రభుత్వం రాజకీయ ఖైదీలకు ఇచ్చిన క్షమాభిక్షని మరణ శిక్షపడిన వారిక్కూడా వర్తింపచెయ్యాలని గాంధీ గట్టిగా పట్టుబట్టాడు. భగత్‌సింగ్ ఉరిశిక్షని రద్దు చెయ్యమని కోరాడు.

కానీ, చర్చిల్ వంటి వ్యక్తుల వైఖరి వలన బ్రిటన్‌లో ఏర్పడిన పరిణామాలు ఇర్విన్ చేతులు కట్టేశాయి. గాంధీ గారు ఈ విషయంలో ఓటమిని అంగీకరించక తప్పలేదు.

గాంధీ ఇష్టపూర్తిగా ప్రయత్నం చెయ్యలేదనీ, హింసా పూరిత ఉద్యమాలకు ఆయన వ్యతిరేకం కాబట్టి గట్టి వత్తిడి తీసుకురాలేక పోయాడనీ ప్రజలు భావించారు. భగత్‌సింగ్ ఉరిశిక్ష తర్వాత "ఇది ఫస్ట్ క్లాస్ బ్లండర్" అన్నాడు గాంధీ. కానీ, కాంగ్రెస్ త్వరలోనే భగత్‌సింగ్‌ని మరిచిపోయింది.

ఈ లోగా ఇర్విన్‌ని వెనక్కి పిలిపించారు.లార్డ్ విల్లింగ్‌డన్ 1931 ఏప్రియల్‌లో వైస్రాయిగా వచ్చాడు.

రామ్‌సే మెక్డొనాల్డ్ బ్రిటన్ ప్రధానిగా ఎన్నికయ్యాడు. రౌండ్ టేబుల్ సమావేశానికి గాంధీ, కాంగ్రెస్ ప్రతినిధి బృందంతో కలిసి హాజరయ్యాడు.

రామ్‌సే మెక్డొనాల్డ్ కాంగ్రెస్ బృందాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ -

"నా హిందూ, ముస్లిం స్నేహితుల్లారా..." అన్నాడు. ఈ సంభోదనలో కొంటెతనాన్ని గమనించారు గాంధీ. వెంటనే లేచి, "ఇక్కడ కేవలం ఇండియన్లు మాత్రమే వున్నారు" అని సవరించాడు. దానికి, మరింత కొంటెగా బ్రిటన్ ప్రధానమంత్రి "నా హిందువులు, మరియు ఇతర స్నేహితులారా!" అని సవరించాడు.

గాంధీ చాలా స్పష్టంగా "హిందువులూ, ముస్లింలు ఇద్దరూ ఒకటే - మేమంతా భారతీయులం. మేమంతా కాంగ్రెస్ పార్టీ ప్రతినిధులం. భారతదేశం తరఫున ఇక్కడ హాజరయ్యాం" అని ఘాటుగా సమాధానం చెప్పాడు.

మొత్తం మీద చర్చలు సుహృద్భావ వాతావరణంలో జరగలేదు.

గాంధీ ఇండియాకి తిరిగొచ్చేసరికి నెహ్రూ వగైరా కాంగ్రెస్ నాయకుల్ని అరెస్టు చేయించింది ప్రభుత్వం.

ఇది "క్రిష్టియన్ వైస్ రాయి భారతదేశానికి ఇచ్చిన క్రిస్మస్ బహుమతి -" అన్నారు గాంధీ కోపంగా!

ఆ వెంటనే సివిల్ డిజొబీడియన్స్ ఉద్యమాన్ని పునఃప్రారంభించాలని కాంగ్రెస్ నిర్ణయించింది.

కథ ఎక్కడ ఆగిందో అక్కడ నించి మళ్ళీ మొదలయ్యింది!

కానీ, హింసాత్మక ఉద్యమాలు కొత్త సహాయనికారణోద్యమాన్ని దాటి చాలా ముందుకు పోయాయి.

దేశం గాంధీ గారి అదుపులోంచి తప్పినట్లు అన్పించింది... ప్రతి ఒక్కరికీ!!

**(Michael Edwardes : The Last years of British India)**

### విశాఖపట్నం మీద

# జపాన్ బాంబులు

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో అట్లాంటిక్ ఛార్టర్ పేరుతో ఆమోదించిన తీర్మానాలలో బ్రిటిష్, అమెరికా తదితర దేశాలన్నీ "తమ ప్రభుత్వాల్ని తామే ఎంపిక చేసుకునే హక్కు ప్రజలకుంది–" అనే తీర్మానం ఒకటి.

ఇది బ్రిటిష్ అనుకూల దేశాలు కలిసి, తమ శత్రువులు ఆక్రమించుకున్న దేశాల ప్రజల మీద సానుభూతితో చేసిన తీర్మానం.

ఈ తీర్మానం చెయ్యగానే బ్రిటన్ ప్రధాని చర్చిల్ నాలిక్కరుచుకున్నాడు. "తూచ్' అన్నాడు. "ఇది యూరోపియన్ దేశాలకే గాని, తూర్పు దేశాలకీ, భారతదేశానికి వర్తించే తీర్మానం కాదు–" అని వీణనొక్కులు నొక్కడం మొదలుపెట్టాడు.

ఇలాంటి వేషాలు కుదరవని అందరూ గట్టిగా వాదించారు.

నాజీ నియంత ప్రదర్శిస్తున్న జాతి విద్వేషానికి (Racial Discrimination) వ్యతిరేకంగా బ్రిటిష్ పోరాడుతుందనీ, ఈ యుద్ధం తర్వాత భారతీయులు తమకు నచ్చిన ప్రభుత్వాన్ని ఎంపిక చేసుకోవచ్చునీ చేసేది లేని స్థితిలో బ్రిటన్ అధికారికంగా ప్రకటించింది. కానీ, ఈ ప్రకటనని ఎవరూ నమ్మలేదు.

"The right of all people to choose the government under which they live" అనే మాటలు వినడానికి అందంగా వున్నాయి గానీ, ఆచరణలో పెట్టగలిగే ధైర్యం బ్రిటన్‌కు లేదని అందరి అభిప్రాయం ఆనాడు.

ఇదంతా భారతీయుల్ని మంచి చేసుకొని భారత దేశాన్ని కూడా యుద్ధంలోకి లాగడానికి బ్రిటన్ ఆడుతున్న నాటకం అని అర్థం అయిపోయింది... ప్రజలకు

1941 డిసెంబర్ నాలుగున మౌలానా అజాద్, నెహ్రూ తదితర నాయకుల్ని జైలు నించి విడుదల చేసి భారత్‌కు బ్రిటిషర్లే మిత్రులు... అని నమ్మించబోయింది ప్రభుత్వం.

అంతలోనే అనుకోకుండా అమెరికా పెరల్ హార్బర్ మీద జపాన్ బాంబులు వేసింది.

అంటే, నిద్రపోతున్న సింహాన్ని నిద్రలేపే పనిని జపాన్ చేసింది!

విశాఖపట్నం హార్బర్ మీద కూడా అంతే స్థాయిలోనూ బాంబులు పడ్డాయి.

తనకు తెలియకుండానే భారత్ యుద్ధ భూమిగా మారిపోయింది! అందుకు ముందుగా ఉత్తర కోస్తా జిల్లా ఆంధ్రులు బలి పశువులయ్యారు.

"మున్నూరు గడప" పేరుతో కీ॥శే॥ మైత్రేయ గారు వెలువరించిన నవలలో ఆనాటి భయానక సంఘటనలు వివరంగా వున్నాయి -

"ఒక రోజు ఆఫీసుకు వెళ్తుంటే,

తలపై నుంచి విమానాలు వెళ్తున్నాయి. రెండు విమానాలు సూర్యరశ్మికి వెండి విమానాలా అన్నట్టు మెరుస్తున్నాయి.

ఆ వెనుక నాలుగు వచ్చాయి. ఆ వెంటనే సైరన్‌లు మ్రోగుతున్నాయి.

ఒక్క నిమిషంలో సైకిల్ అవతల పారేసి ఒక హోటల్‌లోకి దూరేను. ఇలా చాలా మంది దూరారు.

అంతా జపాను ప్లేన్లు, జపాను ప్లేన్లు అంటున్నారు.

సైరన్‌లు మ్రోగుతున్నాయి.

బాంబులు పడ్తున్న శబ్దాలు వినిపిస్తున్నాయి.

హోటల్ ఉన్న డాబా వణికిపోతోంది.

విమానాలు కూల్చే శతఘ్నులు మ్రోగుతున్నాయి. అందరం నోట్లో చెంచాలు పెట్టుకొని బోర్లా పడుకున్నాం.

ఈలోగా అక్కడ చేరిన ఆడవాళ్ళు, పిల్లలు గోలగోలగా హృదయ విదారకంగా ఏడ్చారు.

బాంబుల మోతలు అయిపోయి లేచిం తరువాత అందరం బ్రతికున్నందుకు సంతోషించాం.

స్టేషన్లో, రైలులో - ఎక్కడ పదిమంది ఎక్కినా దిగినా ఒకటే విచిత్రమైన కబుర్లు - "ఇంక విశాఖపట్నం నాశనం. జపానోళ్ళు సామాన్యులు కారు-" అన్నారు కొందరు.

బ్రిటిష్ వాడు ఈ దెబ్బతో దేశం వదిలి వెళ్ళిపోతాడు. గాంధీగారు స్వాతంత్ర్యం తెస్తారు-" అన్నారు మరికొందరు.

"నేతాజీ సుభాష్ చంద్రబోస్ జపాన్ సైన్యాలతో వచ్చాడు" అన్నారు మరి కొందరు.

"అసలు సుభాస్ చంద్రబోస్ చెప్పి విమానాలు పంపించి వుంటాడు. బాంబులు పంపించి వుంటాడు. జనం మీద వెయ్యొద్దని చెప్పి వుంటాడు. అందుకనే జపాను వాళ్ళు బాంబులు జనం మీద వెయ్యకుండా హార్బర్ మీద వేశారు-" అన్నారు కొందరు.

దారిలో తెల్సింది కాకినాడలో కూడా బాంబులు పడ్డాయని..." ఇలా సాగుతుందావర్ణన.

(మైత్రేయ మున్నూరు గడప 1వ భాగం)

# వేములవాడ భీమకవి మరణం

తెలుగు పద్య కవితకు ఆదికవి నన్నయ అయితే, తెలుగులో తిట్టు కవితకు ఆదికవి వేములవాడ భీమకవి. ఈ ఇద్దరూ సమకాలికులనీ, కానీ, ఇద్దరి మధ్యా స్నేహం లేదనీ పండితులు భావిస్తారు.

భీమకవి 'రాఘవ పాండవీయం' అనే రెండర్థాల కావ్యాన్ని రాసి రాజరాజ నరేంద్రుడి మెప్పుకోసం తీసుకువెళ్ళాడట. ఒక అర్థంలో రామాయణాన్ని, ఇంకో అర్థంలో భారతాన్ని సూచించే విధంగా ఈ కావ్యం ఉంటుంది.

నన్నయ గారు అసూయతో ఈ కావ్యాన్ని తగలబెట్టించి రేపిస్తా, ఎల్లుండిస్తా అంటూ కాలక్షేపం చేయడం మొదలు పెట్టాడని భీమకవికి అనుమానం.

అందుకని, 'ఆంధ్ర శబ్ద చింతామణి' అని నన్నయ్యగారు రాసిన ఇంకో గ్రంథాన్ని నెమ్మదిగా తస్కరించి గోదావరి నదిలో పారేశాడట భీమకవి. అంతటితో ఆగకుండా - "భారతంలో అరణ్య పర్వం రాస్తున్నావా...? నీ రాత అరణ్యాలు పట్టిపోతుంది" అని నన్నయగారిని శపించాడట!

భీమకవి శాపం నిజం అవడం వలన కానీండీ - నిజం అవుతుందేమో అనే భయం వలన కానీండీ - నన్నయ మతిచెడి అరణ్య పర్వం మధ్యలోనే భారత రచన ఆపేశాదని - అంటారు!

ఇందులో నిజనిజాల గురించి అలా వుంచుదాం!

ఇది 'అప్పకవీయం'లో చెప్పిన కథ. 'ఆంధ్ర శబ్ద చింతామణి' నశించినందువలన బాషకు గతి లేకుండా పోయిందని పండితులు బాధపడితే, నన్నయ భారతంలోని ప్రయోగాల్ని ప్రమాణంగా తీసుకోమని భీమకవి కట్టడి చేశాడంటారు.

భీమకవి ఉద్దండుడైన కవి "వచియింతు వేములవాడ భీమన భంగి నుద్దండలీల నొక్కక్కమాటు-" అని కాశీఖండంలో శ్రీనాథకవి సార్వభౌముడు చెప్పుకున్నాడు కూడా!

".... యప్పములన్నీ కప్పలయి యన్నము సున్నము గాఁగ మాఱుచున్...." అని ఒకసారి భీమన శపించేసరికి, అప్పచ్చులు కప్పలుగా, అన్నం సున్నంగా, కూరలు గులకరాళ్ళుగా మారాయి. మళ్ళీ అందరూ ప్రార్థిస్తే ".... బూర్వ స్థితిం జెంది భోజన వస్తు ప్రకారంబులన్నియు యథా స్వస్థంబులేఁగావుతన్ -" అనగానే ఆహారపదార్థాలన్నీ యథాప్రకారం మామాలూ అయ్యాయి.

భీమకవి శాపానుగ్రహశక్తిని చాటిచెప్పే ఇలాంటి కథలు చాలా వున్నాయి. కళింగ గంగు అనే రాజుని కూడా "తీరిక లేదు - తర్వాత రా!" అన్నాడని - కోపంతో, ఇలానే తిట్టాడు భీమకవి. అక్షరాలా ఆయన తిట్టినట్లే 32 రోజులయ్యేసరికి శత్రురాజులు అతని రాజ్యాన్ని ఆక్రమించారు. మారువేషంలో తప్పించుకొని ప్రాణాలతో బైటపడి అడుక్కొని తింటూ కాలం వెళ్ళబుచ్చుతున్నాడు- కళ్యాణగంగు

ఒకరోజు చీకట్లో భీమకవి ఇంటి గుమ్మం ముందు కాలుజారి పడ్డాడతను.

"ఎవడవురా నువ్వు" అడిగాడు భీమకవి అతన్ని లేపి -

"భీమకవి చేసిన జోగిని (బిచ్చగాణ్ణి)" అన్నాడతను

"ఓహో... రాజ కళింగ గంగువా?" అన్నాడు అతన్ని గుర్తించిన భీమకవి.

అనుగ్రహించమని కవిగారి కాళ్ళమీద పడి బతిమాలుకున్నాడు గంగు

"వేయి గజంబులుండఁ బదివేల తురంగములుండ నాజిలో
రాయల గెల్చి సజ్జ నగరంబునఁ బట్టము గట్టకోవడిన్
రాయ కళింగ గంగు! కవి రాజు భయంకర మూర్తిఁ జూడఁదాఁ
బోయిన మీన మాసమునఁ బున్నమ వోయిన షష్ఠి నాఁటికిన్-"

"కవిరాజు, భయంకర మూర్తి అయిన భీమకవిని చూసిన ఈ నెల ఈ ఆషాఢం తర్వాత షష్ఠి నాటికి పట్టం కట్టుకొమ్మంటూ ఆశీర్వదించాడు.

కళింగ గంగు శత్రురాజుని చంపి రాజ్యాన్ని తిరిగి కైవసం చేసుకొన్నాడు. అది వేరే కథ!

కానీ, ఈ పద్యానికే ఇంకో అర్థం కూడా వుంది -

రాయ కళింగ గంగూ! కవిరాజు (అంటే భీమకవి), భయంకర మూర్తి (యముడు)ని చూసిన... ఈ ఆషాఢ పౌర్ణమి వెళ్ళిన షష్ఠి నాటికి పట్టం కట్టుకొమ్మని ఆశీర్వదించినట్లు మరో అర్థం కూడా స్ఫురిస్తోంది...

దీని అర్థం ఇంకా స్పష్టంగా చెప్పాలంటే - భీమకవి మరణించిన రోజునే కళింగ గంగు శత్రు సంహారం చేసి రాజ్యం సాధించుకొంటాడని!

ఈ విధంగా -

భీమకవి మరణానికి శాపానుగ్రహ సమర్థత కల్గిన అతని మాటలే కారణం అయ్యాయి... మహాకవుల నోటి మాట వెంటే వుంటారు కాబోలు తథాస్తు దేవతలు !

**(తెలుగులో తిట్టు కవిత్వము - రావూరి దొరస్వామి శర్మ)**

